

# దీపావళి సంచిక

ఈ యేడాది నవంబరులో దీపావళి రాబోతోందనేది మీ కెలా న్యూస్ కాదో, దీపావళికి "జ్యోతి" ప్రత్యేక సంచిక రాబోతోందనేది కూడా మీకు న్యూస్ కాదు. ఇప్పటికి మూడు దీపావళి "జ్యోతి" సంచికలు మీరు చూశారు. నాలుగోదికూడా దీపావళి దీధితులతో రాకేం చేస్తుంది ?

కాని, ఒక వార్త — ఈ సారి "జ్యోతి" నవంబరు సంచిక మామూలుగానే వెలువడుతుంది. దీపావళికి మరొక విశేష సంచిక వస్తుంది.

నవంబరు మొదటి వారంలో విడుదల. సాధా...
రెట్టింపు [1/4 డెమీ] సైజులో 250 పేజీలు ...

సుప్రసిద్ధ రచయితల కథలు, పద్య...
విషయాలపై వ్యాసాలు, త్రివర్ణ చిత్రాలతో, ...
మెదడుకు విందుగా, కనులకు పసందుగా వెలువడుతుంది.

## అడ్వర్టయిజ్‌మెంట్ రేట్లు

| | | |
|---|---|---|
| పూర్తిపేజీ | — | రూ. 200 |
| అరపేజీ | — | రూ. 110 |
| ఓపెనింగ్ పేజీ | — | రూ. 250 |
| వెనుకఅట్ట మూడు రంగులలో | — | రూ. 800 |

ఇతర వివరాలకు : మేనేజరు "జ్యోతి" సచిత్ర మాసపత్రిక, కాంగ్రెసు ఆఫీసురోడ్డు, విజయవాడ-2 చిరునామాకు వ్రాయ గోర్తాము.

# తొలిమాట

ఆంధ్ర ప్రదేశ్‌లో రాజకీయాలు రోజు రోజుకు మహా విచిత్రంగా తయారవుతున్నాయి అవి కాంగ్రెసులో ముఠాల రాజకీయాలే కావచ్చు కాని, కాంగ్రెసు అధికారంలోవున్న పార్టీ ఆ పార్టీ నుంచి ఎన్నికైనదే మంత్రి వర్గం. అందుచేత దానిలో ప్రవేశించిన విష వాతావరణం ప్రభుత్వాన్ని, పరిపాలనను కూడా కలుషితం చేయగల ప్రమాదం వుంది. క్రమశిక్షణతో, బాధ్యతతో మెలగాలని ప్రజలను ప్రతిదినం ఉద్బోధించే నాయకులే క్రమశిక్షణ, బాధ్యత లేకుండా ప్రవర్తిస్తుంటే ఇక చెప్పేదేముంది ?

(11 వ పేజీ)

* * *

గత సంచికలో మేము ప్రచురించిన "కాస్మొపాలిటన్" శ్రీ తిలక్ అంతిమగేయం కాగలదని, ఈసంచికలో వారి "ఒక మిత్రుడు" వ్రాసిన స్మృత్యంజలిని ప్రచురించవలసి వస్తుందని మేము ఊహించలేక పోయాము (15 వ పేజీ)

* * *

"జ్యోతి" దీపావళి విశేష సంచిక వివరాలు

(3 వ పేజీ)

* * *

సిద్ధహస్తులు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి పెద్దకథ "మారిన జీవితం" (47 వ పేజి)

[illegible]



సుచిత్ర మాసపత్రిక
బకింగ్‌హామ్ పేట పోస్టు
విజయవాడ-2.

విడిప్రతి వెల
75 పైసలు

ఏడాది చందా
9 రూపాయలు

సంపుటి 4
ఆగస్టు 1966
సంచిక 8

మేనేజింగ్ ఎడిటర్
వి. వి. రాఘవయ్య




"బాలగంగాధర తిలక్" మరణ వార్త విని దిగ్భ్రమ చెందాను. "కాస్మాపాలిటన్" చదివిన ఆనందం మరుక్షణం విషాదం అయింది. 'శ్రీ శ్రీ' యుగం అభ్యుదయ కవులలో ఒక 'నక్షత్రం' రాలిపోయింది.

కంభంపాటి వెంకటరత్నం,
కొండపల్లి

తిలక్ కథల్లోనూ, గేయాల్లోనూ మానవతావాదం మహోత్కృష్ట రీతిని ప్రతిబింబించేది.

"విన్నరాత్రి," "నగరంపై ప్రేమ గీతం," "నెహ్రూ," "కిటికీ," "నీవు లేవు నీ పాట వుంది." మొదలగు గేయాలు ఎన్నడూ మరువలేము.

ఎస్. ఆర్. ప్రతాపరెడ్డి,
తుంగభద్ర డాం.

ప్రసిద్ధ కథా రచయిత, కవి, నాటక కర్త శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్ స్వర్గస్థులయినారన్న వార్త విని నిర్ఘాంతపోయినాము. "జ్యోతి"లో ఆయన వ్రాసిన కథలు ఎప్పటికీ మా మనస్సులలోనుండి చెరిగిపోలేవు. తిలక్‌గారు మాకు పరిచయమైనది జ్యోతి ద్వారానే. వారి కుటుంబానికి మా గాఢ సంతాపాన్ని తెలియజేయమని మిమ్మల్ని అర్థిస్తున్నాము.

వి. ఎల్. ఎన్. సత్యనారాయణ,
విజయవాడ.

జూలై కథలన్నీ ఒక ఎత్తు," "పట్నం మామయ్య" కథ ఒక ఎత్తు. జీవితపు లోయల్ని తరచి చూస్తూ, జీవితాన్ని అనుభవించటంలో ఒక అనుభూతి, మాధుర్యాన్ని అనుభూతంచేస్తూ ఒక, సందేశాన్ని, భవితవ్యాన్ని సూచిస్తూ....చివరికి వేదాంత చర్చతో_కథను ముగించారు రచయిత. ఇంత మంచి కథని అందజేసినందుకు మీకూ రచయితకి నా ధన్యవాదములు.

చిల్లా సత్యనారాయణ రెడ్డి,
వాల్తేరు.

జూలై జ్యోతిలో నా మనసుకి నచ్చిన మధురాంతకం వారి కథ ప్రచురించినందుకు మీగ్ నా హృదయపూర్వకాభివందనములు. చక్కని కథాశైలికి, చిక్కని కథా వస్తువు నెంచుకోటానికి మధురాంతకంవారు సిద్ధహస్తులన్నది నిర్వివాదమైనది. ఇకపైన కూడా మీరు యిలాటి ఆలోచనా తరంగాలని రేకెత్తించే కథల్ని ప్రచురిస్తారని ఆశిస్తాను.

ఎ. ఎస్. రత్నం,
పర్భనీ (మహారాష్ట్ర)

"జ్యోతి"లో రాజకీయాల చర్చ బాగుంది. చిన్న కథలలో "నిజాయితీ" చక్కగా ఉంది.

సి. హెచ్. రవీంద్రనాధ్,
కాకినాడ.

డాక్టర్ మహీధర నళినీమోహన్ గారి "రాకెట్ ఎలా ఎగురుతుంది." అనే వ్యాసం విజ్ఞానయుతమైనదిగాను, సులభ శైలిలోను ఉండి అందరికీ అర్ధమయ్యేలా ఉంది. ముందుముందు డాక్టరుగారి యిట్టి రచనలు ప్రచురింప ప్రార్థన.

అల్లంరాజు లక్ష్మీపతి,
గొల్లప్రోలు.

"రాకెట్టు ఎలాగు ఎగురుతుంది" అన్న వ్యాసం చాలా బాగున్నది. ఇటువంటి విద్యా విషయకమైనవి ప్రచురిస్తున్నందుకు చాలా అభినందిస్తున్నాను. ఇటువంటి విషయాలు ఇటుపైన కూడా ప్రచురించగలరని ఆశిస్తున్నాను.

ఎస్. శ్రీరామమూర్తి,
అనకాపల్లి

జూలై 'జ్యోతి'లోని 'రాకెట్టు ఎలా ఎగురుతుంది?' వ్యాసం నన్నెంతో ఆకర్షించింది. డాక్టర్ నళినీమోహన్ గారికి నా అభినందనములు.

కేవలం కధలే గాకుండా, రాజకీయ, వైజ్ఞానిక విషయాలనుకూడా మా కందజేస్తున్నందుకు నా అభినందనాలు.

జి. పురుషోత్తమరావు,
ఎల్లారెడ్డిగూడ.

పోటీ కధలలో "అరటితొక్క" కన్న "నిజాయితి" కధానిక చాలా బాగుంది. నళినీ మోహన్ గారి వ్యాసాలు చాలా బాగుంటున్నవి.

ఎర్నేని రామారావు,
సూర్యాపేట.

ఈ నెల ప్రధమ బహుమతి పొందిన "అరటితొక్క" చాలా నీతి దాయకంగా వున్నది. రచయిత్రికి నా హృదయ పూర్వక అభినందన లందజేయ ప్రార్ధన.

కె. భాస్కర్,
హైదరాబాదు.

జూలై జ్యోతి చాలా చప్పగా ఉంది. ఇంకోలా చెప్పాలంటే చాలా నిరాశ కూడా కలిగించింది. ఉన్న రెండు కధలలోను "పట్నం మామయ్య" అన్నకధ కొద్దిగా బాగుంది. ఇకనుంచి సీరియల్స్ కాక అధమం నాలుగు కధలైనా ప్రచురించమని మనవి.

జనార్దన,
గుడివాడ.

## ఆంధ్ర




# సిసలైన రాజకీయవేత్త

"రెడ్డొచ్చె మొదలాడరా" అని సామెత. ఆంధ్ర రాజకీయాలు ఎక్కడికి వెళ్ళినా, మళ్ళీ మొదటికే వస్తూ వుంటాయి. అది వాటి సహజ లక్షణం. అయినా ఈ మధ్య రెండేళ్లుగా నిశ్శబ్దంగా, నిర్మలంగా వున్నట్టు కనబడిన ఆంధ్ర రాజకీయాలు, రంగంలో శ్రీ సంజీవరెడ్డి కాలుపెట్టడంతో మళ్ళీ మొదటికే వచ్చాయి.

ప్రపంచ రాజకీయాలలో రెండు ప్రధాన రాజ్యకూటాలున్నా, కనీసం తటస్థ రాజ్యాలనే పేరుతో, ఏ కూటంతోను చేరని దేశాలు కొన్ని వున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసు అలా కాదు; రెండు కూటాలుగా నిలువునా చీలిపోయింది. కాంగ్రెసువాదు లందరు ఏదో ఒక కూటంలో చేరిపోయారు. ఇంకా చేరకుండా గోడమీద పిల్లివాటంగా వున్నవారు కూడా, ఎటో అటు చేరడానికే చూస్తున్నారు. కూటనీతి స్వైర విహారం చేస్తోంది.

ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా వుంది. పాపం ఆయన్ని చూస్తే జాలేస్తుంది. ఆయన గద్దె ఎక్కడానికి కారకుడైన శ్రీ సంజీవరెడ్డి ఈనాడు ఆయన్ని దించివేయడానికి యత్నిస్తున్నారు. ఈ తగవులన్నీ ఎందుకు, ఎలా వచ్చాయో తెలియదుగాని, బ్రహ్మాండంగా ముదిరి పోతున్నాయి. రాష్ట్ర మంత్రివర్గంలోనే ఆయనకువ్యతిరేకు లెక్కువైపోయారు. బహిరంగంగా, బాహాటంగా ఆయన్ని పట్టుకుని విమర్శిస్తున్నారు.

ఈ పరిస్థితులలో ఆయన తనకు చేతనైన పని ఒకటీ చేసి వూరుకున్నారు. శ్రీ సుబ్బారెడ్డి నుంచి ఇరిగేషన్ శాఖ, శ్రీ రామచంద్రారెడ్డి నుంచి రెవిన్యూ శాఖలాగేసుకుని తను పుచ్చుకున్నారు. శ్రీ రామచంద్రారెడ్డికి ఆహార శాఖ ఇచ్చారు. ఇంకా ఏవో మార్పులు చేశారు.

ఎన్నికలు ఇంకో ఆరునెలల్లో రాబోతుండగా ఈ మార్పులన్నీ ఆయన తలపెట్టడం తెలివి తక్కువగానే కనిపిస్తుంది. కాని, ఆయన చేయగలిగింది అదొక్కటే. పరిపాలనా సౌలభ్యం కోసమే ఈ శాఖల మార్పులు చేసినట్లు హైదరాబాదులో ప్రకటించారు. కాని, తనకు వ్యతిరేకులైన మంత్రులు అధికార దుర్వినియోగం చేసినట్టు,

అందుకే వారి శాఖలను తాను తీసుకున్నట్టుఢిల్లీ గో చెప్పారు. తన చర్యను సమర్థించు కోవడం ఆయనకే కష్టమై పోయింది.

ఈ మార్పులకు నిరసనగా కొందరు మంత్రులు, చాలామంది శాసనసభ్యులు రాజీనామా లివ్వడానికి సిద్ధ పడినట్టు వార్తలు వచ్చాయి గాని, ఈ వ్యాసం వ్రాస్తున్న సమయానికి ఇంకా ఏమీ తేలలేదు. మొత్తం మీద రాష్ట్రంలో కాంగ్రెసు రాజకీయాలు శ్రుతిమించి రాగాన పడ్డాయి; కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ్ హైదరాబాదు విమానాశ్రయంలో అన్నట్టు పిల్లల ఆటలాగా తయారయ్యాయి.

* * *

మాకియవెల్లి వ్రాసిన "ది ప్రిన్స్" శ్రీ సంజీవరెడ్డి చదివారో లేదోగాని, ఆ పుస్తకానికి ఆయనే హీరోలాగ కనిపిస్తారు. ఆంధ్రదేశంలో రాజకీయ వేత్తల మనుకునేవారు చాలామంది వున్నారు. కాని శ్రీ సంజీవరెడ్డితో పోలిస్తే వారంతా నోట్లో వేలు పెట్టినా కొరకలేని పసిపిల్లలే. సిసలైన రాజనీతివేత్త శ్రీ సంజీవరెడ్డి. అందుకే ఆయన పుట్టిన అయిదారేళ్ళకి రాజకీయాలు పుట్టాయని కిట్టనివాళ్ళు అంటూ వుంటారు.

ఆయన దృష్టిలో ఆంధ్ర రాజకీయ రంగం ఒక ఒర లాంటిది. దానిలో రెండు కత్తులు ఉండడానికి వీలులేదు. ఒకటే ఉండాలి. అది తానే అయి ఉండాలి.

ఆయన దృష్టిలో ఆంధ్ర రాజకీయ రంగం చదరంగం లాంటిది కూడా. మిగతా వారంతా ఆయన చేతిలో పావులు. ఆయన వేసిన ఎత్తు సాధారణంగా వృథాపోదు, ఆయన పాచిక పారకుండా పోదు.

1951లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి శ్రీ రంగాతో పోటీ చేసి గెలవడంతో శ్రీ సంజీవ రెడ్డి రాజకీయ జీవితం ఒక పెద్ద మలుపు తిరిగింది. ఆ మలుపు దారిలో నే, ఆనాటినుంచి నేటివరకు ఆయన ముందుకు పోవడమే తప్ప, వెనుకకు రావడం జరగలేదు. ఇది ఆయన అదృష్టం అనడం కంటె, రాజకీయ చాతుర్యం అనడం సమంజసం.

రాజకీయాలలో జరిగే విచిత్రాలు చాలా ఆశ్చర్యకరంగా వుంటాయి. సామాన్యులకు గందరగోళంగా వుంటాయి. ఎప్పుడేది ఎందుకు జరుగుతుందో చెప్పడం కష్టం. చాలా కాలంగా మిత్రులుగా వున్నవారు యిట్టే విడిపోతారు. గర్భశత్రువులు గాఢ మిత్రులై పోతారు. ఏరోజున ఎవరెకెవరో చెప్పడం అసాధ్యం.

శ్రీ రంగాకు ప్రతిద్వంద్విగా శ్రీ సంజీవరెడ్డికి శ్రీ గోపాలరెడ్డి మిత్రులు, అయినా, తన దారికి ఆయన అడ్డు తొలగించుకొనడానికి అల్లూరి, బ్రహ్మానందరెడ్డి గార్లను ఉపయోగించుకున్నారు. ఆ తర్వాత అల్లూరిని దెబ్బ



మాస్కోలో భారత ప్రధాని

శ్రీమతి ఇందిరాగాంధి

---

తీయడానికి శ్రీ బ్రహ్మానందరెడ్డి ఉప యోగ పడ్డారు. ఇప్పుడు శ్రీ బ్రహ్మానందరెడ్డిని దించివేయడానికి శ్రీ సుబ్బారెడ్డి ఉపయోగ పడుతున్నారు.

నిన్నటివరకు శ్రీ రఘురామయ్యను శ్రీ సంజీవరెడ్డికి ప్రబల విరోధిగానే లోకం ఎరుగును. అయినా, ఈనాడు వారు గాఢమిత్రులు. శ్రీ రఘురామయ్య ఏ వేదికనుంచి శ్రీ సంజీవరెడ్డిని తూర్పార పట్టేవారో, ఆ వేదికనుంచే ఆయనను ఈ రోజున బ్రహ్మాండంగా ఆకాశానికి ఎత్తేస్తున్నారు.

శ్రీ సంజీవయ్య కూడా అంతే. ఏడేళ్ళుగా ఈ సంజీవ ద్వయం మధ్య పచ్చగడ్డి మొలవలేదు. మొలిచినా వెంటనే మాడిపోయేది. ఈనాడు వా రిద్దరు చెట్టాపట్టా లేసుకుని తిరగడం వింతలలో వింత.

శ్రీ సుబ్బారెడ్డి మాత్రం? నెల్లూరు జిల్లాలో శ్రీ గోపాలరెడ్డిని దెబ్బ తీయ

డానికి ఆయుధంగా శ్రీ సుబ్బారెడ్డితో అవసరం తీరిపోగానే, ఆయనను శ్రీ సంజీవరెడ్డి వదలి వేశారు. ఆ తర్వాత శ్రీ సంజీవయ్యను, ఇప్పుడు శ్రీ బ్రహ్మానందరెడ్డిని దెబ్బ తీయడానికి శ్రీ సుబ్బారెడ్డినే ఆయన తిరిగి చేరదీశారు.

అపర చాణక్యుడని కళా వెంకటరావుగారిని చెప్పుకునేవారు కాని, ఆ బిరుదుకు తగినవారు శ్రీ సంజీవరెడ్డి ఒక్కరే. ఈ చాణక్య నీతే ఆయనకు ఎక్కడకు వెళ్ళినా ఉపయోగపడుతున్నది. కేంద్రానికి వెళ్ళి సిండికేట్‌ను తయారు చేశారు. దాని సహాయంతో కేంద్ర ఎన్నికల సంఘంలో సభ్యత్వం అవలీలగా సంపాదించారు. తలచుకుంటే ఆయన ప్రధాని కావడమైనా కష్టంకాదని కొందరంటారు. కాని, తలచుకుంటారా అన్నదే అనుమానం. ఆయన ఆలోచనలు భారతదేశమంత విశాలం కావు. ఆంధ్రప్రదేశ్ అంత చిన్నవి. అవి ఎప్పుడూ ఇక్కడే తిరుగుతూ వుంటాయి. కాంగ్రెసు అధ్యక్ష పదవిలోవున్నా, కేంద్రంలో మంత్రి పదవిలో వున్నా అవి రాష్ట్రాన్నే పట్టుకుని వేళ్ళాడుతూ వుంటాయి. తిమ్మిని బమ్మి, బమ్మిని తిమ్మి చేయడానికే చూస్తూ వుంటాయి. ఇప్పుడు చేశాయి కూడా.

అందుకే ఆయనకంటె సిసలైన రాజకీయవేత్త ఆంధ్రదేశంలో కంచు కాగడా పెట్టి వెదికినా దొరకడు. ఆయన ప్రతిభకు జోహార్లు అర్పించకుండా వూరుకోవడం కష్టం.

***



# కవికుల తిలకుడు శ్రీ తిలక్

వెన్నవంటి మనసు - వెన్నెలవంటి చిరునవ్వు - మంచి తనానికి మారు పేరు - శ్రీ బాలగంగాధర తిలక్ పోయారంటే నమ్మడం కష్టం; ఓర్వడం మరీ కష్టం.

మనిషి ఎంత సుకుమారుడో, కవిత అంత నిశితమైనది. భాష ఎంత మెత్తనిదో, భావాలు అంత పదునైనవి. సంఘ వంచితుల పట్ల ఎంత కారుణ్యమో, సంఘ దురన్యాయాలపట్ల అంత క్రోధం.

"ఏకో రసః కరుణఏవ" అని మహాకవి భవభూతి కరుణకు అతి విశాలమైన, ఉదాత్తమైన, మొత్తం చరాచర, చేతనా చేతన ప్రకృతిని సమస్తాన్ని ఇముడ్చుకోగల నిర్వచనం చెప్పాడు. ఆ మహార్థంలో శ్రీ తిలక్ రచనలు చేశారు. కవిత వ్రాశారు; కథలు వ్రాశారు. నాటికలు వ్రాశారు. అన్నిటిలో ఆధునిక మానవుడి అంతరాత్మకు, దానిలో జరిగే అంతః కలహానికి అద్దం పట్టారు. సంఘంలోని వంచనను, అన్యాయాన్ని, అసమానతలను తీవ్రంగా, తీక్షణంగా విమర్శించారు; అవహేళన చేశారు. కాని, అంతగాను, మానవుడి హృదయాకాశంలో చల్లని వెలుగులు ప్రసరించే సన్నని నెలవంకపై విశ్వాసాన్ని ప్రకటించారు. పీడితుల పట్ల జాలిని వలెనే, మానవుడి మంచితనం మీద నమ్మకాన్ని ఎలుగెత్తి చాటారు.

కవితా ప్రస్థానాన్ని ప్రారంభించిన తొలి రోజులలోనే ఆయన వ్రాసుకున్నట్టు

"నా అక్షరాలు
వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు
నా అక్షరాలు
కన్నీటి జడులలో తడిసిన
దయా పారావతాలు
నా అక్షరాలు
ప్రజాశక్తుల నావహించే
విజయ ఐరావతాలు"

ఆయనకు తెలుగు, ఇంగ్లీషులలో చక్కని పాండిత్యం వుంది. ప్రాచీనాధునిక పాశ్చాత్య సాహిత్యంలో చాలా భాగం ఆయనకు కరతలామలకం. అయినా, తెలుగు వచనం గాని, పద్యంగాని ఎంత బాగా వ్రాసే వారు! సుతిమెత్తని వృత్త కవితతో ప్రారంభించినా, ఆధునిక జీవితాన్ని అభివర్ణించడానికి వృత్త పరిధి చాలక వచన గేయాన్ని, ఎన్నుకున్నారు. అది ఆయన చేతిలో ఒకానొక ప్రత్యేకతను, వైశిత్యాన్ని సంతరించుకుంది; సౌందర్యాన్ని సేకరించుకుంది.

మన కళ్ళ ఎదుట ప్రతి నిత్యం జరిగిపోతున్న జీవిత నాటకాన్ని ప్రతిబింబించడానికి ఆయన కవితను, కథలను, నాటికా ప్రక్రియను సమానంగా ఉపయోగించుకున్నారు. మనకు రోడ్ల మీద తారసిల్లే వ్యక్తులు - బిచ్చగాళ్ళు, అనాథులు, అశాంతులు, దగాపడ్డ తమ్ముళ్ళు, పడుపుగత్తెలు, చీకటిబజారు చక్రవర్తులు ఇంకా ఎందరెందరినో ఆయన పాత్రలుగా తీసుకుని అసలు వేషాలలో మన ముందు నిలబెట్టారు. ఊరు చివర యిల్లు, సుందరీ - సుబ్బారావు, అతనికోరిక వంటి మరపురాని కథలెన్నో వ్రాశారు. ఆయనలో ఒక విశేషం వుంది. సమకాలిక సంఘటనలకు ఆయన వెంటనే స్పందించేవారు. వెంటనే వ్యాఖ్యానించేవారు. నవకాళి దురంతాలు జరిగిన కొద్ది రోజులకే ఆయన "అద్దంలో జిన్నా" వ్రాశారు. ఆయన భావుకత్వానికి, పద చిత్రణ శక్తికి వచోనైపుణ్యానికి అదిపరాకాష్ఠ. అలాగే మన దేశంపై చైనా దురాక్రమణ భారీయెత్తున జరగడానికి కొన్నేళ్ళముందే, హెచ్చరికగా ఆయన ఒక నాటిక వ్రాశారు.

ఆయన్ని ఎలా మరిచిపోవడం? నలభైయారేళ్ళు పెద్ద వయస్సుకాదు. ఆయన సృజనాత్మక జీవితం ఉచ్ఛస్థితిలో వుండగానే, ఇంకా అనేకంగా రచనలు చేయవలసి వుండగానే, చేద్దామనుకుంటుండగానే ఆకస్మికంగా రాలిపోయారు. పాతికేళ్ళ కిందట ఆయనలో ఏ తారుణ్యం తళుకులీనేదో, పాతికేళ్ళు గడిచినా అదే తారుణ్యం ఆయనలో చెక్కు చెదరకుండా పరిమళించేది. అప్పుడే వికసించిన మల్లెపువ్వులా వుండేవారు. వాడకుండానే, వాసన పీడకుండానే ఆయన రాలిపోయారు. ఆయన అదృష్టవంతుడేగాని, ఆంధ్ర సాహితిది ఆ దురదృష్టం.

"ఒక మిత్రుడు"

***

# మల్లెలు నవ్వాయి

"శైలూ ! ఓ శైలజాదేవీ !" గావు కేకలు పెడుతూ వచ్చాడు మురళి. సమాధానమేదీ ? వంటింట్లోకి తొంగి చూశాడు.

నిశ్శబ్దంగా తనపని యేదో చూసుకుంటోంది శైలజ.

"ప్రతిదినం చిరునవ్వుల పువ్వులను చిందిస్తూ యెదురు వచ్చేదానవు, ఈ దినం యీ దీనుని మరచిపోవడానికి కారణం తెలుసుకోవచ్చా ?" అన్నాడు మురళి.

సమాధానం లేదు.

"మూగనోము పట్టావేమిటీ ?"

శైలజ గిన్నెలో నీళ్ళను విసుగా పెరట్లోకి పారబోసింది. అడ్డంగావున్న మురళి ప్యాంటుపై కొద్దిగా నీళ్ళు పడ్డాయి.

"హతోస్మి !" ప్రక్కకు తప్పుకున్నాడు.

"నిరాయుధునితో యుద్ధం చేయడం న్యాయం కాదు" అన్నాడు నవ్వుతూ.

సమాధానం లేదు. ఎంతసేపని తానే మాట్లాడగలడు. విసుగా తన రూములో కొచ్చి పడ్డాడు. శైలజ కాఫీ తీసుకొచ్చి బల్లపైన పెట్టింది.

"దార్లో కొచ్చావా ?" అన్నాడు మురళి చిరునవ్వుతో.

"మీ రింత ఇది అనుకోలేదు."

నవ్వుతున్న మురళి నోరు ఠక్కున మూత పడింది.

"అంత మతిమరుపా ? లేక నిర్లక్ష్యమా ?"

" ........."

మౌనంగా ఉండడం ఈసారి మురళి వంతయింది.

"కావాలనే చేశారేమో !"

"........."

"బుద్ధి పోనిచ్చారు కాదు ! మగ బుద్ధి !"

" ............ "

"కట్టుకున్న భార్యనే మర్చిపోయేటంతగా మైమరచి పోవడమా ? మాట్లాడరేం ?"

"రాణీవారు మాట్లాడుతున్న విషయమేదో బోధ పడటం లేదు."

"మీ తమ్ముడు వస్తున్నాడటగా ! నాతో చెప్పకూడ దేమిటీ ?"

"ఇప్పుడు చెబుతున్నాగా ? మా తమ్ముడు వస్తున్నాడు. ముందుగా చెప్తే కిరీటం పెట్టేదానివా ?"

"మీకా భయం అక్కర్లేదు. అట్టి కిరీటం కూడా పెట్టను. పోనియ్యండి. మీ తమ్ముడెలా వుంటాడండీ ? మన పెళ్ళికి కూడా రాలేదుగా !"

---

ప్రథమ బహుమతి రూ. 50

ఆర్. వి. చలపతి
బి. యస్. సి. రెండవ సంవత్సరం,
ప్రభుత్వ కళాశాల, చిత్తూరు.

"చూద్దువు గానీ! అన్నట్టు మరో విషయం! ఇంకొక మిత్రుడు కూడా వస్తున్నాట్ట. ఇద్దరూ మిలిటరీ ఆఫీసర్లే. ఎలా చేస్తావో! అతనికి యెవరూ లేరట. చిన్నప్పుడే యిల్లు వదలి వచ్చేశాట్ట." అన్నాడు మురళి.

శైలజకు తనచిన్నతనంలోనే ఇల్లు వదలి పారిపోయిన అన్నయ్య గుర్తుకు వచ్చాడు. శైలజ ముఖంలోకి పరీక్షగా చూశాడు మురళి.

* * *

మర్నాడు శైలజా, మురళీ రైల్వే స్టేషనుకెళ్ళారు. ఠీ వి గా దిగుతున్న ఇద్దరు మిలిటరీ వాళ్ళలో తనతమ్ముడిని కౌగిలించుకున్నాడు మురళి. అన్నకన్నా పొడుగ్గా బలంగా వున్నాడు తమ్ముడు చంద్రం. అ త ని స్నేహితుడైన శ్రీపతితో కరచాలనం చేశాడు మురళి. నలుగురూ ఇంటికి వచ్చారు. క్రొత్త వ్యక్తి వుండటం శైలజకు సంకోచంగా వుంది.

ఆ దినం రాత్రి, శ్రీపతి తన కథ నంతా చెప్పు కొచ్చాడు.

"అప్పుడు మా చెల్లాయికి అయి దేండ్లు. నాకు ఎనిమిదేండ్లు, చాల చెడ్డ అలవాట్లుండేవి నాకు. ఒకసారి ఇంట్లో దొంగతనం చేసి పారిపోయాను. కొన్నేండ్లు బికారిగా గడిపిన తర్వాతనే మిలిటరీలో చేరాను."

శైలజ ఆశ్చర్యంగా వింటోంది.

"నేను, నా చెల్లెలు కలిసి తీయించు కున్న ఫొటో మాత్రం ఒకటి నా దగ్గ రుంది. అది తప్ప నేను నా కుటుంబం లోని వారిని గుర్తుంచుకునే వస్తువు లేవీ లేవు." అతను ఆపాడు. ఆ ఫొటోను చూపాడు. శైలజ ఆత్రంగా చూసింది. సందేహం లేదు! అది తానూ, అన్నయ్యా కలిసి తీయించుకున్న ఫొటో! తన దగ్గర కూడా ఒక కాపీ వుండాలి. అయితే యితను....? తన అన్నయ్యా?

"అన్నయ్యా!" అని అరిచింది ఆనందంతో.

అతనూ గుర్తుపట్ట గలిగాడు.

"చెల్లాయ్!" అన్నాడు చెమర్చిన కళ్ళతో.

ఇక శైలజ ఆనందం చెప్ప నలవి కానిది!

అతనికి సపర్యలు చేయడంలో తమను మర్చిపోవడం చూచి, మురళి "నేనూ, మాతమ్ముడూకూడా వున్నాము. మమ్మల్ని మర్చి పోయావేం? అవున్లే! యేమైనా పుట్టింటి వారంటే అభిమా నమే! అయినా అమ్మాయ్! ఈ అన్నయ్యలూ, అక్కయ్యలూ శాశ్వ తంగా నీలో వుండరు. జీవితాంతం నీవు నాతోనే వుండాలి. తెలుసా!" అన్నాడు మురళి నవ్వుతూ.

"అబ్బబ్బ! మీతో మాట్లాడలేను సుమండీ" అంది శైలజ.

నాలుగు రోజులు ఆనందంగా గడిచి పోయాయి. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. ఆ దినమంతా శైలజ దేనికోసమో వెదకు తోంది.

"ఏం కావాలి, శైలూ!" అడి గాడు మురళి.

"నేనూ మా అన్నయ్య తీయించు కున్న ఫొటో నా దగ్గర కూడా వుండా లండీ!" అంది శైలజ.

"అది దొరకదు, శైలూ!"

"మీ రెలా చెప్పగలరు?"

"సారీ, శైలూ! నిన్ను చిత్తుగా మోసం చేశాం. శ్రీపతికి నా అన్నవా ళ్ళెవరూ లేరు. అన్నా చెల్లెండ్ర ప్రేమానుబంధా లెటువంటివో అతనికి తెలియదు. తనకూ ఒక చెల్లెలితో ఆనందంగా గడపాలని వుందన్నాడట. అందుకని యీ ప్లాను వేశాం. అతను మీఅన్నయ్యకాడు. అలా నటించాడు. నేనే మన యింట్లో వున్న ఫొటోను అతనికి పంపాను. అతను యిప్పుడు చాల తృప్తిగా వెళ్ళాడు. అతను మీ అన్నయ్య కాదని తెలిసివుంటే నీ వింత ఆదరాభిమానాలు చూపగలిగే దానివా? చెప్పు!" అన్నాడు మురళి.

తోటలో మల్లెలు యీ కథ విని విచిత్రంగా నవ్వాయి.

★★★

# బ్యాక్ కారు - బొచ్చు కుక్క

ఈదురుగాలి వీస్తోంది. ఇప్పుడో, మరు క్షణమో అన్నట్లు గర్జిస్తున్నాయి మేఘాలు. చీకటి జడల దయ్యంలా విరబోసుకుంది.

'ఠంగ్, ఠంగ్...' గడియారం రెండు గంటలు కొట్టింది.

శాంతి కళ్ళలోంచి నీటిబొట్లు రాలేయి.

బాల్కనీలోంచి తొంగి చూసింది. చీకటే కానవచ్చింది. క్రింది కారి డార్‌లో బొచ్చుకుక్క బొంయ్ మంది.

శేఖరం యింకా యింటికి రాలేదు. రాడు కూడా. పట్టికెళ్ళిన డబ్బు అయి పోయినా యింటికి రాడు. ఆ ఆట మోజు అలాంటిది.

'జీవితంలో బ్యాంక్ బాలెన్సూ, బొచ్చు కుక్కా, బ్యూక్‌కారూ ఇవన్నీ మనసిచ్చే మనిషికన్నా గొప్ప వా శాంతీ?' ఆనాడు రవికాంత్ అన్న మాటలు యింకా చెవుల్లో గింగురు మంటున్నాయి. శాంతి మనస్సు గతం లోకి ప్రయాణించింది.

---

ద్వితీయ బహుమతి రూ. 25

సోమంచి రమాదేవి

థర్డ్ బి. ఎ., పి. ఆర్. గవర్నమెంట్ కాలేజీ, కాకినాడ

అనంతరామయ్యగారు కాకినాడలో పెద్ద క్రిమినల్ లాయరు. ఆయన ఎటువంటివాడైనా సరే ఫీజు నాలు గంకెల సంఖ్యకు తక్కువ పుచ్చు కునేవాడు కాడు. శాంతి ఆయన ఏకైక పుత్రిక.

శాంతి చిన్నతనంలోనే అనంత రామయ్యగారు తన చనిపోయిన స్నేహి తుని కుమారుడు రవికాంత్‌ను తెచ్చి పెద్ద చేశాడు. ఇద్దరూ కలిసి తిరిగారు. ఆడుకున్నారు. చదువుకున్నారు.

అనంతరామయ్యగారు శాంతిని చాల గారాబంగా పెంచారు. 'నాన్నా! కాలే జీకి వెళ్ళడానికి ఫియట్ బాగా లే'దంటే, 'ఫియట్ అమ్మ షాపింగ్‌కి వెళ్ళడాని కిచ్చేసి నువ్వు ప్లిమత్ వాడుకోమ్మా' అనేవారు. ప్రతీ నెలా చీరల మార్కెటు సగం యింట్లో ఉండేవి. రవికాంత్ బి. యే. ప్యాసయిన యేడాది శాంతి పి. యు. సి. ప్యాసయింది. రవికాంత్ ఉద్యోగం చేస్తానంటే అనంతరామయ్య గారు పట్టుబట్టి 'లా'లో జేర్పించారు.

రవికాంత్ కాన్వొకేషన్‌లో 'రమ ణయ్య మెమోరియల్ మెడల్ ఫర్ లా' అందుకుంటుంటే చూచిన అనంత రామయ్య కళ్ళు చెమర్చాయి.

'శాంతీ...' మేడమెట్లు ఎక్కుతూ వెనక్కు తిరిగింది.

'నీతో మాట్లాడాలి! రేపు బీచికి వస్తావా'. రవికాంత్ అడిగా డనేకంటే అర్థించాడంటే బాగుంటుంది.

'అలాగేలే' హైహీల్సు టక టక చప్పుడు చేస్తూ మేడమీదికి వెళ్ళి పోయింది.

అరనిముషం హాయి లేని మానవ హృదయంలా ఎగిరి పడుతోంది సముద్రం. జనం జంటలు జంటలుగా బీచికి చేరుకుంటున్నారు.

'శాంతీ...' ఆవేశంగా అన్నాడు రవికాంత్.

'ఏమిటో చెబుతా నన్నావుగా... తొందరగా చెప్పు.'

'నీ పెళ్ళి గురించి నీ ఆలోచన ఏమిటి శాంతీ?'

శాంతి నవ్వి'ఏముంది తొందరగా పెళ్ళి చేసుకోవడమే.'

'పోనీ! నా గురించి నీ ఆలోచన ఏమిటి!'

అకస్మాత్తుగా 'అదేమిటి రవికాంత్! అసలా ప్రశ్న ఎలాగ అడిగావు. నీకేముందని నన్ను చేసుకో మంటావు' అంది.

'అదేమిటి శాంతీ! ఏమున్నా లేక పోయినా నా భార్యని పువ్వుల్లో పెట్టి పూజించే మనసుంది.'

'అవి కవిత్వాల్లో మాటలు కాంత్! నీకు బ్యాంక్ బ్యాలన్స్, బొచ్చు కుక్కా, బ్యూక్ కారు—యీ అర్హత లున్న నాడు నా మాట తలపెట్టు' కరకుగా అంది శాంతి.

'జీవితంలో బ్యాంక్ బాలన్స్, బొచ్చుకుక్కా, బ్యూక్ కారూ—ఇవన్నీ మనసిచ్చే మనిషికన్నా గొప్పవా శాంతీ?'

'నాకు గొప్పవే' అంటూ విసవిసా నడచి వెళ్ళిపోయింది.

ఆ తరువాత రవికాంత్‌కి మరో లాయరుగా రమ్మాయి శ్యామలతో వివాహమైంది. తను కోరుకున్న బ్యూక్ కారు, బొచ్చుకుక్కా ఉన్న రాజశేఖర్‌తో తన వివాహమైంది.

'బ్యూక్ కారు' హారన్‌తో ఉలిక్కి పడింది శాంతి. లేచివెళ్ళి తలుపు తీసింది.

'నేను తాగలేదు...నాకు నిషాలేదు' ఏదో సినిమాలో పాట పాడుతున్నాడు శేఖరం.

'ఏయ్! ఏమిటా వెధవ ముఖం... ఏడుస్తూ తలుపు తియ్యొద్దని ఎన్ని సార్లు చెప్పాను' అంటూ చెయ్యి విసిరి మేడమీదకు వెళ్ళిపోయాడు.

శాంతి గులాబీ చెంపమీద అయిదు వేళ్ళు ముద్రింప బడ్డాయి.

బొచ్చుకుక్క బొయ్యమంది.

★★★

---

★ "న్యూయార్కులో ప్రతి అర గంటకి ఒక మనిషి కార్లకింద పడుతూ వుంటాట్ట."

"పాపం. ఎవడో ఆ నిర్భా గ్యుడు?"

★ సెన్సార్ అధికారి ప్రొడ్యూ సర్‌తో: "మీ కొత్త సినిమా విజ్ఞానదాయకంగా వుంటుం దన్నారు. ఏమిటా విజ్ఞానం?"

ప్రొడ్యూసర్: "అనాటమి"

# జగదేక సుందరుడి కథ

"ఇంతకూ పిల్ల నచ్చ లేదంటావు"

"ఛ. బొత్తిగా గోరిల్లాలా ఉందనుకోమ్మా."

"పోరా నువ్వు మరీ చెప్తావు" నవ్వుతూ మజ్జిగ గ్లాసందుకుని లోపలికి పోయింది పిన్ని.

ఎండలో పడి వచ్చారేమో, చిన్నాన్న ఆయాసపడుతూ కూర్చున్నారు. అసలే స్థూలకాయం. పైగా మే నెల.

అన్నయ్య బెట్టుచూసి నాకు చిఱు కోపం వచ్చింది. "గోరిల్లా అంటే ఎలా ఉంటుం దేమిట్రా" క్వెశ్చన్ మార్కు ముఖం పెట్టాను.

"అచ్చం ఆ పెళ్ళి కూతురిలాగే ఉంటుంది సుమీ." అన్నయ్య గడుసు తనానికి ముసిముసిగా నవ్వుకుంది పిన్ని.

* * *

బాపట్ల. ఎక్కడ చూసినా మెత్తటి ఇసుక. ఇంటిచుట్టూ కొబ్బరి చెట్లు. చల్లని గాలి. అరుబయట కుర్చీలు వేసుకు కూర్చున్నాము. గుంటూరు ఎండలలో వేగి మాడిపోయిన దేహాన్ని మరమ్మత్తు చేసుకుందువు రమ్మని అన్నయ్య వ్రాసిన ఉత్తరం అందిన మరుక్షణమే రెక్కలు గట్టుకు వాలాను.

వచ్చి నాలుగు రోజులైనా కాలేదు, ఇంతలోనే ఓ పది సంబంధాలైనా చూసి నట్లు జ్ఞాపకం. ఎక్కే గడప, దిగే గడప. ప్రతి పిల్లకు ఏదో ఒక వంక. బాపట్ల చుట్టు పట్ల గ్రామాలన్నీ సర్వే చేసే శాడు అన్నయ్య.

"ఆ అమ్మాయి మరీ నలుపు. గేస్ లైటే ననుకో"

... "ఎవరూ ప్రొద్దున చూసి నమ్మాయా. ఏం పేరన్నారూ? ఆ. సుగంధం కదూ. ఒట్టి దుర్గంధమే సుమా. పళ్ళు సరిగా కడుగుకుంటుందో లేదో గాని." ఇదీ వరస.

"ఒరేయ్ అన్నయ్యా. నిన్న చూసొచ్చావే. పంతులు గారి అమ్మాయి. అందంగానే ఉంటుందట గమూ?"

"చచ్చచ్చ. డేమ్ ఇన్సల్ట్. అలాటి శాల్తీ ఈ శేఖర్ ఎం.ఏ. గాడి అర్ధాంగి యగుటయా. ఐనా మరీ అంత ఎరు పేమిటి? రెడ్ ఏప్"

ఇదీ అన్నయ్య ధోరణి. కళ్ళు చింతాకుల్లా ఉన్నాయనో, పళ్ళు తెల్లగా లేవనో, బుగ్గమీద ఎర్రటి పుట్టుమచ్చ ఉందనో ... ఏదో ఒక లోపం వెతుకు తూనే ఉంటాడు.

నాకో చిన్న ఐడియా వచ్చింది. రేపు అన్నయ్య వాళ్ళతో నేనూవెళ్తే?!

ఇంతలో — అన్నయ్యే అన్నాడు "పోనీ రేపు నువ్వుకూడా రారాదుటే

---

ద్వితీయ బహుమతి రూ. 25

బంగారు విజయ భాస్కర్

సెకండ్ బి. యస్సి. ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీ, గుంటూరు.

లతా. ఆ సుందర ముఖారవిందమును కనులపండువుగ గాంచెదవు గాని" పిన్ని మురిపెంగా అన్నది. "ఔను లతా అన్నయ్యతో నువ్వూ వెళ్ళమ్మా". తన కొడుకు జగదేక సుందరుడని ఆమె నమ్మకం మరి. తల్లి, కొడుకుల ఏకాభిప్రాయాన్ని చిన్నాన్నెప్పుడు కాదనరు.

తెల్లవారింది. చకచక కాఫీలు ముగించుకుని బయలుదేరాము.

ఆ అమ్మాయి కొద్దిగా భయపడుతూ వచ్చి కూర్చుంది. యథాలాపంగా చూశాను. అరే పద్మ! క్షణంలో సగం సేపు పైకెత్తిన ఆ కళ్ళు నన్ను చూసి సంతోషంగా నవ్వాయి. పరిచయాలైన తరువాత కావలసిన తతంగం పూర్తయింది. నాకు తెలుసు పద్మ అన్నయ్యకు తప్పకుండా నచ్చుతుంది. అసలుకడిగిన ముత్యంలా తీర్చి దిద్దినట్లున్న ఆ పిల్ల ఎవరికి నచ్చదు గనుక.

ఇంటికి వచ్చాము. అన్నయ్య నెక్ టై ఊడదీస్తున్నాడు. "పద్మ నీకు నచ్చింది గదూ"

కుతూహలం అణచుకోలేక పోయాను.



"ఏం. మీ క్లాస్‌మేట్ అనా" అదో. రకంగా అన్నాడు. "అన్నట్లు, బుద్ధుడు వాళ్ళన్న య్యనుకుంటాను" నవ్వుతూ అడిగాడు.

"అదేమిటి ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాను.

"అబ్బే మరేంలేదు. చెవులు మరీ భుజాలను ముద్దు పెట్టుకుంటుంటే..." పక్కనున్న అన్నయ్యను చూస్తుంటే వళ్ళు మండిపోయింది. 'వీడికీ జన్మకిక పెళ్ళికాదు' అని నిర్ణయం చేసుకున్నాను.

సంబంధాలు చూసి చూసి పిన్ని వాళ్ళకు గూడ విసుగెత్తింది. పోనీ యూనివర్శిటీలో ఎవరైనా ప్రేమించాడా అంటే అదీ లేదుట. అన్నీ గొంతెమ్మ కోరికలు. నాలో నేనే నణుగుకున్నాను. పిన్ని కళ్ళనీళ్ళు పెట్టుకోటం మొదలు పెట్టింది.

* * *

ఎదురింటి వెంకట్రామయ్యగారి రెండో అమ్మాయి పెళ్ళి. హడావుడిగా ఉంది. వాళ్ళ చిన్నబ్బాయి రఘుతో అన్నయ్య ఓ తెగ తిరిగేస్తున్నాడు.

చిన్నాన్న హడావుడిగ వచ్చారు. "చూడు శాంతా. వెంకట్రామయ్య కూతురు పెళ్ళికి రాలేదూ అవధానిగారని. ఆయనకో కూతురుంది చూశావూ. ఆ అమ్మాయి మన వాడికి బాగా నచ్చిందట." సంతోషంతో ఆయనకు మాట రావటం లేదు.

"అన్ని విషయాలు మాట్లాడాను. అబ్బాయిని వాళ్ళు చూసుకున్నారు. ఇంటికి వెళ్ళగానే ఉత్తరం వ్రాస్తామన్నారు."

పిన్నికి ఏనుగెక్కినంత సంబరమయింది. వాళ్ళు బాగా ఉన్నవాళ్ళు. ఆ అమ్మాయి ఒక్కతే కూతురట. కోడలు బోలెడు కట్నంతో వస్తుందిలెమ్మని పిన్ని ఆశ.

ఇంట్లో అందరం ఉత్తరం కోసం ఎదురుచూస్తూనే ఉన్నాము. రోజు రోజుకు ఆతృత ఎక్కువై పోతోంది.

"మొన్న నిన్ను చూశాను, నిన్న మనసు కలిపాను, నేటినుండి నిన్నే తలచి, వెర్రివాడనైనాను —" పాడేది రేడియోకాదు. సాక్షాత్తు మా అన్నయ్య. "అమ్మయ్య" నాకు తెలీకుండానే అన్నాను.

"పోస్ట్ !" అందరం పరుగెత్తాం వరండాలోకి. కవరు చింపటంలో చేయి తడబడింది.

"—క్షమించాలి. అమ్మాయికి పిల్లవాడు నచ్చలేదట...."

***




అందే గోపాలకృష్ణమూర్తి

"ఆరువేలు కావాలి! ఆరువేలు...

ఒకటీ, రెండు, మూడు కాదు; నాలుగూ అయిదూ కూడా కాదు — ఆరు! ఆరువేలు— ఆరువేలుంటే తను 'తండ్రి'గా - మూడో ఆడపిల్లకు కూడా ఘనంగా పెళ్ళి జరిపించిన - 'బతికున్న తండ్రి'గా సంఘంలో గౌరవింప బడతాడు, ఆదరింప బడతాడు, 'ఆహా!' అన్పించుకుంటాడు; కాని— ఏవీ ఆరు వేలు?"- దీర్ఘంగా నిట్టూర్చాడు రాఘవయ్య. బాధగా నొసలు చిట్లిస్తూ కళ్ళు మూసుకొన్నాడు. భగవంతుని స్మరించు కోసాగాడు.

ఆపద వచ్చినప్పుడల్లా భగవన్నామ స్మరణ చేస్తుంటాడు రాఘవయ్య. భగవంతుడు నిజంగా తన ప్రార్థన వింటాడో లేదో రాఘవయ్యకు తెలీదు గాని, ఎన్నడూ ఉన్నాడో - లేదో తెలీని ఆ భగవంతుడు' రాఘవయ్యకు అన్యాయం మాత్రం చేయలేదు. 'లాభం చేకూర్చక పోయినా, నష్టమంటూ ఏదీ కల్పించలేదు ఆ వేంకటేశ్వరుడు!. 'అదే నాకు పదివేలు, అంతకుమించి వేరే నాకవసరం లేదు!!' అని లెంపలు వేసుకొంటుంటాడు రాఘవయ్య.

ఆఫీసులో అన్యాయంగా, అక్రమంగా ధనార్జన చేసినప్పుడు —ఆరోజు ఇంటికి రాగానే కూడా భగవన్నామ స్మరణ చేస్తుంటాడు రాఘవయ్య, 'అంతా నీ మాయ తండ్రీ!' అంటూ చెంపలు వాయించుకొంటాడు. 'అంతా నీ లీలే భగవాన్!' అంటూ దేవుడి పాదాలను కళ్ళకద్దుకొంటాడు. "అంతా నీ దయ!" అంటూ సాష్టాంగ ప్రణామాలాచరిస్తాడు. "నువ్విచ్చిన సంతానానికే తండ్రీ, నేనీ కాని పనులు చేస్తుంటా, అంతా నీ మహిమే భగవాన్" — అంటూ తాను చేసిన నేరాల్ని సమర్థించుకొంటుంటాడు రాఘవయ్య.

పెద్ద కూతురి పెళ్ళి ముందు— భగవంతుని స్మరించుకోకుండానే పెళ్ళి ప్రయత్నాలు చేసి, సఫలుడయ్యాడు రాఘవయ్య. పెద్ద కూతురితో బాటుగానే అప్పటి వరకూ వెనకేసిన 'డబ్బూ దస్కం' బైటికిపోయి — 'రెక్కాడితే గాని డొక్కాడదు' అనే స్థితికొచ్చిన రాఘవయ్యకు జీవితంలో మొదటి సారిగా దేవుడు గుర్తుకొచ్చేడు. అప్పుడు గుర్తుకొచ్చిన దేవుడు అతని దృష్టి పథంలో అలానే నిల్చి పోయాడు.

అంటే — ఆర్థికంగా రాఘవయ్య చితికి పోయాడనీ, ఆపద లొచ్చినప్పుడల్లా దేవుణ్ని స్మరించి గుండె నిబ్బరం చేసి కొంటాడనీ మనం అనుకోవాలి.

అనుకోకుండా రెండో కూతురి వివాహం ఘనంగా జరిగిపోయేసరికి అదంతా దేవుడి మహిమే అనుకొని సంబరపడ్డాడు రాఘవయ్య. ఆనాటి నుంచీ అతనిలో దైవభక్తి రోజు రోజుకూ పెరిగిపో సాగింది. "ఇక మూడో కూతురి వివాహం కూడా ఘనంగా అయిపోతే తనిక మరేం కోరుకోడు!...బతికినన్నాళ్ళూ ఆ ఏడు కొండలవాడినే స్మరిస్తూంటాడు! భగవన్నామ స్మరణ చేస్తూనే తాను కనులుమూస్తాడు!!"—ఇదీ—భావి జీవితాన్ని ఊహించుకొంటూ అతను కనే కల.

అతని కల నిజమయ్యే రోజు వచ్చిందో ఏమో, లేక, అతని మొరను భగవంతుడు ఈసారి కూడా ఆలకించేడో ఏమో, రాఘవయ్య మూడో కుమార్తెకు ఓ చక్కని సంబంధం వచ్చి కూర్చుంది. సంబంధంతోబాటు ఓ చక్కని సమస్య కూడా వచ్చి కూర్చుంది. 'అన్నీ నచ్చినయ్, అమ్మాయీ నచ్చింది'—అన్న మగపెళ్ళివారు న్యాయంగానే—ధర్మంగానే—రివాజుగానే 'ఆరువేలు మాత్రమే మాకు చాలు, ఏ విషయమూ త్వరలో తెలియ బరచగలరు'—అంటూ స్వగ్రామం జేరుకొన్నారు. రాఘవయ్యకు వారం రోజులు గడువిచ్చారు.

'గడువు'లో తెలిసున్న గడపలన్నీ ఎక్కి దిగేడు రాఘవయ్య. ఆఫీసులో అక్రమ సంపాదన చేశాడు. అందర్నీ తలో చేయి వేయమన్నాడు. తన సంసార నౌకను — ఆ తడవతో — ఓ గట్టెక్కించమని ప్రాధేయపడ్డాడు. ఏ అడ్డూ రాకుండా ఘనంగా కాకపోయినా, మామూలుగానైనా ఈ సంబంధం కుదిరి, తన మూడో ముద్దుల కూతురి వివాహమైపోతే, దేవుడికి నీలాలిచ్చుకొంటానని మ్రొక్కుకున్నాడు. ముడుపు కట్టాడు.

'గడువు' రేపు దాటి పోతుందనేసరికి రాఘవయ్యకు వణుకు హెచ్చిపోయింది. దైవభక్తి కూడా హెచ్చింది. కళ్ళుమూస్తే—భగవంతుని పటం!...

కళ్ళు తెరిస్తే—ఆరువేల రూపాయల కట్ట!...

—భగవంతుడూ — రూపాయలూ; రూపాయలూ—భగవంతుడూ; మధ్య మధ్యలో మూడో కూతురూ — మళ్ళీ భగవంతుడు — మళ్ళీ రూపాయలు — మళ్ళీ మూడో కూతురూ—

మనశ్శాంతికై విసుగ్గా కళ్లు మూసికొన్నాడు రాఘవయ్య.

"నాన్నా, కాఫీపొడి లేదుట, కాఫీ బజార్లో తాగమంటోంది అమ్మ!—"

విసుగ్గా కళ్ళుమూసికొన్న రాఘవయ్య విసుగ్గానే కళ్ళు తెరిచాడు. ఘోరమైన నేరంచేసి శిక్షకోసం ఎదురు చూస్తున్న పాపిలా - అయోమయంగా నిల్చున్న మూడో కూతుర్ని చూసే



పరికి, అరికాలి మంట నెత్తికెక్కి-
నట్లయింది.

"తాగుతానే తాగుతా! బజార్లో కాఫీ కాదు, ఇంత విషం తాగుతా__వెధవ మొహమేసుకొని అలా గుడ్లు మిటకరిస్తావేం, లోపలికి ఫో!__"

బెరుగ్గా చూస్తూ లోపలికి పోయింది రాఘవయ్య మూడోకూతురు. విసురుగా బైట పడ్డాడు రాఘవయ్య.

★ ★ ★

కాఫీ త్రాగమంటే కాదని, విషం తాగుతానన్న రాఘవయ్య తను అన్న

మాట మర్చిపోయి ఒంటరిగా, ప్రశాంతంగా కాస్సేపైనా కూర్చుందామనుకొని అక్కడేవున్న 'పార్కు'లో కూలబడ్డాడు.

దూరంగా - ఎవరో నవ్వుతున్నారు. నవ్వుతూ ఎగిరెగిరి పడుతున్నారు. నవ్వాపుకోలేక చేతి రుమాళ్ళతో ముఖం దాచుకొంటున్నారు.

'ఛీః' చీదరించుకొన్నాడు రాఘవయ్య. 'లోకంలో ఈ క్షణాన ఇంచుమించు అందరూ నవ్వుతూనే ఉండి ఉంటారు. తనొక్కడే — కేవలం, తనొక్కడే ఏడుస్తున్నాడు. ఏడుస్తున్నట్టు లోకానికి కనపడక పోయినా, తను అందరి కంటె ఎక్కువగా ఏడుస్తున్నాడు తెల్లారితే — తన పరువు మంట గలుస్తుంది. డబ్బు దగ్గర కక్కుర్తి పడి బంగారం లాంటి సంబంధాన్ని చేజేతులా వదిలేసేడన్న అపవాదు తన అసమర్థతను చాటి చెప్తుంది, ఇంటా — బయటా అప్తులూ, అనామకులూ కూడా తనను చిన్న చూపు చూస్తారు. తన పరువు, 'ఇద్దరమ్మాయిల వివాహాలు ఘనంగా, తాహతుకు మించి చేసేడయ్యా రాఘవయ్య!' — అని ఒకనాడు తాను తెచ్చుకొన్న పరువూ, ప్రతిష్ఠా, సంఘంలో పేరూ — అన్నీ మంట గలసి పోతాయ్.

— బాధగా ముఖాన్ని చేతులతో కప్పుకొన్నాడు, 'అరె, గడ్డమైనా గీసుకో లేదు!' అన్పించిన రాఘవయ్యకు 'ఉహ్, ఇప్పుడు దానిని కూడా చూసి ఆనందించే వాడెవడు? . . . తనెలాగుంటే నేం, తన కోర్కె ఒక్కటే — ఈ ఒక్కటీ నెరవేరితే చాలు! ... అదే పదివేలు - కాదు-అదే ఆరువేలు! ... నా విలువే ఆరువేలు!.. ఆ తర్వాత తాను బికారై పోయినా ఫర్వాలేదు. భగవాన్, ఈ ఒక్క సహాయం చేయి! ఈ ఒక్కసారీ అదుకో!...ఎలా?..." — పంచెతో కళ్ళొత్తుకున్నాడు. మాసిన గడ్డాన్ని చేతులతో తడుముకొన్నాడు. రేగిపోయిన జుట్టును ప్రక్కలకు సవరించుకొన్నాడు.

అప్పుడే వెలిగిన 'పార్కు' లైట్ల కాంతిలో కుడి అరచేతిని కళ్ళ కద్దుకున్నాడు. భుజంమీద చొక్కా చిఱుగును చూసి కళ్ళు చిట్లించాడు. అప్రయత్నంగా వెకిలిగా నవ్వుకొన్నాడు — 'ఉహ్హ్ — ఎవరైనా తనసీ స్థితిలో — ఇంటి దగ్గర వేసుకొనే ఈ చిరుగు గుడ్డల్లో చూస్తే ఏమనుకొంటారు?..., ఏ హంతకుడో, పరారై పోయిన ఏ ఖైదీయో, లేక, ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయలేని ఏ అసమర్థుడో — ఇలా రోడ్లవెంటా, పార్కులవెంటా తచ్చాడుతున్నా డనుకొంటారు. అవకాశమొస్తే చితక బొడుస్తారు. పలకరిస్తే చీదరిస్తారు. సంఘంలో తనకి తప్ప మిగిలిన ప్రతి గడ్డిపోచకీ విలువ ఉన్నట్టనిపించింది రాఘవయ్యకు — ఆ క్షణాన.

ప్రక్కనెప్పుడు కూర్చున్నారో — ఇద్దరు జబర్దస్తీగా ఉన్న ఆసామీలు — రహస్యంగా మాట్లాడు కుంటున్నట్లున్నది వాళ్ళ మాటల ధోరణి! అనుకోకుండా చెవులటు పడేశాడు రాఘవయ్య.

'మొత్తం ఆరువేలే సుబ్బయ్యా! పెటిల్మెంటయి పోయింది. ఇంద ఈ రెండువేలూ-అన్నీ వందనోట్లేసుమా- ప్రొప్రయిటరికిచ్చేయ్. ఆనకనింపాదిగా చూసోక్కవచ్చు—'

—ఈ మాటలంటున్న ఆ సామీ రూపాయి కట్టలు రెండుతీసి. ఎదుటి వ్యక్తికిచ్చాడు. లెక్కించకుండానే వాటిని 'లావుపాటి పర్సు'లో కుక్కుకొని, కుడివైపు - లాల్చీ జేబులో పడేసుకొని, ఇంకా దగ్గరకు జరిగి ఏదో రహస్యంగా మాట్లాడసాగాడు - డబ్బు అందుకున్న ఆసామీ.

అతని చేతి కదలికలను డబ్బు పట్టుకొన్నప్పటి నుంచీ గమనిస్తూనే ఉన్న రాఘవయ్య గుండె - ఆక్షణాన- ఆవ్యక్తి జేబులో పర్సు పెట్టుకుంటున్న క్షణాన - ఝల్లుమన్నది!

"మీ పర్సు—" అని ప్రారంభించిన రాఘవయ్య పెదాలకు అప్రయత్నంగా తాళం పడిపోయింది. అతని దృష్టి - ఆవ్యక్తి జేబుదగ్గర - క్రింద- పచ్చగడ్డి మీద పడిపోయిన పర్సుమీద నిల్చిపోయింది!

చెమటలు పట్టివేశాయ్ రాఘవయ్యకు.

"దాన్లో రెండు వేలున్నయ్, అతను వెళ్ళిపోతే—అది తనదే—అంటే ఇంట్లో ఉన్న రెండువేలకు ఇది జోడిస్తే— నాలుగు వేలు! ... ఈ నాలుగువేలూ ముందు కుట్టజెబితే ఫర్వాలేదు—మరో రెండు వేలు!...రెండే రెండువేలు!... ఎలాగో ఇస్తానని బ్రతిమాలుకోవచ్చు... కాని. ఎలా? ఆ రెండు వేలున్న పర్సు తన దవడమెలా? ఆ వ్యక్తి అక్కడి నుంచి లేచి. అలానే వెళ్ళిపోవాలి. తను వెంటనే దానిని స్వంతం చేసికోవాలి. భగవాన్—ఇది నువ్వు చూపిస్తున్న మార్గంకాని కాదు గదా?..."

—గుండె దడ హెచ్చింది రాఘవయ్యకు. కళ్ళు మూసికొని భగవన్నామస్మరణ చేశాడు. ఆ పర్సు తన స్వంత మవడానికి భగవంతుని సాయ మర్థించాడు.

భగవంతుడు రాఘవయ్య మొరాలకించాడు గావును!—ఆ ఆసామీ "అచ్చా భాయ్, రేప్పొద్దుటే మీ యింటి కొచ్చి కలుస్తా, నడు — పోదాం..." అంటూ హుంషారుగా లేచి, రెండో ఆసామీతో కలిసి పార్కు గేటువైపు నడిచాడు.

వణుకుతున్న కాళ్ళతో లేచాడు రాఘవయ్య. మరోసారి భగవన్నామస్మరణ చేశాడు. తడబడుతున్న పాదాలతో ముందుకు నడిచాడు.

ఒకటి—రెండు—మూడు — నాలుగు— పెద్ద పెద్ద అంగలతో పర్సు దగ్గర కొచ్చేడు.

కంపిస్తున్న శరీరాన్ని అదుపులోకి తెచ్చుకొంటూ మెల్లగా వంగి, చుట్టూ చూసి, ఎవరూ తనను గమనించడం లేదన్న విషయాన్ని ఖాయపర్చుకొని- ఒక్కసారి 'పర్సు'ను తీసి హృదయానికి హత్తుకొన్నాడు. ఒక్కసారి విప్పి చూశాడు. నిజమే!...నోట్లు...రూపాయల నోట్లు — లెక్కించకుండానే అవెంతో తనకు తెలుసు — రెండు వేలు!...దేవుడిచ్చిన రెండు వేలు!!... కూతురి పెళ్ళి ఎలాగైనా చేసెయ్యమని దేవుడు తనను అక్కడికి రప్పించి, బహూకరించిన రెండు వేలు!!....

దేవుడు గొప్పవాడు! నిజంగా దేవుడున్నాడు! ఎవరికున్నా లేకపోయినా దేవుడు తనకున్నాడు!!"—కంగారుగా 'పర్సు'ను — దేవుడిచ్చిన పర్సును - జేబులో దాచుకొని, గంభీరత ముఖంలోకి కొని తెచ్చుకున్నాడు రాఘవయ్య.

తను కంగారు పడకూడదు, 'గిల్టీ'గా ఫీలవకూడదు, ఘరానాగా ఉండాలి, గంభీరంగా కనపడాలి! ఇంటికి వెళ్ళేవరకూ ఎలాగో ఈ ఆత్రుతనూ కంగారునూ అణుచుకో గలిగితే - ఇక తనకు అడ్డులేదు. ఈ ప్రయత్నంలో ఇప్పటివరకూ తనను చల్లని చూపు చూస్తాడు. ఆ తర్వాత ఇక ఎన్నడూ తను అన్యాయంగా - అక్రమంగా - డబ్బు సంపాదించబోడు! నీతిగా - న్యాయంగా - ధర్మంగా - దైవభక్తితో తన శేష జీవితం గడుపుతాడు! ఇదే— తెలిసికూడా తను చేస్తున్న చివరి తప్పు!... అంతే, ఇదే తన చివరి తప్పు!!..."

—తడబడుతున్న అడుగులతో ముందుకు నడిచాడు. పార్కు గేటు దాటి వేగంగా నడక సాగించాడు. నాలుగైదు నిముషాలు నడిచి, బస్ స్టాప్‌లో ఆగాడు.

వెనుకనించి దూసుకొంటూ వచ్చిన 'సిటీబస్'లో ఎలాగో చోటు చేసికో గలిగాడు. కండక్టర్ ఆదేశానుసారం బస్ ముందుకు కదిలింది.

రద్దీగా ఉన్న బస్‌లోపల ఇరుక్కు పోయినట్టుగా నిల్చొన్న రాఘవయ్య క్షణకాలం స్తంభించి పోయాడు! ఎదురుగా—

ఇందాకటి ఆసామీ —

అతని ప్రక్కనే అతని స్నేహితుడు—

ఒకరి వెనుక ఒకరు - క్రిక్కిరిసి పోయిన ప్రయాణీకుల మధ్య ఊపిరి పీల్చుకో ప్రయత్నిస్తున్న ఇందాకటి పెద్ద మనుషులు—

వారికి వెనుకగా— మరో పెద్ద మనిషి—

తర్వాత —

తను!... అంటే - రాఘవయ్య! - పాపపు సొమ్మును - అన్యాయపు సొమ్మును - ఇంటికి రవాణా చేసే ప్రయత్నంలో వున్న రాఘవయ్య!—

ముచ్చెమటలు పోసినయ్ రాఘవయ్యకు. బెదురుగా చుట్టూ కలయ జూశాడు. వెనక నించి - బస్సు కుదుపుకు - ఎవరో బలంగా ముందుకు నెట్టుతున్నారు. నిలువు ఊచను ఆధారంగా చేసుకొనినిలబడగలుగుతున్నాడు రాఘవయ్య.

"అబ్బ... సరిగ్గా నిల్చోవయ్యా.."

—వెనుక నిల్చున్న పెద్ద మనిషి క్రూరంగా కసిరేడు - బస్సు కుదుపుకు మీద బడ్డ రాఘవయ్యను.

తలకు తగిలిన ఊచ మూలంగా కణత పైన కట్టిన బొప్పిని సవరించు కొంటున్న రాఘవయ్య ఆ మాటలను పట్టించుకో లేదు.

ఏదో స్టాపు దగ్గర బస్సు ఆగింది. దిగేవారు లేరేమో, మరో ఇద్దర్ని ఎక్కించుకొని ముందుకు కదిలిన బస్

లోంచి ఉన్నట్టుండి గట్టిగా విన్పించింది - ఓ ఆసామీ కంఠం - "అరె - నా పర్సు ! . . . ." అంటూ.

"సరిగ్గా వెతుకు . . . అదే ఉంటుంది !"

". . . లేదు లేదు - కొట్టేసేరెవరో ! . . ."

"అబ్బబ్బ - చూడవోయ్, ఇందాకటి వరకూ వున్నది గదా - "

"అంచేతనే ఎవడో కొట్టేసేడంటున్నాను - ఎలా ఎలా ? . . ."

"డ్రైవర్, బస్ ఆపుజేయ్ ! . . ."

బస్ ఆగింది. రాఘవయ్య గుండె కూడా ఆగినట్లయింది - 'పర్సు పోయినది - ఇందాకటి ఆసామీదే. అతని పర్సు పోలేదు. అతనే పారేసుకొన్నాడు. ఆ విషయం అతనికి తెలియదు. తనకు తెలుసు ! తనొక్కడికే తెలుసు ! ఇప్పుడు చెప్తే ? . . . నమ్మరు !...ఎలా ? ఈ గండంనుంచి తప్పించుకోవడమెలా ?—' రక్త ప్రసారం స్తంభించి పోయింది రాఘవయ్య దేహంలో. ఎంత ప్రయత్నించినా భయాందోళనలను ముఖంలో కన్పించనీయకుండా దాచుకోలేకపోతున్నాడు. ఇప్పుడు. . .తను . . . ఏం చేయాలి ?... ఎలా తప్పించుకోవాలి ?...'

"అయ్యా...ఈ రోజుల్లో దొంగెవరో, దొరెవరో బాహ్యాకృతిని బట్టి నిర్ణయించలేము గనుక, బస్‌లో అందరినీ తప్పనిసరిగా 'చెక్'చేసే అవకాశాన్ని మాకు కల్పించమని కోరుకొంటున్నాం. పోయిన మొత్తంతక్కువకూడా కాదు గనుక, బస్‌లోనుండి ఇంతవరకూ ఎవరూ దిగడం కూడా జరుగలేదు గనుక, ఆ పర్సు దీన్లోనే ఎక్కడో - ఎవరి దగ్గరో ఉండి తీరాలి !..."

కండక్టరు చెబుతున్నంతలోనే ఇరువురూ అందరి జేబులూ పరీక్షించసాగారు. కంపించిపోతున్న రాఘవయ్యను కూడా, "దయచేసి మీ జేబు కూడా—" అన్నాడొక ఆసామీ.

స్పృహ కోల్పోయే స్థితి కొచ్చాడు రాఘవయ్య. శరీరం స్వాధీనం తప్పిపోతోంది. రక్తం గడ్డ కట్టినట్లయింది.

"ఇదిగో పర్స్ - ఇది నాదే !..." అన్నాడు ప్రక్కనుంచి ఇందాకటి

---

★ ఒక విద్యార్థి సహ విద్యార్థినితో :— "మీతో మాట్లాడడమే కో—ఎడ్యుకేషన్."

— తాజీ ప్రసాద్.

ఆసామీ. అంటూనే అక్కడి వ్యక్తి జబ్బను బలంగా పట్టుకొన్నాడు. అందరిదృష్టి అటువైపు మళ్ళింది.

ఆశ్చర్యంగా కళ్ళు తెరిచి-ప్రక్కకు చూశాడు రాఘవయ్య. తన ప్రక్కనే నిల్చొన్న మరో 'పెద్దమనిషి' వీపు మీద అప్పుడే బలంగా నాలుగైదు చేతులు పడ్డాయ్. 'భగవాన్!'— తేరుకొని గట్టిగా ఊపిరి పీల్చుకొని ఆ దురదృష్టవంతుడి వైపు జాలిగా చూశాడు రాఘవయ్య.

"తన్నండి వెధవని, చూస్తుంటే పెద్దమనిషిలా ఉన్నాడు పైగా! పంచె, జుబ్బా—ఆహాహా!... ఎంత డాబుగా ఉన్నాడో చూడవయ్యా—"

"నడవండి—పోలీస్ స్టేషన్లో అప్పగిద్దాం."

"అయ్యా-వీళ్ళకి వాళ్ళకీమామూలే! ఆ చితిక బొడిచేదేదో ఇక్కడే చేసి వదలడం భేషుగ్గా ఉంటుంది!"

"చిటికెనవేలు లాగేస్తే సరి. మళ్ళీ ఎప్పుడూ ఇటువంటి పన్చెయ్యడు!"

ఉచిత సలహా లిస్తున్నారు పాసెంజర్లు. అందినంతవరకూ ఆ దురదృష్టవంతుణ్ణి కుళ్ళబొడుస్తున్నారు — అప్పటి వరకూ అతనితోనే చోటు పంచుకొన్న 'తోటి ప్రయాణీకులు'.

నోట మాటరాక నిల్చుండిపోయిన రాఘవయ్య - ఆ దురదృష్టవంతుడి స్థానంలో - తన నూహించుకొంటూ - కంపించిపో సాగాడు.

"వీడు పాత కే. డీ. యేనండీ! ఒకనాడు కవి కుమారుడిలా - ఇలా - తయారౌతాడు! ఒకనాడు 'దొరబాబు'లా తయారౌతాడు! డాబుగా ఉంటే వీడిని తణిఖీ చేయరని వీడి నమ్మకం! వెధవ—చచ్చేదాకా తన్నండి!"

బస్సు లోపలి నుండి బైటకు లాగి, చచ్చే వరకూ తన్న సాగేరు ప్రయాణీకులు.

బదులు చెప్పక, కళ్ళు మూసికొని, ఆ చిత్రహింసను సహిస్తూనే వున్నాడు దురదృష్టవంతుడు.

'లేదు, తానా నరక యాతనను చూడలేదు, తనుఅనుభవించవలసిన ఆ చిత్రహింసను - కనీసం ఊహించుకోలేదు. వద్దు భగవాన్ వద్దు! నా మూలంగా ఆపదలో చిక్కుకొన్న ఆ దురదృష్టవంతుణ్ణి కనికరించు! నన్నూ, నా పరువునూ నిలబెట్టిన ఆ అమాయకుణ్ణి ఆశీర్వదించు!...'

—కళ్ళొత్తుకుంటూ బస్ దిగి నిల్చుండిపోయాడు రాఘవయ్య.

"దార్లో పోలీస్ తానా దగ్గర అప్పగిద్దాం, నడవండయ్యా" అంటూ కండక్టరు 'రైటు' చెప్పాడు.

బస్ ముందుకు కదిలింది.నీరసంగా ముందుకు కదిలాడు రాఘవయ్య—"భగవాన్! నన్ను రక్షించావ్!... నా ప్రక్కనే జేబుదొంగకు స్థానం కల్పించి నన్ను కాపాడావ్!... తండ్రీ నీ మహిమ గొప్పది!... 'నీ లీల' గొప్పది! నువ్ నిజంగా గొప్పవాడివి దేవా!..." కూతురి పెళ్ళి విషయం పూర్తిగా మర్చిపోయి ఇంటి ముఖం పట్టాడు రాఘవయ్య.

★★★



పెండ్యాల నాగాంజనేయులు

కాంతారావు వూళ్ళో లేని సమయంలో అతని భార్య చక్రమ్మకు ఓ సుముహూర్తాన 'ఉష్ణం' వచ్చి కూచుంది. నూటొక్క డిగ్రీల ప్రమాణంతో. 'ఆ! సింగినాదం పోదూ' అనుకుని పుబ్బరంగా ఇంత కంది పచ్చడి, ఆవకాయ, మెంతి మజ్జిగలతో మంచి మాట చేసుకుని, పందిరి మంచాన్ని ఆక్రమించుకుని, ముసుగుదన్ని గురకబెట్టి నిద్రపోయింది.

చక్రమ్మ చేసిన ఈ చర్యకు 'ఉష్ణం' బోలెడు సంతోషంతో ఉబ్బిపోయి మరో మూడు డిగ్రీలు పెరిగి ఆవిడ శరీరాన్నాక్రమించేసుకుంది. తీరా సాయంత్రం ఆరు గంటలకు లేచి చూసుకుంటే జ్వరంతోబాటు దాని చెలికత్తెలయిన వళ్ళు నొప్పులు, తలనొప్పి, కళ్ళు మంటలు సరదాగా ముచ్చట్లాడుకుంటున్నాయి. దీంతో ఆవిడకు లేచే సత్తువ కూడా చచ్చిపోయింది. పిలిస్తే పలికే దిక్కులేదు. ఆ వీధిలో ప్రతివాళ్ళకూ చక్రమ్మంటే భయమేగాని, భక్తి మాత్రం లేదు. ప్రతివాళ్ళూ ఆమెతో ఏదో ఒక సందర్భంలో పోట్లాటకు లాగబడి దూరమైపోయిన వాళ్ళే. అందరితో బాటే పక్కింటి గంగిగోవు లాటి శంఖమ్మ కూడా అయింది. ఇప్పటికైనా కాకితో కబురు చేస్తే శంఖమ్మ పరుగెత్తుకొస్తుందని తెలుసు. కాని 'అహం' అంత తొందరగా ఓ కాకిని వుపయోగించుకోడానికి ఒప్పుకోలేదు. అలాగే అవస్థ పడింది రెండోనాడు.

మూడోనాడు తెల్లారుజాము వకోడితోబాటే 'అహం' కూడా లేచి కూచుని 'ఇహ శంఖమ్మను పిలువు. లేకపోతే చచ్చిపోతావు! జాగ్రత్త' అని సణగడం మొదలు పెట్టింది.

ఈసణుగుడికి తట్టుకోలేక ఇహ తీసికెళ్ళే కాకికోసం కూడా ఎదురు చూడకుండా, లేచి గోడ ఆధారంతో వంటింటిగుమ్మందాకా తూలుతూ నడిచి వెళ్ళి పక్కింటి వెనక పాకలో కాపురముంటున్న శంఖమ్మను ఎలుగెత్తి పిల్చింది.

బోలెడంత విచార సాగరంలో మునిగిపోతున్న శంఖమ్మకి ఈ పిలుపు ఆపద్బాంధవుడిచే పంపబడ్డ నావలా తోచి వెంటనే ఆ నావమీదెక్కి చక్రమ్మ దరికి చేరింది రెప్పపాటు

కాలంలో : పరిస్థితి తెలుసుకుంది. పరిచర్య ప్రారంభించింది.

రకరకాల కషాయాలు, కాఫీలు, సోడాలు, పట్లు, రొట్టెలు మొదలైన దినుసులు ప్రయోగించి చక్రమ్మ నాక్రమించుకున్న ఆ యొక్క జ్వర పిశాచిని మరో రెండ్రోజుల్లో 'హూష్ మహంకాళీ' అని ఎగర గొట్టేసి, మూడోనాడు స్వహస్తాలతో తయారు చేసిన చింతపండు చారుతో ఓ మెతుకు (పట్టెడు) కొరికిం చేసింది.

ఆనాడే కాంతారావు వూరి నుంచి తిరిగొచ్చేశాడు. భార్యకు జ్వరం తగిలిందని విని ఏడ్వబోయి, తగ్గిపోయింది గదా అని జ్ఞాపక మొచ్చి సంతోష పడిపోయాడు.

మళ్ళీ ఇంతకాలానికి చక్రమ్మకు శంఖమ్మమీద ప్రేమ, అభిమానం, జాలి వగైరా దుర్గుణాలు పుట్టి, పెరిగి, వృద్ధిలో కొచ్చి, కాంతారావుమీద దాడి మొదలెట్టాయి.

ఏమనీ ?

'శంఖమ్మ భర్త పుల్లయ్య పాపం సరైన వుద్యోగంలేక వూహూ ఇదై పోతున్నాడు. కాబట్టి వెంటనే మీరు పూనుకుని అతని కేదైనా మంచి ఉద్యోగం ఇప్పించకపోతే వీల్లేదూ అవటా' అని.

ఇది ద్వితీయదాడి అని తెలిసి కూడా 'అదేం మాయరోగం నీకు ?' అని యెదురు ప్రశ్న వెయ్యలేదు కాంతారావు. అతడు పూర్తిగా భార్యాదాసు. ఆమె 'కూర్చోండి' అంటే గోడకుర్చీ కూచుంటాడు. 'నుంచో' అంటే బెంచీ ఎక్కి నుంచుంటాడు హైస్కూలు విద్యార్థిలా. సూక్ష్మంగా చెప్పాలీ అంటే అతడు భార్య ఆడే లేక ఆడించే ప్రతి ఆటలోనూ ఓ పావులాటివాడు. ఆ ఆటలో జయాపజయాలు ముట్టమొదటపొందేదిఅతడే! ఆమె ఏం చెప్పినా 'ఎందుకు ? ఏమిటి ? అనే కుంటి ప్రశ్నలు వెయ్యడు. లక్షణంగా శక్తికొద్దీ ప్రయత్నిస్తాడు. ఆ పని సాధిస్తే భార్య సాధించదు. లేదా వ్యవహారం తలకిందులవుతుంది. ఇంత కీ ఏమిటంటే భార్య తెచ్చిన వత్తిడికి 'ఓయస్సు' అన్నాడు తెలుగులో. అనడమేమిటి? ప్రారంభించాడు కూడా.

* * *

షుమారు రెండేళ్ళక్రితం - అంటే శంఖమ్మ భర్త పుల్లయ్య ఓ బట్టల కొట్లో పద్దులురాసి డెబ్బయి రూపాయలు తెచ్చుకుంటూ ఇదే పాకలో భార్యతో గుట్టుగా కాపురం చేస్తున్న రోజుల్లో చక్రమ్మ దంపతులు ఆ పక్క అరవై రూపాయల అద్దె డాబాలోకి కొత్తగా ప్రవేశించారు.

కాంతారావు ఓ ఇంజనీరింగ్ ఫరంలో హెడ్ క్లర్కు. ఆ ఫరం ప్రొప్రయిటరు కుడి భుజం ఓటిది కావడం మూలాన ఇతడే దాని స్థానంలో ఉంటున్నాడు. కాబట్టి అతని జీతం రెండువందల యాభై రూపాయలు. పోతే_ఆ ప్రొప్రయిటరు తలంతా తడిమి చూసుకున్నా నాలుక కనబళ్ళేదు. అందువల్ల కాంతారావుని



పిల్చి, తన తలంతా ప్రదర్శించి, చప్ప రించి, కనుబొమ్మ లెగరేసి 'మరే మంటావ్ ?' అనడిగితే 'అలాగేనండి' అని తక్షణం ఒప్పేసుకుని అప్ప ట్నుంచీ అతడికి తల్లో నాలుకగా కూడా వుంటున్నాడు. అందు నిమిత్తం అతడే స్వయంగా యీ అరవై రూపా యల డాబా యింటినీ ఇతనికోసం

ఏర్పాటు చేశాడు — అద్దె తన నెత్తి నేసుకుని.

అసలు శంఖమ్మ, చక్రమ్మల తొలి పరిచయం ఎక్కడయిందీ అంటే 'ఎంగిలి విస్తళ్ళ దగ్గర' అని చెప్పాలి! చక్రమ్మ అద్దెకు దిగిన నాల్గోనాడు జరిగిన సంఘటన ఇది:

ఉదయ భోజనాంతరం చక్రమ్మ భర్త నాఫీసుకు పంపిస్తూ వీధి గేటు దాకా వచ్చి నిలబడింది భర్త వెళ్ళే దిక్కు చూస్తూ:

ఇంతలో శంఖమ్మ ఎంగిలి విస్తళ్లు పారేయడానికి వీధిలోకి వచ్చింది.

చక్రమ్మ ఊర్కోలేక 'భోజనాలయ్యాయా వదినగారూ' అంటూ పలుకరించింది చిందులాడే చిరునవ్వుతో.

'ఆఁ! అయ్యాయండీ' అంటూ విస్తళ్ళు గిరవాటేసింది శంఖమ్మ. వాటిలోనుంచి బయటపడ్డ ఓ ఆవకాయ ముక్క చక్రమ్మ కళ్ళనాకర్షించి, ఆమెకు మరికాస్త మాట్లాడే అవకాశం కల్పించింది. వెంటనే 'మీ ఇంట్లో ఆవకాయకూడా ఉన్నట్టుందే వదినగారూ?' అంటూ మరో ప్రశ్న వేసింది.

'అదీ లేకపోతే చచ్చిపోమండీ!' అంటూ వెనక్కి తిరిగింది శంఖమ్మ. చక్రమ్మ గబగబా మరో అడుగు ముందుకు వేసి 'నాకు చాలా ఇష్టమండీ' అంటూ తన జిహ్వా చాపల్యాన్ని వెళ్ళబెట్టింది నిర్మొహమాటంగా.

'ఎప్పుడన్నా కొంచెం పెడ్తాలెండి' అంటూ వెళ్ళిపోయింది శంఖమ్మ.

చక్రమ్మ లొట్టలు వేసుకొంటూ గృహప్రవేశం చేసింది. ఆ రోజునుంచీ మరో రెండ్రోజులు ఎదురుచూసినా ఆమెకు ఆవకాయ ముట్టనేలేదు. ఆశ మాత్రం మొట్టుతూనే వుంది.

ఆ మూడోనాడు శంఖమ్మ ఇంటి వీధి గేటుముందు దింపబడిన కూరగాయల తట్ట దగ్గరకు ఇద్దరూ ఒక్కసారే పరుగెత్తి కెళ్ళారు. చక్రమ్మ గోంగూర కట్ట తీసుకుంది. శంఖమ్మ బచ్చలి కూర, చింతకాయలు, కొనుక్కొని వెనక్కి తిరిగింది.

తనను పలకరిస్తుందేమోనని ఎదురు చూచిన చక్రమ్మకు నిరాశే కలిగింది. అయినా తట్టుకుని శంఖమ్మకు అడ్డంపడి, నిలేసి 'బచ్చలికూర పప్పు, చింతకాయ పచ్చడీ చేస్తారా వదినగారూ?' అనడిగేసింది తెగేసి.

'కాదండీ! రెండూ కలేసి వండుతాను అవబెట్టి' అంది శంఖమ్మ.

చక్రమ్మ కదేదో విచిత్రమైన వంటగా తోచింది. ముఖం చిట్లించి 'అదెలాగండీ!' అంటూ ఎదురు ప్రశ్న వేసింది.

శంఖమ్మ ఆ పదార్థపు పాక విధానాన్ని చక్కగా బోధించింది. చక్రమ్మకు సరిగ్గా బోధపడలేదు. అయినా తను కూడా బచ్చలి కూర, చింతకాయలు కొనుక్కుంది వెంటనే!

వంటచేసే వేళకు శంఖమ్మను పిల్చి మర్యాదజేసి, మంచినీళ్ళిచ్చి ఆమె దర్శకత్వంలో ఆ విచిత్ర పదార్థాన్ని నిర్మించింది. తర్వాత

ఆమెకు పీడో్కలిచ్చి, సుష్టుగాభుజించి, త్రేన్చి, తాంబూలించి, పండి, దొర్లి, 'ఎలాగయినా యీ శంఖమ్మ మంచి పాకశాస్త్ర ప్రవీణురాల్లాగా వుందిస్మీ' అని ఆశ్చర్యపోతూ అదే దోవన నిద్ర కూడా పోయింది. ఆ సాయంత్రమే మళ్ళీ చక్రమ్మ శంఖమ్మకోసం గేటు దగ్గర కాపేసి ఓ గంట తర్వాత వీధిలో కొచ్చిన శంఖమ్మను బొడ్లో చెయ్యేసి నిలబెట్టి ఆవిణ్ణీ ఆ విచిత్ర పదార్థాన్నీ సిగ్గూ శరం లేకుండా తెగ పొగిడే సరికి శంఖమ్మ చచ్చేసిగ్గుపడిపోయి ఓపౌను జాడీ నిండా ఆవకాయ దట్టించి చక్రమ్మ చేతిలో పెట్టి మాట దక్కించుకుంది. ఇహ అక్కణ్ణించీ ముఖాలు గేటుదగర మానేసి గోడమీదుగా మాట్లాడుకోడం సాగించాయి. పాకలో తయారైన పదార్థాలు రెక్కలుకట్టుకుని డాబాలోకి ఎగిరి పోవడం మొదలెట్టాయి, ఎప్పుడన్నా డాబాలో తయారైనవి పాకలోకి దిగ జారిపోవడమూ జరిగిపోతూ వుండేది. ఇలా వుపకారం పొందుతున్న చక్రమ్మకు ఓ నాడు శంఖమ్మమీద, ఆమెభర్త పుల్లయ్య ఉద్యోగంమీద దయగలిగి వెంటనే కాంతారావుతో చెప్పేసింది 'పుల్లయ్యకో మంచి ఉద్యోగం చూడండి' అని. 'ఆల్ రైటూ' అన్నాడు కాంతారావు.

తత్ఫలితంగా వారం తిరక్కుండానే పుల్లయ్య తన పాత డెబ్బయి రూపాయల ఉద్యోగాన్ని తన్ని తరిమేసి, 'సుబ్బరాజు' అనే ఓ రేడియో లమ్మే జీవించే వ్యాపారివద్ద నూట ఇరవై రూపాయల ఉద్యోగానికి కుదిరాడు.

శంఖమ్మ, పుల్లయ్యలు ప్రయివేటుగానూ పబ్లిగ్గానూ కూడా చక్రమ్మ దంపతులకు కృతజ్ఞత వెళ్ళబోసుకున్నారు.

ఈ కాస్త పనీ జరిగాక చక్రమ్మ శంఖమ్మను కేవలం తనింట్లో కట్టేసు కోవడం మొదలెట్టింది— ఒక్క రాత్రి పూటతప్ప.

'స్నేహం' అనే పేరుతో తన ఇంటి పనులన్నీ శంఖమ్మచేతే చేయించు కునేది. వీళ్ళింత 'స్నేహం' గా ఉండడం గమనించి యీ స్నేహం ఇలాగే పైకి వెళ్తుందో లేక అలాగే దిగజారి పోతుందో అని పరీక్షించడానికి గావల్సు వాళ్ళిద్దరిమధ్యా కొన్ని నిచ్చెనలూ, కొన్నిపాములూ వెలిశాయి 'వైకుంఠపాళి' రూపంలో!

పనిలేకపోతే వాళ్ళిద్దరికీ ఇదేపని. ఇదేలోకం ఇదేస్వర్గం. సాధారణంగా శంఖమ్మే ఓడిపోయేది - చక్రమ్మంటే వుండే భక్తివల్ల. చక్రమ్మ మాత్రం విజయగర్వంతో విరగబడి నవ్వుతూ అప్పడాలకర్ర దొర్లినట్లు దొర్లేది నేల మీద.

కానీ—

ఓ నాడు శంఖమ్మ పొద్దున్నే లేస్తూనే పిల్లిని చూసింది. అందుకేగా వల్సు ఆ రోజామె ఖర్మకాలి వెయ్యకూడదనుకున్న పందేలు కూడా వడి. క్రమంగా పైకిపోయి పెద్దపామును తప్పించుకుంది.

గవ్వలన్నీ చక్కగా పేర్చి నేర్పుగా పందేలు వెయ్యడం నేర్చుకున్న చక్రమ్మ మాత్రం అర్జెంటుగా నిచ్చెన

లెక్కేసి పైకివెళ్ళి, ఎమర్జెంటుగా పెద్ద పాము నోట్లో ముమ్మాటు పడి మొదటి గడికి చేరుకుంది.

ఇదిగో ఇక్కడే శంఖమ్మ ఖర్మ దోరగా కాలి, నవ్వకుండా వుండలేక పోయింది.

చక్రమ్మ గుడ్లు ఎర్రబడ్డాయి. శంఖమ్మ నవ్వు మింగేసింది.

చక్రమ్మ కోపానికి ఆనకట్ట కట్టింది.

శంఖమ్మ తన పావును పండించడానికి తంటాలు పడుకోంది.

నాల్గోసారి చక్రమ్మ పావును పెద్ద పాము మింగేసింది.

మింగేసిన నవ్వును ఒక్కసారి కక్కేసింది శంఖమ్మ.

ఆరిపోతున్న కడుపుమంట ఒక్కసారి భగ్గుమంది చక్రమ్మకు.

ఆ మంటలో శంఖమ్మ ఖర్మ కాలి బూడిదై పోయింది

క్షమాపణలూ, కన్నీళ్ళూ పరిస్థితిని సరిజెయ్యలేక పోయాయి.

అంతే! మిత్రులు శత్రువులయ్యారు. ఎవరింట్లో వాళ్ళుండడం మొదలెట్టారు.

ఆ ప్రాంతాల్లో కాకులు ఆ రెండిళ్ళనీ పంచేసుకున్నాయి.

ఆ రాత్రి పడగ్గదిలో దీపం కొండెక్కించబోతున్న కాంతారావును 'పుల్లయ్య ఉద్యోగం వెంటనే తీసేయిస్తానని మాట ఇస్తేగాని దీపం తగ్గించడానికి వీల్లేదు' అని శాసించింది.

కాంతారావు మామూలే! 'ఎందుకు? ఏమిటి?' అని వెంటనే అడగలేదు.

'అలాగే తీసేయిద్దాం' అంటూ మాట ఇచ్చి దీప సంహారం చేసేశాడు.

అయితే భార్య శాసనాన్ని అమలు జరపడం ఎలాగా అని తెల్లార్లూ ఆలోచించీ ఎలాగో తెలీక తెల్లారుఝామున చక్రమ్మను లేవగొట్టి 'నాకేం తోచడం లేదే!' అన్నాడు భయంభయంగా.

'పూటకో అద్దాకు విస్తరి లేవదీయడం తెలుసుగా? ఇలాంటివెలా తెలుస్తాయి?' అంటూ బుగ్గపోట్లు పొడిచి తనే ఓ గొప్ప ఆలోచన చెప్పేసింది శంఖమ్మ.

'హార్నీ! అంటూ ఆశ్చర్యపడిపోయాడు కాంతారావు.

పాపం! పుల్లయ్యకీ విషయం తెలియదు. మామూలుగా షాపుకు పోయి వస్తూనే వున్నాడు.

తనకూ చక్రమ్మకూ చెడిందని శంఖమ్మ ఏనాడూ పుల్లయ్యకు చెప్పలేదు. ఓనాటి ఉదయం సుబ్బరాజు (పుల్లయ్య షాపుయజమాని) ఇంటికివెళ్ళి ఆమాటా ఈమాటా మాట్లాడాక 'పుల్లయ్య ఎలా పని చేస్తున్నాడండీ? నమ్మకస్థుడేనా?' అనడిగాడు కాంతారావు.

'అతని కేమండీ? బంగారంలాటి మనిషి. ఏం అలా అడిగారు?" అన్నాడు సుబ్బరాజు.

'ఏమిటోలెండి! మొదట బంగారంలా మెరిసి తర్వాత ఇత్తడిలా కిలుంపట్టి పోవచ్చు. ఎందుకైనా మంచిది. ఓ కంట కనిపెట్టి చూస్తూండండి. వస్తా! అర్జెంటు పనుంది' అంటూ లేచ్చక్కా పోయాడు కాంతారావు. సుబ్బరాజు ఆలోచనలో పడ్డాడు. ఆ రోజునుంచీ పుల్లయ్యను ఓ కంటితో కనిపెట్ట సాగాడు.

మరో నాలుగు రోజులు గడిచాక కాంతారావు మళ్ళీ వెళ్ళాడు. 'మీ కొట్లో సామాన్లూ, డబ్బూ జాగ్రత్త సుమండీ! పుల్లయ్య నమ్మదగిన వ్యక్తిగా కన్పించడంలేదు' అంటూ చెవిలో వూది పారిపోబోయాడు.

సుబ్బరాజతని జబ్బ పడేసి పట్టుకుని 'అదేమిటో చెప్పి మరీ పారిపొండి' అన్నాడు.

'ఏం చెప్పమంటార్లెండి! మా ఇంటికతడు అస్తమానం వస్తూంటాడు. నిన్నరాత్రి అతన్ని గదిలో కూర్చోబెట్టి కాళ్ళు కడుక్కొద్దామని పెరట్లో

కెళ్ళానండి. తిరిగొచ్చేసరికి అతనూ లేడు. నా డ్రాయరు సొరుగులో పెట్టిన పాతిక రూపాయలూ లేవు' అన్నాడు రావు.

తేలు కుట్టినట్లు ఎగిరి పడ్డాడు సుబ్బరాజు.

'వస్తానండీ మరి' అంటూ పరుగెత్తాడు రావు.

సుబ్బరాజు మెదళ్లో విష బీజం గట్టిగానే పడింది.

కాంతారావు మళ్ళీ కనబళ్ళేదు. ఆఫీసు పన్లుండడంవల్ల గావల్ను!

మరో రెండు రోజులు గడిచాక చక్రమ్మ పెట్టిన లంచం భుజించిన ఆ షాపులో కుర్రాడు రెండు రేడియో వాల్వులు, బల్బులు, హోల్డర్లు వగైరా సామాన్లు తన ఇంటికి జేరేసుకున్నాడు దొంగతనంగా. పైగా యజమానితో చెప్పాడు అవి కనబడ్డం లేదని.

సుబ్బరాజు మెదళ్ళోపడ్డ విషబీజం తక్షణం పెద్ద వృక్షమై పోయింది. పుల్లయ్యమీద ఖాయంగా అనుమాన పడ్డాడు. అయినా పుల్లయ్యను ఆ విషయం నిగ్గదీసి అడగలేదు. అతనికి రావలసిన జీతం ముట్టజెప్పి 'ఇహ ఈ పురుష లక్షణం (ఉద్యోగం పురుష ...) ... ఇంటికి

సుబ్బరాజు అసలు విషయం బయట పెట్టాడు గుంభనగా_ 'చేను క్షేమంకోరి కంచె వేయిస్తే కంచే చేను తినడం మొదలెట్టింది. అలాటి కంచె నాకెందుకు? అందుకే కొట్టేశాను' అంటూ. ఏదో కొంత అర్థమయినా అసలు విషయం తెలియక బిక్కమొహం పెట్టాడు పుల్లయ్య.

షాపుకుర్రాడు పోయిన సామాన్లని గురించినిగ్గదీశాడు ధైర్యంగా. పుల్లయ్య వెంటనే షాపంతా గాలించాడు. నిజమే! ఆ వస్తువులు లేవు. వణికిపోవడం మొదలెట్టాడు.

'నేను తీయలేదమ్మొర్రో' అన్నాడు. 'మీరు నన్నపార్థం చేసుకున్నారు బాబోయ్' అని ఏడ్చాడు. మొత్తుకున్నాడు. పిల్లలు లేకపోయినా మాట వరసకి 'బిడ్డాపాపా కలవాణ్ణి; కనికరించండి' అని వేడుకున్నాడు. 'మీ కంత అనుమానంగా వుంటే పోయిన సామాన్ల ఖరీదు కట్టుకోడం ధర్మం కాని, నన్ను మొదలంటా పీకేయడం ధర్మమా?' అనడిగాడు.

ఇంకా చాలా విధాలుగా సుబ్బరాజు మనసు కరిగించాలని చూశాడుగాని అది గంధర్వగానం కాక పోవడంవల్ల గావల్ను - సుబ్బరాజు మనసు కఠిన ...నే వుండిపోయింది

ఇంటికొచ్చి పెళ్ళాంముందు బ్యా ర్ మన్నాడు తమ దురదృష్టాన్ని నిందించుకుంటూ. శంఖమ్మకూ చక్రమ్మమీద ఏ అనుమానమూ రాలేదు. భర్తతోబాటు తనూ కాసేపు ఏడ్చి అతణ్ణి సముదాయించింది.

మర్నాడు పొద్దున్నే పుల్లయ్య కాంతారావింటికి వెళ్ళి తన గోడంతా వెళ్ళబోసుకుని 'మీరిప్పించిన ఉద్యోగం నిలుపుకోలేకపోయాను. దరిద్రుణ్ణి' అంటూ బాధ పడ్డాడు.

సమయానికి చక్రమ్మందుకుని 'అంతేలెండి! శునకాన్ని కనకపు సింహాసనం మీద కూర్చోబెట్టినట్టయింది మాపని. ఇంతకూ మాకు మాట దక్కలేదు. మాకీ శాస్తి కావాల్సిందే కావాలనినెత్తినేసుకున్నందుకు' అంటూ ఎత్తిపొడుపులు సాగించింది.

ఆపాటే పాడాడు మగ కాంతారావు.

పుల్లయ్య మళ్ళీ తన మొదటి బట్టల కొట్టు యజమాని దగ్గర కెళ్ళాడు—ఉద్యోగ-భిక్షకోసం.

అతడు ఎడాపెడా ఝాడించి 'రేపురా! మాపురా!' అంటూ తన చుట్టూ నాలురోజులు తిప్పుకుని, చివరికి 'అరవై రూపాయలే ఇస్తాను. ఇష్టమైతే పన్జెయ్యి! లేకపోతే ఓ సలాం కొట్టి ఉడాయించు' అన్నాడు.

పుల్లయ్య ఓ సలాంకొట్టి పోలేదు. మళ్ళీ గానుగెద్దు జీవితం ప్రారంభించాడు.

ఇన్నాళ్ళకు జ్వరం ధర్మమా అని శంఖమ్మ చక్రమ్మలు నాలీ కలిశారు.

మళ్ళీ పదార్థాలు ఇక్కడ వక్కడకు, అక్కడి విక్కడకు ఎగిరిపోవడం, దిగజారిపోవడం మొదలెట్టాయి.

చక్రమ్మ చేసిన ద్వితీయ దాడివల్ల కాంతారావు మళ్ళీ పుల్లయ్యకోసం ఉద్యోగాన్వేషణ చేశాడుగాని ఎక్కడా ఫలించలేదు. ఇంటికొచ్చి చక్రమ్మ దగ్గర తన చేతకాని తనాన్ని బయట పెట్టాడు.

చక్రమ్మ విరగబడి నవ్వి 'హేం మగాళ్ళండీ! తెలివి తేటలు శూన్యం. మీకు తెలీకపోతే నే జెప్తా పట్టండి' అంటూ ఓ బ్రహ్మాండమైన ఆలోచన చెప్పేసింది.

కాంతారావు కొయ్యబారిపోయి, కాసేపటికి తేరుకుని, నేలమీద కూలబడి 'ఓసి నీ దుంపతెగ! నా ఉద్యోగం నువ్వే చెయ్యవే! నేను హాయిగా ఇంట్లో వంట చేసి కూచుంటాను' అన్నాడు తన భార్య తెలివి తేటల కుబ్బిపోతూ.

'ఆ! మిమ్మల్ని వంటలో పెట్టినా కుమ్మా దుమ్మే' అంటూ హేళన చేసింది చక్రమ్మ.

హెడ్ క్లర్కు కాంతారావు ప్రొప్రయిటరు పరంధామయ్య గదిలోకి వెళ్ళాడు మర్నాడుదయం పదకొండు గంటలవేళ.

"ఏమిటి కాంతారావుగారూ!" అన్నాడు పరంధామయ్య.

"మీరు మరోలా భావించకుండా వుంటే మీకో విషయం చెప్పుకుండా

మని...." చిరునవ్వుతూ సాగదీశాడు రావు.

"భావించను. చె ప్పు కోం డి" అన్నాడు పరంధామయ్య.

ఆఫీసులో పని పెరిగి పోయిందని, ఉన్న గుమాస్తాల కది తట్టుకోడం కష్టంగా వుందనీ, పేపర్లు చాలా బకాయీలు పడిపోతున్నాయనీ వినయ విధేయతలతో చేతులు నలుపుకుంటూ మనవి చేసి 'మరో గుమాస్తాను వేసుకోడం లాభదాయకం' అని సూచించాడు.

పరంధామయ్య ఓ నిముషం ఆలోచించి 'అలాగే లెండి! పేపర్లో ప్రకటిద్దాం వచ్చేవారం' అంటూ ధైర్యం చెప్పి సముదాయించి పంపేశాడు.

తన భార్య చాలా కరెక్టయిన ప్లాను చెప్పినందుకు బహుమురిసిపోయాడు రావు. ఆ సాయంత్రమే ఓ రిక్షాలో ఇంటికెళ్ళి భార్య కీశుభవార్త చెప్పి తల కడిగేసుకున్నాడు కుంకుడుకాయలతో.

వెంటనే చక్రమ్మ పెరట్లోకి పరుగెత్తి గోడమీదుగా శంఖమ్మను కేకేసి పుల్లయ్యను వెంటనే దరఖాస్తు పెట్టమని సణగవలసిందిగా పోరేసింది. శంఖమ్మ సణిగింది.

పుల్లయ్య దరఖాస్తు వెళ్ళింది మర్నాడు టపాలోనే!

నాల్గోనాడు ఇంటర్వ్యూ వచ్చింది పుల్లయ్యకు.

పుల్లయ్య నున్నగా క్షౌరం చేయించుకుని, యిస్త్రీబట్టలు కట్టుకుని వెళ్ళాడు. అడిగిన ప్రశ్నలకు తక్కువైన జవాబులు

చెప్పాడు. 'వెరిగుడ్' అనిపించుకుని షేక్‌హాండు కూడా పుచ్చుకున్నాడు పరంధామయ్య వద్దనుంచి.

'మీరింతకీ కాంతారావుగారి కాండిడేట్ అనుకుంటా' అన్నాడు పరంధామయ్య వాలుచూపులుచూస్తూ.

'మరేనండీ! మీకుచెప్పారావారు?' అన్నాడు పాపం పిచ్చిపుల్లయ్య సంతోషంగా.

'ఈ భాగ్యానికి చెప్పాలిటండీ? వారికి పరోపకార బుద్ధి ఎక్కువని తెలుస్తూనే వుందిగా' అన్నాడు పరంధామయ్య.

'నిజం చెప్పాలంటే ఈ ఉపకారం వారి భార్య చక్రమ్మగారిదండీ! ...

'ఆఁ!' అదిరిపడ్డాడు పరంధామయ్య.

'ఔనండీ! చాలా మంచివారు. ఇదివరకోసారి కూడా ఇలాగే ఉపకారం చేశారు. నా దురదృష్టంవల్ల నిలుపుకోలేకపోయానా ఉద్యోగం' అన్నాడు పుల్లయ్య ఎంతో నొచ్చుకుంటూ

'అరెరే! అదేమిటండీ! అసలు కథేమిటి? ఇలా కూర్చుని చెప్పండి' అంటూ పుల్లయ్యను కుర్చీలోకూర్చుండబెట్టాడు పరంధామయ్య. తనకు తెలిసిన కథంతా చెప్పుకొచ్చాడు పుల్లయ్య.

ఇంతలో ఆఫీసుబోయ్ ఓ చీటీ తెచ్చాడు పరంధామయ్య వద్దకు.

అదిచూసి, పుల్లయ్యతో 'ఇహమీరు వెళ్ళండి. రేపొచ్చి జాయిన్ అవండి' అంటూ సెలవిచ్చాడు. పుల్లయ్య లేచాడు

చీటీతెచ్చిన కుర్రాడితో 'రమ్మను' అన్నాడు.

కుర్రాడు వెళ్ళిపోయాడు.

బయటకు పోతున్న పుల్లయ్యకు సుబ్బరాజు తటస్థపడ్డాడు గుమ్మంలోనే. పుల్లయ్యకు ముచ్చెమటలు పోశాయి. బిక్కుబిక్కుమనే చూపులతో వణికే చేతులతో ఓ నమస్కారం పారేసి తలొంచుకు పారిపోయాడు. సుబ్బరాజు అతణ్ణే చూస్తూ వుండిపోయాడు.

ఇదంతా గమనించిన పరంధామయ్య సుబ్బరాజును సంభోధిస్తూ 'మీదగ్గర ఇదివరకు యితడు పనిచేశాడటగా?' అనడిగాడు.

'అవునండీ! పాపం.... మీ హెడ్ క్లర్కు కాంతారావు ఆడిన నాటకంవల్ల నిజంతెలియక అతడినోట నేనే మట్టిగొట్టాను. నిజమేమిటో ఈవాళే తెలిసింది. ఆ నాటకం విషయం మీతో మనవి చెయ్యాలనే ఇప్పుడిక్కడికొచ్చాను' అన్నాడు సుబ్బరాజు సీరియస్‌గా.

పరంధామయ్య ఆ నాటకమేమిటో విన్నాడు. కాంతారావు, అతనిభార్య చక్రమ్మ పుల్లయ్య కడుపుమీద ఎలా కొట్టిందీ తెలుసుకున్నాడు.

పుల్లయ్య యెడ జాలి, కాంతారావు యెడ ద్వేషమూ కలిగాయి. తల పంకించి, ఒక్క నిట్టూర్పు విడచి 'వాడి రోగం నేను కుదురుస్తాలెండి' అంటూ సుబ్బరాజుకు అభయహస్తమిచ్చి పంపేశాడు.

పరంధామయ్య ఆలోచనలో పడ్డాడు.

ఆ మర్నాడు పుల్లయ్య ఆఫీసుకు వచ్చి జాయినింగ్ రిపోర్టిచ్చాడు పరంధామయ్య చేతికి.

పరంధామయ్య అతనితో 20 ఏళ్ళ పాటు పని చెయ్యడానికి ఎగ్రిమెంటు రాయించుకున్నాడు.

ఇంతలో కాంతారావు వచ్చాడక్కడకు.

'రావుగారూ! మన పుల్లయ్యగార్కి ఉద్యోగం ఏర్పాటు చేశాను మనాఫీసులో' అన్నాడు పరంధామయ్య నవ్వుతూ.



'అయ్! చిత్తం' అన్నాడు రావు చేతులు కట్టుకుని.

మళ్ళీ మీ ఆవిడ చెప్పిన మాటలు విని యితని ఉద్యోగం ఊడదీయించరు గదా?' చాలా తాపీగా అడిగాడు పరంధామయ్య.

కాంతారావు ముఖం వెలవెలబోయింది. నోట మాట పెగల్లేదు. నిలువుగుడ్లు పడిపోయాయి.

పుల్లయ్య కిదేమిటో అర్థం కానే లేదు. అతడూ కొయ్యబారిపోయాడు.

ఇద్దరి ముఖాల్లోని భావాలు ఒక్కసారి పరీక్షించి "సరే పుల్లయ్యగారూ! ఈ రోజునుంచీ మీరు యీ ఆఫీసులో హెడ్ క్లర్కుగా వ్యవహరించ బోతున్నారు. ఈ శుభ సమయాన్ని పురస్కరించుకుని శ్రీ శ్రీ శ్రీ కాంతారావుగారు మీకు ఛార్జి వప్పజెప్తారు. వెంటనే తీసుకోండి!" అంటూ పరంధామయ్య కాంతారావువైపు తిరిగి "పుల్లయ్యగారి ఉద్యోగపు ఏర్పాటు తమకు సంతృప్తి కలిగించాలనే మా కాంక్ష. మీకు ఆనందంగా వుందా?" అన్నాడు చిరునవ్వుతో. ఈ వార్త తన పాలిట అమృతమో, గరళమో తేల్చుకోలేక— మింగనూలేక, కక్కనూలేక, చాకలెట్లకోసం ఆముదం పుచ్చుకున్న చిన్న పిల్లడిలా మొహం పెట్టి "ఔనండీ! మరేనండి! నాకు ఎంతో చాలా గొప్ప ఆనందంగా ఉందండి" అన్నాడు కాంతారావు బలవంతంగా.

"ఈ ఏర్పాటు మీ ఇద్దరికీ ఆనందం

కల్గించింది కాబట్టి నా ఆనందంకోసం యీ అత్యవసర పరిస్థితిలో శ్రీ కాంతా రావుగారిని మామూలు నూరు రూపా యల గుమాస్తాగా రివర్టు చేస్తున్నాను" అంటూ ప్రకటించాడు పరంధామయ్య ముందున్న కాగితాలు తిరగేస్తూ.

కాంతారావు కుప్పలా కులిపోయాడు నెత్తిన పిడుగుపడ్డ వాడిలా. పుల్ల య్యకు మతిభ్రమణం కలిగినట్లయింది.

పరంధామయ్య ఇవేమీ పట్టించు కోకుండా కాగితాలు తిరగేస్తున్నాడు.

మరో నిముషంలో "నాన్సెన్సు! నాకీ ముష్టి ఉద్యోగం అక్కర్లేదు! నేను రిజైను చేస్తాను" అంటూ తారాజువ్వలా లేచాడు కాంతారావు. తడి ఆరిపోయి వణుకుతున్న గొంతుకతో.

"కాని మీరు నా ఫరంలో ఇరవై యేళ్ళపాటు ఉద్యోగం చేస్తానని ఎగ్రి మెంటు రాసిచ్చారుగా! అందువల్ల మీరింకా పుష్కరంపాటు నాదగ్గరే శ్రమించాలి, తప్పదు. దయచేసి నా ఆనందానికి భంగం కల్గించడానికి మాత్రం ప్రయత్నించకండి. ప్రయోజన ముండదు అన్నాడు పరంధామయ్య తాపీగా.

బందీయైన దాసునోరు మూతబడి పోయింది.

పరిస్థితి విషమించి పోయిందని తెలుసుకున్న పుల్లయ్య వెంటనే పరం ధామయ్య కాళ్ళమీద బడ్డాడు. "అయ్యా! రావుగారికి నా మూలంగా అన్యాయం చేయకండి." అన్నాడు. "ఏమీ తెలియనివాణ్ణి! నా మొహం నేను హెడ్‌క్లర్కునేమిటి?" అన్నాడు. "నాకు మామూలు ఉద్యోగం చాలు" అన్నాడు. "దయదల్చండి" అని వేడు కున్నాడు, ఇంకా చాలా విధాలుగా చాలా చాలా దయగల్గించే మాటలు వాడాడు. ఏవీ పన్చెయ్యలేదు.

చివరకు విసిగెత్తి కాంతారావు మీది కృతజ్ఞతకొద్దీ "నాకీ ఉద్యోగ మక్కర్లేదు" అన్నాడు పుల్లయ్య బలంగా బల్లగుద్ది.

పరంధామయ్య దీనికేమీ చెదర కుండానే "మరి మీరూ ఎగ్రిమెంటు రాసిచ్చారుగా ఇరవై ఏళ్ళకి" అన్నాడు సంతోషంతో ఎగిరిపోతూ.

పుల్లయ్య మళ్ళీ బల్లమీద గుద్దే ప్రయత్నం చేయలేదు.

---

"మా పక్కింట్లో వుంటున్న భార్యాభర్తలది చాలా అనుకూల దాంపత్య మని చెబుతారు."

"ఎందుచేతో?"

"అతగాడు ఘోరంగా గుర్రుపెడతాట్ట. ఆమెగారికి బ్రహ్మచెముడట?"

"మరైతే వెళ్ళి మీ ఇద్దరూ మీ మీ పనుల్లో ప్రవేశించండి. వెళ్ళండి." ఆజ్ఞాపించాడు పరంధామయ్య.

ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని బరువుగా అడుగు లేసుకుంటూ గది గుమ్మందాకా వెళ్లేసరికి "కాంతారావుగారూ" అని పిల్చాడు పరంధామయ్య.

ఇద్దరూ వెనక్కి తిరిగారు.

"మీ రిప్పుడుంటున్న డాబా యిల్లు ఇవేళ రాత్రికి ఖాళీచేసి పుల్లయ్యగారికివ్వటం మర్చిపోకండే! అది హెడ్ క్లర్కు సంసారంకోసం నేను భరించే అద్దె ఇల్లు!" అన్నాడు వెటకారంగా నవ్వుతూ.

కాంతారావు నెత్తిన మరో పిడుగు!

"అయ్యా! ఉన్నపళంగా ఖాళీ చెయ్యమంటే ఎలాగండీ? నాకు మరో ఇల్లు దొరకొద్దూ?" అన్నాడు కాంతారావు కన్నీళ్ళు కారుతుండగా.

"దాందేముంది లెండి. ప్రస్తుతం పుల్లయ్యగారుండే ఇంట్లోకి మీరు వెళ్ళవచ్చు. కావాలంటే ఆ ఇంటాయనతో నేను మాట్లాడతాను - ఏమంటారు?" అన్నాడు పరంధామయ్య.

కాంతారావు ఔనన్లేదు. కాదన్లేదు. అలాగే నిలబడిపోయాడు. పుల్లయ్య నిలువునా బాధతో కుమిలి పోవడం మొదలెట్టాడు. మరుక్షణంలో గదిలో నుంచి నిబయట పడ్డాడు ఒక్క అంగలో.

"ఇదిగో! కాంతారావుగారూ! మీరు సాయంత్రం ఇంటికెళ్ళాక పరిస్థితంతా మీ ఆవిడతో చెప్పండి. కాని, పుల్లయ్యగారి ఉద్యోగం మళ్ళీ తీసేయించడానికి ఆవిడేదన్నా మహత్తరమైన ప్లానుచెప్తే మాత్రం ప్రయత్నించకండి. ఫలితం ఉండదు. పాపం ఆవిడకు ఉచ్చనీచాలు తెలియవులాగుంది" అన్నాడు పరంధామయ్య మరోసారి వికటంగా నవ్వుతూ.

పెళ్ళామంటే అసహ్యం కలగడం మొదలెట్టింది కాంతారావుకు. వెనక్కి తిరగబోయాడు.

"ఇదిగో! ఇంకొక్కసంగతి..ఇంత తిరణాలెందుకు జరిగిందో తెలుసా? ఆఫీసులో జరిగే సంగతులు, రహస్యాలు తమరు బయటపెట్టినందుకు. ఇకమీదనైనా బుద్ధిగా వుంటారని ఆశిస్తున్నాను. ఏమంటారు?" అన్నాడు పరంధామయ్య పాతధోరణిలోనే.

కాంతారావు ఏమీ అనలేదు. తలొంచుకు నిలబడ్డాడు అవమానభారంతో

"వెళ్ళి చార్జీ అప్పజెప్పవయ్యా! పో" గర్జిగా అరిచాడు పరంధామయ్య.

పోయాడు కాంతారావు_చార్జీ అప్పగించేందుకు.

***

# మారిన జీవితం

## కొడవటిగంటి కుటుంబరావు

బుద్ధి తెలిశాక దత్తుపోయే కుర్రాళ్ళ సంగతి తలుచుకుంటే నా కొకప్పుడు ఒళ్ళు గరి పొడచేది. వాళ్ళు ఆస్తికోసం ఒక అమ్మనూ, అయ్యనూ వొదిలేసి, తాము పుట్టి పెరిగిన ఇంటినీ, వాతావరణాన్నీ వొదిలేసి, ఇంకో ఇంటికి పోయి, ఇంకో పరాయి ఆవిణ్ణి అమ్మా అనీ, పరాయి ఆయన్ని నాన్నా అనీ పిలవాలి. సొంత అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ ఎవరో అన్నట్టుగా నటించాలి. దత్తుపోయిన వాళ్ళు ఈ పనులన్నీ నేనూహించిన దానికన్న సులువుగానే నేర్చుకుంటారేమో నాకైతే తెలీదు. కాని నా ఉద్దేశంలో వాళ్ళు పడే వేదనకన్న వాళ్ళను చూసి సానుభూతిపరులు పడే వేదనే సాంఘిక ప్రయోజనం గలది. మనుషులకు ఎంత సహనశక్తి ఉంటుందో ఎవరూ కనిపెట్టలేదు. కొంచెం సంస్కారం గలవాళ్ళు దుర్భరంగా తలపోసే పరిస్థితులలో కోట్లాది మానవులు జీవిస్తున్నారు. సహనం అవసరమైనకొద్దీ మనసు మొద్దుబారుతుంది. మరీ దుర్భరమైనశరీర బాధ కలిగినప్పుడు మనసు మూర్ఛపోవటం మనకు తెలిసినవిషయమే.అనేకమందిపాక్షిక మానసిక మూర్ఛలు జీవితాలను వెళ్ళబుచ్చి, చివరకు ఏకంగా కన్నుమూస్తారు. ఈ మూర్ఛలో వున్నవాళ్ళు సంస్కారాన్ని పెంచలేరు, సాంఘిక పరిణామాన్ని సాధించనూ లేరు. లక్షమంది బాలవితంతువులు చెయ్యలేని సంస్కారాన్ని ఒక్క వీరేశలింగంపంతులుగారు చేశారంటే- ఆయన పడినవేదన వారందరి కన్న ఎక్కువైనది గనకనే.

దత్తుపోయినవాళ్ళు అందరికీ అణిగి మణిగి ఉండటం నేను గమనించాను. ఇల్లరికం వచ్చిన అల్లుళ్ళు కూడా అంత అణకువగా ఉండరు. దత్తపుత్రులు మొట్టమొదట నేర్చుకునే విద్య తమ సహజ భావాలను గోప్యంగా ఉంచుకోవడం — తమ ప్రేమలనూ, ద్వేషాలనూ, బాధలనూ, ఒక్కొక్కప్పుడు సంతోషాన్నీ కూడా అణచిపెట్టుకోవడం. వాళ్ళను చూస్తున్నప్పుడు నాకేదో స్ఫురణకువస్తున్నట్టుండేది. కాని అదేదో తెలుసుకోవటానికి నాకు దాదాపు పదేళ్ళు పట్టింది. దత్తపుత్రులను చూస్తే నాకు జ్ఞాపకం రావటానికి ప్రయత్నించినది — కాపరానికి వచ్చే ఆడవాళ్ళు.

ఎక్కడో ఒకదత్తు పోయినవాడికి కలిగే అనుభవం దాదాపు ప్రతి ఆడ

**పెద్ద కథ**

దానికి కలుగుతుంది. వీళ్ళిద్దరికీ తేడా ఏమంటే, కాపరానికి వెళ్ళగలందులకు ఆడపిల్ల తండ్రి ఇల్లు గుల్లచేస్తుంది, దత్తుడు తన జనక స్థానంలోలేని ఐశ్వర్యం కోసం వస్తాడు. వాడిపనే చాలా మెరుగు.

నేను గ్రహించిన ఈ విషయాలు మా ప్రకాశానికి పనికొస్తాయని ఎంతో ఆశించాను — కాని నా ప్రయత్నం వృధా అయింది. అది ఫలిస్తుం దను కుని ఉండటం నా పొరపాటే. జీవితాన్ని గురించి లక్ష సత్యాలు తెలుసుకుని ఏం ప్రయోజనం, ఒక్క చిన్న సత్యానికి అనుగుణంగా జీవితాన్ని మార్చే శక్తి లేనప్పుడు? సంస్కారం విప్లవాత్మక మైనది. ఉత్త జ్ఞానం చాలదు. వీరేశలింగం పంతులుగారు తానై ఒక్క వితంతువునూ పెళ్ళాడలేదు, యువకులలో ఒక విప్లవ చైతన్యాన్ని తెచ్చిపెట్టాడు.

చిత్రమేమిటంటే మా ప్రకాశం మంచి సంస్కార భావాలు కలవాడు. వాడికి పాత కాలపు మకిలి భావాలు ఏ మాత్రమూ గిట్టవు. కుసంస్కారాన్ని సహించలేక వాడు కొందరు దగ్గర బంధువులను సైతం వదులుకున్నాడు. కులం విడిచి పెట్టాడు. "ప్రకృతి ఏ ఇద్దరు మనుషులనూ ఒక రకంగా పుట్టించటం లేదు. ఆ తేడాలు చాలనట్టు సంఘం మరికొన్ని తేడాలు కృత్రిమంగా కలిగించి, ఒకరికన్న మరొకరు తక్కువ జన్మ ఎత్తారనటం దారుణం. ప్రకృతి కలిగించే తేడాలను సంఘం సరిచెయ్యాలి. బలవంతులు దుర్బలులకు తోడ్పడాలి. పిల్లలను పెద్దలు సంరక్షించాలి. పడినవాణ్ణి నిలబడ్డ వాడు ఎత్తాలి. అంతేకాని ఒక్క సంఘంలో కొందరు హీనంగా పుట్టినవాళ్ళా? కొందరు అంటరానివాళ్ళా? అటర్లీ స్టుపిడ్! స్టుపిడ్ కూడాకాదు. హంబగ్. ఆ అంటరాని వాడే ఆఫీసరైతే బ్రహ్మరథం పట్టేస్తారు!" అనేవాడు ప్రకాశం.

ప్రకాశానికి ముగ్గురు మగపిల్లల మధ్య ఒక్కతే ఆడపిల్ల — లీల. దాన్నినేను పుట్టిన నాటినుంచీ ఎరుగుదును. అంత చలాకీగా ఉండేది కాదుగాని, మంచి ఆలోచనా శక్తి గలది. చాలా మితంగా మాట్లాడేది. కాని మాట్లాడినప్పుడు ఎంతో ఆలోచించి మాట్లాడినట్టుగా ఉండేది. ప్రకాశం కాస్త ఉద్రేకమైన మనిషి. లీల సాధారణంగా తొణికేదికాదు. తల్లిమోస్తరు. అయితే ఆవిడ అంత తెలివిగల దానికింద జమ కాదు.

అందుకే ప్రకాశం తన భార్యతో అడుగడుగునా పోట్లాడుతూ లీలను ఒక రకంగా పెంచుకొచ్చాడు. వాడి ఉద్దేశం ఆడపిల్లలను మగపిల్లలల్లాగే పెంచాలని, వాడి భార్య ఉద్దేశం ఆడపిల్లలు మగపిల్లలల్లే పెరగరాదని; "నేను ఆడ



దాన్ని, కష్టాలు పడవలిసినదాన్ని, చాకిరీ చెయ్యవలిసినదాన్ని, నలుగురూ నాలుగు మాటలూ అంటే పడి ఉండవలిసినదాన్ని" — ఈ ధోరణిలో ఆలోచించటం తనకూతురు చిన్నతనంనుంచే నేర్చుకోవాలని ఆవిడ ఉద్దేశం. అటువంటి మాటలు వింటేనే ప్రకాశానికి కంపరమెత్తేది.

"నాకున్నదే ఒక్కకూతురు. దాన్ని నా కంఠంలో ఊపిరి ఉండగా, బానిసతనానికి తయారు కానివ్వను." అనేవాడు ప్రకాశం.

"కానివ్వక ఏం చేద్దామని మీ ఉద్దేశం?" అనేది భార్య.

"అది చదువుకుంటుంది. ఉద్యోగం సంపాదించుకుంటుంది. దాని కాళ్ళపైన అది నిలబడుతుంది. ఆర్థిక స్వాతంత్ర్యం! అది ఉంటే మిగిలిన స్వాతంత్ర్యాలన్నీ అవే వస్తాయి" అనేవాడు ప్రకాశం.

"అంటే దానికి పెళ్ళీ పెటాకులూ, సంసారమూ, ఇల్లూ వాకిలీ, ఏమీ వద్దా?"

"నీ ముగ్గురు కొడుకులను గురించీ ఈ మాట ఏనాడైనా అడిగావా?"

"వాళ్ళ దారి వేరూ. వాళ్ళు మగాళ్ళు ఎలాగైనా బతుకుతారు."

"అదీ అంతే. పెళ్ళి మగాడికన్న ఆడదాని కెక్కువ ముఖ్యమనే మాట నేను చచ్చినా ఒప్పుకోను."

ఈ విధంగా అడపా దడపా భార్యా భర్తలమధ్య వాగ్వాదాలు జరుగుతూండేవి. వాళ్ళు ఒకరి నొకరు అర్థం చేసుకునే అవకాశం లేదు. ఆవిడ ఉన్న సమాజాన్ని మనస్సులో వుంచుకుని మాట్లాడేది. వాడేమో తన కూతురి కొక ఉజ్వల భవిష్యత్తు ఊహించుకుని, దాన్ని చూస్తూ మాట్లాడేవాడు.

ప్రకాశందీ రోడ్డు రోలరు మనస్తత్వం కావటంచేతా, వాడి భార్య మెతక స్వభావంగల మనిషి కావటం చేతా, లీల తండ్రికి ఎలసినట్టే పెరిగింది. దానికి చదువులో నూటికి యాభై పైగా మార్కులు వచ్చేవి. క్లాసులో మరీ గొప్పగా రాణించేదీ కాదు, బొత్తిగా సామాన్యంగానూ ఉండేది కాదు. క్లాసు పుస్తకాలకన్న ఇతర పుస్తకాలు తెగ చదివేది.

ప్రకాశం దీక్ష పట్టినవాడి మచ్చు. తన పిల్లలకు సంగీతమూ, సాహిత్యమూ, చిత్రలేఖనమూ, సినిమాలూ, అన్నీ అందుబాటులో ఉంచేవాడు. ఎవరికి ఎందులో అభిరుచి కలుగుతుందో, ఎందులో రాణిస్తారో చెప్పలేమని వాడి వాదం. గాలి పాటతో సినిమా గాయకులైన వాళ్ళనూ, సొంతాన ఆర్టు నేర్చుకున్న వాళ్ళనూ వుదాహరణలుగా చెప్పేవాడు.

లీల తన ఎనిమిదో ఏట డాన్సులో ఆసక్తి కనబరచింది. ప్రకాశం డాన్సు మేస్టరును పెట్టాడు. దాదాపు ఒక సంవత్సరంపాటు కర్రల చప్పుళ్ళతో వాళ్ళిల్లు అదిరిపోయింది.

"ఎందుకండీ ఈ దిక్కుమాలిన డాన్సు?" అని ప్రకాశం భార్య అభ్యంతరం చెప్పింది. అది కూడూ గుడ్డా పెట్టదనీ, పెళ్ళయాక డాన్సు చేస్తానంటే అత్తవారు దానికాళ్ళు విరగ్గొడతారనీ ఆవిడ ఆందోళన. ఆవిడ దివ్యదృష్టికి కనిపించిన లీల భవిష్యత్తులో "తకధిం"కు ఎక్కడా చోటు లేదు. ప్రకాశం లీల భవిష్యత్తును దుర్భిణివేసి చూడలేదన్న మాటేగాని, లీల లకినంబరు డాన్సులోనే ఉండే పక్షంలో ఆ డాన్సు ఎందుకు పాడు చెయ్యాలని!

ఒక సంవత్సరం గెంతాక లీలకు డాన్సులో ఆసక్తి తగ్గిపోయి సంగీతం మీద బుద్ధి మళ్ళింది. డాన్సు మేస్టరు నిష్క్రమించి సంగీతం మేస్టరు రంగంమీదికి వచ్చింది. గాత్ర పాట సారీగామాలతో ప్రారంభమై మెల్లగా ముందుకు సాగింది. లీల గొంతు అంత శ్రావ్యమూ కాదు, బొత్తిగా గార్దభస్వరమూ కాదు. అది పాట నేర్చుకుంటున్న రోజుల్లో ఒక్కటి

మాత్రం నేను చెప్పగలిగాను. అది పాడటానికి పుట్టిన మనిషి మట్టుకు కాదు. అటువంటప్పుడు దాని సంగీత శక్తి నూటికి తొంభై పాళ్ళు అది చేసే సాధనపైన — తపస్సుపైన—ఆధార పడుతుంది.

నిజానికి లీల అటువంటి తపస్సేమీ చెయ్యలేదు. సంగీతమంటే దాని దృష్టిలో సినిమా పాటలు. సంగీతం మేష్టరు వాటిని నేర్పలేదు. ఆయన నేర్పే సంగీతం లీలకు కొంచెం కూడా బాగాలేదు. ఒక మంచి రోజు చూసి సంగీతం మేష్టరు సెలవు పుచ్చుకున్నాడు.

ఆ తరవాత కొద్ది రోజులకు నేను ప్రకాశం వాళ్ళింటికి వెళ్ళేసరికి లీల తల ఒక పక్కకి పెట్టి ఏదో బొమ్మ గీస్తున్నది. ఏదో సహాయం చెయ్య మని తల్లి వంటింట్లో నుంచి పిలు స్తుంటే అది విసుగ్గా, "అయిపో వచ్చింది, కొంచెం వుండమ్మా!" అంటున్నది.

తరవాత ప్రకాశం చెప్పాడు. లీలకు ఆర్టుమీద ఎక్కడలేని ఆసక్తి పుట్టు కొస్తున్నదట. "వ్యవసాయాత్మికాబుద్ధి రేవేహకురునందన" అన్నాడు గీతలో. లీలకు ఎందులోనూ ప్రవేశం కలగదని నా కెందుకో అనుమానం కలిగింది.

ఆ మాటే నేను ప్రకాశంతో లౌక్యంగా అన్నాను. "లీలకు ఎందులో గాని నిజంగా చొరవ ఉన్నట్టు రూఢి అయేదాకా నువు మాత్రం ప్రోత్సాహం ఇవ్వకు. దాని మనసు దానికే సరిగా తెలిసినట్టు లేదు." అన్నాను.

లీలకు కోరిన అవకాశాలు మాత్రమే ఇస్తున్నాను గాని ప్రోత్సాహం ఇవ్వటం లేదని ప్రకాశం అన్నాడు. అసలు వచ్చిన చిక్కేమిటో నాకు తరవాతగాని అర్థం కాలేదు. డాన్సు నేర్చుకుంటు న్నప్పుడు గాని, సంగీతం నేర్చుకుంటు న్నప్పుడు గాని, చివరకు బొమ్మలు వేస్తున్నప్పుడు గాని లీల నేర్చుకుం టున్నవిద్యలో ఆసక్తి కనబరిచి, తగిన వాతావరణం సృష్టించినవారు లేరు. మేష్టర్లను పెట్టగానే తన డ్యూటీ తీరి పోయినట్టు ప్రకాశం ప్రవర్తించాడు. తల్లి, "మేష్టరున్నంతసేపే నేమిటే, నీ అంతట నువు సాధన చేసుకోవేం?" అని పోరేది. సాధన అనగానే లీలకు అదొక శిక్ష అనే భావం ఏర్పడిపోయి నేర్చుకునే విద్యమీదనే విముఖత్వం పుట్టుకురాసాగింది. పదిమందితో బాటు నేర్చుకున్నట్టయితే దానికి డాన్సు, సంగీతమూ కూడా వచ్చి ఉండేవేమో మరి. కనీసం లీల అన్నలూ,తమ్ముడూ ఆసక్తి కనబరిచినా ఏమై ఉండేదో. వాళ్ళు లీల విద్యలపట్ల విసుగుతప్ప మరే భావమూ కనబరచలేదు - ఎప్పు డైనా మంచి మూడ్‌లో ఉన్నప్పుడు వేళాకోళం తప్ప. ("ఇవాళ లీలచేసిన డాన్సుకు నాలుగు పళ్ళవొడ్లు బియ్యమై ఉండేవి!" ఇత్యాది.)

లీలకు మిగిలిన వేవీ అంటక పోయినా చదువు మాత్రం అవిచ్ఛి న్నంగా సాగింది. అయితే దాని మార్కు 'బి' నుంచి 'సి క్లాస్'కు దిగ

జారింది. కారణం సినిమాలూ, కథల పత్రికలూనూ. అది ప్రకాశంతోకన్న నా తోనే మనసు విప్పి మాట్లాడే దనుకుంటాను. ప్రకాశం అసి ధారా వ్రతంగాడు, చెప్పినది విని ఊరు కోడు, దానిమీద వ్యాఖ్యానిస్తాడు. లీల బియ్యేలో చేరిన ఏడు దాని మాటలను బట్టి నేను గ్రహించిన దేమంటే: దానికి పెళ్ళంటే అసహ్యం; ప్రేమ కథలు ఇష్టం; ఆడవాళ్ళ కష్టాల కథలు కల్పించి రాసినట్టుంటాయి; జీవితం సినిమాల్లో చూపించి నట్టుంటే బాగానే వుంటుంది; ఎవరింటికి వెళ్ళినా, ఎప్పుడింటికి తిరిగి వద్దామా అనిపిస్తుంది. ఇలాటివే మరికొన్ని ఉన్నాయి.

దాని ధోరణి అర్థం చేసుకుంటున్న కొద్దీ నాకు కాస్త భయం వేసినమాట నిజం. లీల వాస్తవజీవితానికి దూరమవుతున్నది. తన జీవితానికి పెళ్ళి సమస్య ఉండదనీ, ప్రేమ సమస్యే ఉంటుందనీ అనుకుంటున్నది. అంతకన్నా దారుణ మేమంటే అది తమ ఇంటి జీవితానికి బాగా పెనవేసుకు పోతున్నది. రేపు మరొక వాతావరణంలోకి అడుగు పెడితే దాని గతి ఏం కాను? ప్రకాశం ఈ విషయం ఆలోచించినట్టు కనబడ లేదు.

నేను పని పెట్టుకుని ఒకసారి వాళ్ళింట్లో ఈ ప్రసంగం తెచ్చాను.

"మన చిన్నతనంలో బాల్య వివాహాలు జరిగిన రోజుల్లో ఆడపిల్లల పెంపకంలో ఒక సుగుణం ఉండేది," అన్నాను.

"చెత్త జీవితం. అందులో సుగుణాలెంచకు," అన్నాడు ప్రకాశం చీదరించుకుంటూ.

"విను, చిన్నతనం నుంచీ ఆడపిల్ల అని రోసేవాళ్ళు. లేతవయసులోనే ఇంటిపని నేర్పేవాళ్ళు. ఇంటిపని మీద తప్ప ఇతర వ్యాపకాల మీద ఆడపిల్ల ఆసక్తి కనబరిస్తే తిట్టి శాపనార్థాలు పెట్టేవాళ్ళు. ఆఖరుకు పుస్తకం పట్టుకు కూర్చున్నా, పనీపాటా లేదా ఏమని కోప్పడేవాళ్ళు. తనను వదిలించుకోవటానికి తల్లిదండ్రులు పడేపాట్లు ఆడపిల్ల కళ్ళారా చూసేది, నాలుగు సంబంధాలు తిరిగిపోతే తనను వాళ్ళుపెట్టే శాపనార్థాలు చెవులారా వినేది. ఆ రోజుల్లో ఆడపిల్లకు పుట్టింటిపైన అసహ్యం చిన్నచిన్న దోసుల్లో పెళ్ళయే దాకా వంట బట్టేది. అట్లాపెరిగిన పిల్ల కాపరానికి వెళ్ళకముందే అత్తమామల భయాలూ, ఆడబిడ్డలభయాలూ వగైరాలు నేర్చుకునేది. అందుచేత ఆడపిల్లకు కాపరం వెళ్ళటమంటే ఏ బియ్యే పరీక్షో ప్యాసవటమనిపించేది. ఒక గొప్ప విజయం లాగుండేది." అన్నాను.

"ఛీ, ఛీ, కుక్క బతుకు!" అన్నాడు ప్రకాశం.

వాడి భార్య నవ్వుతూ, "అన్నగారిదంతా మరీ విడ్డూరం," అన్నది నా విడ్డూరంలో కొంత నిజం ఉందని గ్రహించినట్టు.

"కుక్క బతుకు కాదనటంలేదు. వాస్తవిక దృష్టిగల పెంపకమనే అంటున్నాను" అన్నాను.

"ఆ వాస్తవాన్ని రబ్బరుతో చెరి పెయ్యి, చించి అవతల పారెయ్యి. కిరసనాయిలు పోసి అంటించు" అన్నాడు ప్రకాశం ఆవేశంతో.

"నా వల్ల అయితే ఎప్పుడో చెయ్యక పోయానుట్రా? వెయ్యిమంది ఆడవాళ్ళలో ఒకతె కూ్కడా జీవితంలో పెద్ద మార్పేమీ లేదు. కుర్రాళ్ళకు కథల్లో ప్రేమ కావాలి. జీవితంలో కట్నం కావాలి. చదువుకున్న ఆడది పెళ్ళాంగా పనికిరాదు. పెళ్ళానికి ఏకళలో ప్రవేశం వున్నా మొగుడు దాన్ని కట్టి పెట్టిస్తాడు. కట్టి పెట్టేదాకా కురుపు సలిపినట్టు సలుపుతాడు. సంస్కారంగల మొగుళ్ళే అలా ఛేశారు."

ప్రకాశం ఆలోచించటానికి ఒక్క క్షణం ప్రయత్నించి, "అందుకని?— ఛీ, ఛీ!" అని తేల్చేశాడు.

"మన పిల్లలు న్యూయార్కుకూ, మాస్కోకూ కాపరం వెళ్ళరు. వాళ్ళు తెల్లవాళ్ళను పెళ్ళాడరు. వాళ్ళకీ అత్తగార్లూ, ఆడబడుచులూ, బావగార్లూ, అడుగడుగునా అనుమానించే మొగుళ్ళూ, ఇరుగు పొరుగు అమ్మలక్కలూ ఉంటారు. పాత ఆచారాలేవీ మారలేదు. అందరిళ్లలోనూ మీ యింటి పద్ధతు లున్నాయను కుంటున్నావా?"

"నీ ధోరణి నా కర్థం కావటం లేదు. అందుచేత ఆడవాళ్ళ జీవితం మారకూడ దంటావా?"

"ఆ మాట నే నెందు కంటానూ? ఉన్న సంగతి చెప్పాను. ఉండవలిసింది కాదు. మంత్రాలకు చింతకాయలు రాల్తే ఇంక లేందేం?" అన్నాను.

"బోలెడంతమంది ఆడపిల్లలు పెళ్ళయి కొత్త పద్ధతిలో జీవిస్తున్నారు."

"ఇది అచ్చంగా ఆడపిల్లలకు మాత్రమే సంబంధించిన సమస్యకాదు. నీ విషయమే తీసుకో. నువు చదివిన చదువుకు మీమస్తాను పాలెంలో ఉద్యోగం దొరకదు గనక నేగద ఈపట్నంలో వచ్చిపడ్డావు? ఆడపిల్లకైనా అంతే. వాళ్ళు ఏ రకంగా పెరుగుతారో దానికి తగట్టు పెళ్ళాడాలి. కాపరం చెయ్యాలి. ఉద్యోగాలకన్న పెళ్ళిళ్ళు చాలాకష్టం."

ప్రకాశం పెద్దపెట్టుననవ్వి, "ప్రపంచం చాలా విశాలమైనదిరా!" అన్నాడు.

ఏ సంస్కారి కూడా తాను ఒంటరిగాణ్ణని అనుకోలేడు. తనలాటి వాళ్ల వేల సంఖ్యలోనూ, లక్షల సంఖ్యలోనూ ఉన్నారని ఊహించుకుంటాడు.

---

"పెళ్ళయిన కొత్తలో నాతో చక్కగా గంటలకొద్దీ కబుర్లు చెప్పేవారు. ఇప్పుడు మాట్లాట్టమే మానేశారు. నా మీద ప్రేమ వుంటేగా?"

"ప్రేమ లేదూ? లేకపోవట మేమిటి, బోలెడుంది. ఇహ నోరు మూసుకుని పడుకో."

అందరి కూతుళ్ళకూ జరిగినట్టుగా తన కూతురికి జరగదని ప్రకాశం రూఢిగా నమ్మాడు.

## 2

లీల బియ్యే ఫైనలియర్ పరీక్ష తన్నేసింది. కారణం ఇదీ అని స్పష్టంగా తెలియలేదు. ఊహించాలంటే చాలా కారణాలు కనపడ్డాయి .... అప్పటికి రెండేళ్ళుగా అడ్డమైనవాళ్ళూ, అమ్మాయికి సంబంధాలు చూస్తున్నారా, పెళ్ళెప్పుడు, ఇంకా ఎన్నాళ్ళుంచుతారు. ఇటువంటి ప్రశ్నలు శరపరంపరగా అడగ సాగారు. అప్పుడే ఏంతొందర లెమ్మంటే వాళ్ళు అవుననకపోగా, అంతులేని ఆశ్చర్యం ప్రకటించి. "ఇలాగే తాత్సారం చేసి అసలు పెళ్ళే కాకుండా పోయిన" నిదర్శనాలు చూపించారు. పైకి ఎంత గంభీర మొహం పెట్టినా లీలకు లోలోపల కొంత బితుకు ఏర్పడి వుండాలి. అది అంతకుమునుపు ఉంటున్న స్వాప్నిక జగత్తునుంచి బయటికి వచ్చి వాస్తవ జగత్తుయొక్క స్వరూపం గమనించనారంభించి ఉండవచ్చు..... దాని యీడు వాళ్ళూ, సహాధ్యాయినులూ ముగ్గురికప్పుడే పెళ్ళిళ్ళయి పోయాయి. వాళ్ళు పెళ్ళిచేసుకుని సుఖపడుతున్నట్టే కనపడ్డారు .... ప్రకాశం పదిమంది నెరిగినవాడు, పలుకుబడి కలవాడు. కాని అతని పరిచయస్తులలో ఒక్క-

రైనా, "నా కొడుక్కు నీ కూతురిని చేసుకోవాలని ఉంది," అన్న పాపాన పోలేదు. లీల అనాకారీ కాదు, రంభా కాదు. దానిలాటి పిల్లనే, దాని స్నేహితురాలిని, ఎవరో కోరి చేసుకున్నారు. కూతురి పెళ్ళి విషయం ఎవరు మాట్లాడినా ప్రకాశం మాట్లాడే మాటలు ప్రగల్భాలలాగా వినిపించేవి_వాడు, పాపం, ఉన్నమాట చెబుతున్నాననే అనుకునేవాడు. కాని పదిమంది ఆమోదించని సత్యాలు చెప్పేవాణ్ణి చూస్తే లోకానికి కొంచెం కసిగా ఉండే మాట నిజం. హరిశ్చంద్రుడు "నేను అబద్ధాలు కూడా ఆడుతాను మొర్రో" అన్నట్టుంటే ఆ కష్టాలేవీ వచ్చి ఉండకపోను. నిజం చెప్పటంలో కూడా ప్రగల్భం ఉంటుంది. నిభాయింపు లేనివాడు నిజం చెప్పరాదు. చెబితే అగ్నిపరీక్ష తప్పదు. పెళ్ళి సందర్భంలో కట్నాల ప్రసక్తి వస్తే, ప్రకాశం తాను కట్నాలివ్వలేనని ఏనాడూ అనలేదు, కట్నాల ఆచారాన్ని దుమ్మెత్తి పోశాడు. అందుకూడా నేను తప్పు పట్టను; కట్నం ఇవ్వనని శపథం పట్టినవాడు కట్నం తీసుకోకుండా వచ్చే అల్లుణ్ణి చేసుకోవటానికి సిద్ధంగా వుండాలి_అంతకన్న ముఖ్యం, తన కూతుర్ని సిద్ధపరచాలి. ప్రకాశం ఈ రెంటిలో ఏదీ చెయ్యలేదు. తన తండ్రి వైఖరి తన పెళ్ళికి సైంధవుడల్లే అడ్డ పడిందని లీలకు తోచి ఉండవచ్చు....దానికి చదువుమీద విరక్తి పుట్టి జీవితంపైన ఆశపుట్టి వుండవచ్చు....

ఏమైనా, లీల పరీక్ష తప్పటానికీ, దాని పెళ్ళి కనుచూపు మేరలో లేకపోవటానికీ సంబంధం వుంది.

"ఏమే, కోడలా? నీకు పెళ్ళి చేసుకోవాలని వుంటే నాతో చెప్పు. మీ నాన్నను ఎగదోస్తాను. చేతులు కట్టుక్కూచుంటే అయేవికావు పెళ్ళిళ్లు" అని లీలను కదిపి చూశాను.

"ఎప్పటికైనా పెళ్ళి జరగాలిసిందేగా? ముందీ పరీక్ష ప్యాసుకానీ!" అన్నది లీల.

"ఒరే నీ కూతురికి సంబంధాలు చూడడం మొదలు పెట్టొచ్చు" అని ప్రకాశంతో అన్నాను.

"ఎక్కడని చూడటం? ఎక్కడన్నా ఫలాని సంబంధం ఉందని నీ బోటివాడెవడన్నా అంటే అలాగే చూడొచ్చు."

"ఏవో సంబంధాలుండకపోతాయా? పెళ్ళికావలసిన ఆడపిల్లల్లాగే పెళ్ళికావలసిన మగపిల్లలూ ఉంటారు. ముందు తేల్చవలిసింది నీ ఉద్దేశం, మీ ఆవిడ ఉద్దేశం, లీల ఉద్దేశం. వీటిని బట్టి సంబంధాలు వెదకాలి. అందులోనూ నువు లక్ష నియమాలు గలవాడివైతివి" అన్నాను,

చిన్నమీటింగు జరిపాం_నేనూ, ప్రకాశమూ, వాడి భార్య, వాళ్ళపెద్దవాడూ, కొంచెం దూరంగా లీలా.

"నియమాల దేముందీ? పిల్లను తీసుకుపోయి చూస్తూచూస్తూ పశువుల

మధ్య పడెయ్యలేం గదా? కాస్త సంస్కారం ఉండి, మనభాష వాళ్ళకీ, వాళ్ళ భాషమనకీ అర్థం కావటం ప్రధానం. మిగిలిన విషయాలు మామూలే," అన్నాడు ప్రకాశం.

"పిల్లవాడి రూపురేఖలతో పని లేదా?"

"అదేమిటన్నయ్యా? పిల్లవాడు కాస్త బాగుండొద్దూ? లేకపోతే నలుగురూ నవ్వరూ?" అన్నది ప్రకాశం భార్య.

"చదువు?"

"చదువుకన్న సంస్కారం ముఖ్యమనుకో. అయినా అది బియ్యే చదివినప్పుడు కనీసం బియ్యే అయినా చదవనివాడు దాన్ని ఎట్లాగూ పెళ్ళి చేసుకోడు," అన్నాడు ప్రకాశం.

"ఆస్తి?"

"ఉంటే మంచిది. లేకపోయినా పెళ్ళాన్ని పోషించేపాటి సంపాదన ఉన్నా చాలు," అన్నాడు ప్రకాశం.

"కట్నం మాట?"

"రామాయణమంతా విని....! ఇది మరీ బాగుంది. కట్నం అడిగేవాణ్ణి నువ్వు మనిషి కింద చూడగలవురా?" అన్నాడు ప్రకాశం. అప్పుడే ఆవేశం వచ్చింది.

"తొందర పడకు: ఇప్పుడు కొందరేం చేస్తున్నారో తెలుసా? మీరేమిస్తారో చెప్పండి అంటారు. ఏమీ ఇవ్వమంటే, మావాడిప్పుడప్పుడే పెళ్ళి వద్దంటున్నాడని ఉత్తరంముక్క రాస్తారు. ఏవో లాంఛనాలిస్తామంటామనుకో, ఆ తరువాత నువ్వు ఇవ్వని వన్నీ కోరి, "లాంఛనాలకింద ఇవన్నీ వస్తాయని మీకు తెలీదా? అడిగించుకోవాలా? కొత్తగా సీమనించి దిగొచ్చారా?' అని నిష్ఠూరా లాడతారు. అంచేత మనం అన్నిరకాల వాళ్ళనూ ఎదుర్కోటానికి సిద్ధంగా వుండాలి."

"అటువంటి వాళ్ళతో అంతసేపు మనం మాట్లాడనేరాదు. వ్యవహారం సూటిగానూ, సాఫీగానూ నడవాలి సిందేగాని, డొంక తిరుగుళ్ళలో పడటం నాకు పరమ అసహ్యం" అన్నాడు ప్రకాశం.

"పరిస్థితులు బలవంత పెడుతుంటే మన కిష్టంలేని పనులెన్నో చెయ్యాలి సొస్తుంది. నీకు మాత్రం ఆ సంగతి తెలీదా?" అన్నాను.

ప్రకాశం భార్య చాలాసేపు విని, విని, "అన్నయ్యా, మీ రాయన మాటలు లక్ష్యపెట్టకండి, ఆయన ఈ లోకం గురించి మాట్లాట్టంలేదు. కట్నం ఇచ్చుకోకుండా సంబంధాలు దొరకడంవల్ల అత్తగారికీ, ఆడబిడ్డలకూ లాంఛనాలు జరపాలిసిందే. అల్లుడు రిష్టువాచీతెమ్మన్నా, స్కూటరు తెమ్మన్నా, సూట్లు కుట్టించమన్నా సరేననాలిసిందే—" అని ప్రారంభించింది.

ప్రకాశం ఆముదం తాగినవాడి ముఖంపెట్టి," ఛీ! వీడిదుంపతెగా!" అన్నాడు—స్కూటర్లూ, సూట్లు అడిగే అల్లుణ్ణే అయి ఉంటుంది.

"ఇకనైనా ఈ చర్చ ముగిస్తారా?" అన్నది లీల చూసి చూసి.

కాని చర్చలకు ఎమర్జన్సీ బ్రేకు లుండవు. భరించలేక లీల లేచి పోయింది. దాని అన్న గడియారంకేసి చూసి తానూ వెళ్ళిపోయాడు. ప్రకాశానికూడా ఎక్కడికైనా పారిపోదామని ఉన్నట్టే కనిపించాడు, వాడు చిట్ట చివరకు సారాంశం చెప్పేశాడు. "నాకు ప్రపంచజ్ఞానం లేదని ఒప్పు కుంటా. కాని మీరందరూ ఇన్నాళ్ళుగా నాకు జ్ఞానోదయం కలిగించినా, మీరు చెప్పే ప్రపంచమంటే నాకు రోతజాస్తి అవుతున్నది గాని తగ్గటం లేదు. ఈ కోల్డ్‌వార్ పెళ్ళిళ్ళు నేను మీదవేసుకో లేను. అటువంటి పెళ్ళే లీలకు చెయ్యా లనుంటే మీరెవరైనా సారధ్యం చెయ్యండి. అంతేగాని నా చేతగాని పని చేయించవద్దు. ఈ కట్నాలేమిటి, బేరా లేమిటి, అలక లేమిటి, నిష్ఠూరా లాడటమూ, పడటమూ—ఏమి టిదంతా? నా కర్మేం కాలిందని నేను వీటన్నిటికీ ఒడి గట్టాలి?....ఆడపిల్లను కన్నాక తప్పు తుందా అంటుంది ఈ మట్టి బుర్ర. ఆడపిల్లను కనటం ఒక మహాపరాధమనీ, ఆ పని చేసినవాడికి శిక్ష పడాలనీ అనే వాళ్ళను జైల్లో పెట్టటాని కొక లా వుండాలంటాను. ఎవరూ ఆడ పిల్లలను కనకపోతే మగవాళ్ళంతా ఏ గంగలో దూకుతారు? ఆడది అక్కర్లేని మగ వెధవ ఎవడు? అన్నం తినటం రైటూ, వండటం తప్పూనా? తలకు మాసిన వెధవలు! తలకు మాసిన జాతి! జాతంతా పుచ్చి పురుగులు పడిపోతున్నా కళ్ళు తెర వరు....నేను ఏనాడో లీల జీవితానికి రాజబాట నిర్మించాను. అలాగే జరుగు తుంది. అది ముందు ఉద్యోగం—ఏదో చిన్న వుద్యోగం—సంపాదించు కుంటుంది. అది సంపాదించే జీతం రాళ్ళకు ఆశించి అయినా ఎవరో ఒకరు పెళ్లాడతామని రాకపోరు. ఇద్దరేవచ్చినా అందులో కాస్త మెరుగైనవాణ్ణి చేసు కుంటుంది."

ప్రకాశం అందరినోళ్ళూ ఒక్కన మూసేశాననుకుని ఉంటాడు. కాని అదేమీ జరగలేదు.

"దాని జీవితం రాళ్ళకు ఆశపడి వచ్చేవాడు మంచివాడూ, కట్నానికి కాశపడే వాడు చెడ్డవాడూనా? ఇద్దరిలో

---

★ "ఈసారి మాకు అబ్బాయి పుడతాడని మా ఆవిడ, అమ్మాయి పుడు తుందని నేను పందెం వేసుకున్నాం."

"ఎవరు గెలిచారు?"

"ఇద్దరమూ."

## పోటీదార్లకు మనవి

"జ్యోతి" మాసపత్రిక కళాశాలల, విశ్వవిద్యాలయాల విద్యార్థినీ విద్యార్థుల నిమిత్తం "చిన్న చిన్న కథల పోటీ" నిర్వహిస్తున్నది. దీనిలో పాల్గొనేవారు ఈ క్రింది నిబంధనలు పాటించ గోరుతున్నాము.

1. కథలు "జ్యోతి"లో రెండు మూడు పేజీలకు మించరాదు.

2. స్వకపోల కల్పితమైనస్వతంత్ర రచనలే పంపించాలి.

3. తమ పూర్తిపేరు, చదువుతున్న తరగతి, కాలేజీ, లేక విశ్వవిద్యాలయం పేరుతో సహా పూర్తి చిరునామా జత పరచాలి.

4. ప్రతినెల 1వతేదీ వరకు అందిన రచనలనే ఆ పైనెల సంచికలో పోటీకి పరిగణిస్తాము.

5. బహుమతి పొందని రచనలు త్రిప్పి పంపబడవు. అందుచేత స్టాంపులు పంపించ నవసరం లేదు. రచనల విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

6. కవరు మీద "జ్యోతి, చిన్న చిన్న కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి.

7. రచనలను పంపవలసిన చిరునామా ఎడిటర్, "జ్యోతి" సచిత్ర మాసపత్రిక, విజయవాడ-2."

8. రూ. 50లు ప్రథమ బహుమతి. రూ. 25 లు చొప్పున రెండు ద్వితీయ బహుమతులు.

మెరుగైన వాణ్ణి అది ఏరుకోవటం మంచీ, పదిమందిలో మంచివాడుగా చూసి మనం ఏరి చెయ్యటం చెడూనా? ఏం చెబుతారండీ?" అన్నది వాడి భార్య.

తనవంటి మేధావిని తనభార్యవంటి వంటింటి బానిస అంత సులువుగా ఓడిస్తుందని ప్రకాశం అనుకుని ఉండడు. నేనేవాణ్ణి సమర్థించాను.

"అవునమ్మా, అదేమంచిది. నువు గ్రహించలేవు. కట్నంకోసం ఆశపడ్డ వాడు మనిషికివిలువఇవ్వడు లీలసంపాదనను గౌరవించేవాడు లీలనూ గౌరవిస్తాడు. అంతేకాదు;ఇంకోరు కుదిర్చిన సంబంధంకన్న, తాను' నిర్ణయించుకున్న సంబంధం మగవాడికి ఎప్పుడైనా ఎక్కువే. అసలు చిక్కు అది కాదు. ప్రకాశం చెప్పినట్టుగా పెళ్ళి జరగటానికి కూడా సవాలక్ష ప్రతిబంధకాలుంటాయి. అంతా దైవాధీనం. లీల వుద్యోగంలో చేరిన రోజే దాని కాబోయేవాడు నిర్ణయం కావచ్చు. లేదా ఏళ్ళ తరబడి వాడి జాడే లేకపోవచ్చు" అన్నాను.

ఆ తరవాత మేం అంత దీర్ఘంగా లీల పెళ్ళి గురించి చర్చించలేదు.

లీల మళ్ళీ పరీక్షకు కూర్చుంది— మళ్ళీ తప్పింది.

(ఇంకావుంది)

# రాకెట్లలో వాడే ఇంధనం ఏమిటి?

"రాకెట్లలో వాడే ఇంధనం ఏమిటి?"

"హుష్! గట్టిగా మాట్లాడకు! రహస్యం! నోటితో చెప్పకూడదు. ఇక్కడ వ్రాస్తాను. లోలోపలే చదువుకో!"

రాకెట్లలో రెండురకాల ఇంధనాలు వాడుతూ ఉంటారు. మొదటిది ఘన పదార్థం. రెండవది ద్రవం.

మొన్నమొన్నటి వరకూ రాకెట్లలో అందరూ పొడిపొడిగా ఉండే మందునే వాడేవారు. ఏభై ఏళ్ళ క్రిందటివరకూ అసలు ద్రవం వాడవచ్చుననే ఎవరికీ తోచలేదు. ద్రవపదార్థం ఇంధనంగా వాడితే బోలెడు వుపయోగాలున్నాయని కనిపెట్టిన వాడు "గోడర్డ్" అని అమెరికనులూ, కాదు "త్సియల్కోవ్స్కి" అని రష్యనులూ అంటారు. ఎవరు ముందు అనే వాదన జోలికిపోక, ఈ రెండురకాల ఇంధనాలను గురించి దిఙ్మాత్రంగా తెలుసుకుందాం.

## ఘన పదార్థపు ఇంధనం :

గంధకం, బొగ్గు, సూరేకారం కలిపి టపాకాయలకు, తారాజువ్వలకూ వాడే మందునే ఈ రాకెట్లలోనూ వాడేవారు. దీనిని మొట్టమొదట చైనీయులు కనిపెట్టేరు. 1232 లో కై-ఫుంగ్-ఫూ పట్టణాన్ని మంగోలులు ముట్టడించినప్పుడు ఈ రాకెట్లు వుపయోగించి ముట్టడి చెదరగొట్టినట్లు చారిత్రకాధారాలున్నాయి. ఈ మందును వాళ్లు పరమ రహస్యంగా దాచేవారు. అక్కడినుంచి ఎల్లాగో అరేబియా చేరింది. అక్కడినుంచి యూరప్ అంతా అల్లుకుపోయింది. బ్రిటిష్ వాళ్ళు యుద్ధాలలో వాడిన రాకెట్టు బొమ్మ ఒకటి ఇక్కడ చూపించాను.



సూరేకారం 36 పాళ్ళు, గంధకం 10 పాళ్ళు, బొగ్గు 15 పాళ్లు కలిపి తయారు చేసిన మందును ఇనుప తొడుగున్న రాకెట్టు గొట్టంలో దట్టించేవారు. రాకెట్టు చివర బాంబువంటి మారణాయుధాన్ని జత చేసేవారు. సరియైన దిశ నిర్ణయించడానికి పొడుగుపాటి ఇనుప గొట్టంలో పెట్టి వెలిగించేవారు. పాళ్ళల్లో స్వల్ప భేదాలు తప్పించి ఈ రాకెట్లు ఈ ఆరేడు శతాబ్దాలలోనూ ఎక్కువగా మారినట్లు లేదు.

ఈ రాకెట్లతో ఒక్కటే ఇబ్బంది. ఒకసారి వత్తి వెలిగించి వదిలేస్తే ఇహ దాన్ని ఆపడం ఎవరి తరమూ కాదు. ప్రయోగించిన వాడి చెప్పుచేతలలో ఉండకుండా, లోపల ఉన్న మందు పూర్తిగా కాలిపోయేదాకా

ప్రయాణం చేసేస్తుంది. రాకెట్ లోపలి ఆకారాన్ని బట్టి, మందుదట్టించిన పద్ధతినిబట్టి మందు తగులబడే వేగం నిర్ణయింప బడుతుంది. కాస్త దారి తప్పితే దానినిసవరించేమార్గంలేదు. వీటినినమ్ముకుని అంతరిక్ష యానం చేయబూనడం దుస్సాహసమే. ఇక పోతే వీటిని తయారుచేయడం సులభమూ, చవకానూ. కనుక చిన్నచిన్న దూరాలకు వీటిని ఉపయోగించవచ్చు.

## ద్రవపదార్థపు ఇంధనం



ఇవి నిర్మాణంలో ఘన పదార్థపు రాకెట్లకన్న బహు క్లిష్టమైనవి. వీటి అంతర్నిర్మాణం ఎల్లా ఉంటుందో ఇక్కడి బొమ్మలో చూపబడింది. ఇందులో ఇంధనం నిలువచేసేది ఒక గదిలోనూ, అది మండేది మరో గదిలోనూ (ఘన పదార్థపు రాకెట్లలో ఈ విభాగం లేదు.)

ఇంధనం మండడానికి ఆక్సిజన్ అవసరం. ఈ రాకెట్లలో ఆక్సిజన్ మరో గదిలో నిలువ చేస్తారు. (ఘన పదార్థపు రాకెట్లలో మండడానికి కావలసిన ఆక్సిజన్ ఆ మందులోనే గూఢంగా రాసాయనికంగా ఇమిడి ఉంది. కనుక వేరే ఆక్సిజన్ మోసుకు వెళ్ళవలసిన పని లేదు.) ఇంధనము, ఆక్సిజను వేరు వేరు గదులలోనుంచి గొట్టాలద్వారా ఒక చోటికి వస్తాయి. "పంపు" వీటిని బలంగా కిందనున్న "మోటారు" లోకితోస్తుంది. అక్కడ ఈ రెండూ కలిసిన మిశ్రమం అంటుకుని, వేలకొద్ది డిగ్రీలవేడి, బ్రహ్మాండమైన వత్తిడి ఏర్పడి, తగులబడగా మిగిలిన వాయువులు బహు శక్తివంతంగా "నాజిలు"లో నుంచి బయటికి వస్తాయి.

ఈ రాకెట్టు పూర్తిగా ప్రయోగించే వాడి అదుపు ఆజ్ఞలలోనే వుంటుంది. కావలసిన వేగం వచ్చిందనుకుంటే, ఇంక ఇంధనం మోటారులోకి వెళ్ళకుండా ఆపివెయ్యవచ్చు వేగం ఒక్కసారిగా కాకుండా క్రమక్రమంగా హెచ్చాలంటే ఇంధనం పంపు చేసే వేగాన్ని తగ్గించవచ్చు. రాకెట్టు ప్రయాణం చేసే దిశమారాలంటే మోటారును దానికి వ్యతిరేక దిశలోకి వంచితే సరిపోతుంది. ఈ మార్పులకు కావలసిన ఆజ్ఞలను భూమి మీదనుంచి రేడియో ద్వారా పంపవచ్చు. రాకెట్టు ముక్కు దగ్గర వున్న కొద్దిపాటి చోటు లోనూ పరిశోధనలకు కావలసిన యంత్ర పరికరాలు, ప్రయోగార్థం ఎలుకలు, కుక్కలు, మనుష్యుల వంటి జంతువులను పెట్టి పైకిపంపవచ్చు. పైకివెళ్ళిన

రాకెట్టునుండి ఈ పరికరాలు రేడియో ద్వారా భూమిమీది శాస్త్రజ్ఞులకు అక్కడి భోగట్టా సరఫరా చేస్తాయి.

ఈ రాకెట్లలో వాడదగ్గ ఇంధనాలు చాలాఉన్నాయి. ఆల్కహాలు, పెట్రోలు కలిసిన మిశ్రమం తరుచు వాడుతూ ఉంటారు. ఈ మిశ్రమం మండడానికి కావలసిన ఆక్సిజను మామూలు వాతావరణపు ఉష్ణోగ్రతలో వాయురూపంలో ఉంటుంది. వాయురూపంలో తీసుకెళ్ళా అంటే చాలాచోటు ఆక్రమిస్తుంది. కనుక దీనిని — 183 డిగ్రీలు సెంటిగ్రేడు కి చల్లబరచి, ద్రవంలాచేసి, వేడిచొరని పెద్దఫ్లాస్కులోపోసి, రాకెట్టులో తీసుకు వెడతారు. ఇంతకన్న ఒక్క డిగ్రీ పెరిగితే ఆక్సిజన్ మరిగి, వాయు రూపం చెంది, రాకెట్టునే పేల్చివేయ వచ్చు. కనుక రాకెట్టు లోపల ఇంతటి చల్లదనాన్ని సృష్టించి, నిలువ ఉంచ డానికి తగ్గ హంగులు అన్నీ చెయ్యాలి. ఆపని కష్టం అనిపిస్తే నైట్రిక్ ఆమ్ల మునుగాని. హైడ్రొజన్ పెరాక్సైడును గాని ఆక్సిజన్ స్థానంలో వాడుతారు. వీటిలో రసాయనికంగా ఇమిడిఉన్న ఆక్సిజను పై ఇంధనాన్ని మండించ డానికి పనికి వస్తుంది.

ఇక్కడ రాకెట్లలో వాడదగ్గ ఇంధనాల పట్టిక ఇస్తున్నాను. ఈ ఇంధనాలు మండిపోగా మిగిలిన వాయువులు రాకెట్టు నాజిలులో నుంచి ఎంత వేగంగా బయటికి వస్తాయో—గంటకు ఇన్ని మైళ్ళు అని వాటికి పక్కన వ్రాశాను. ఇది రాకెట్టులోనుంచి వాయువులు నిర్గమించే వేగం కనుక దీనిని "నిర్గమన వేగం" అందాం. ఈ నిర్గమన వేగం ఎంత ఎక్కువ అయితే రాకెట్టు అంత ఎక్కువ వేగంగా ప్రయాణం చేస్తుంది. కనుక ఇంధనపు నాణ్యానికి ఇది ఒక విధంగా కొలబద్ద లాంటిది.

1. హైడ్రొజన్ పెరాక్సైడ్ [గంటకు 2700 మైళ్ళు]

2. హైడ్రొజన్ పెరాక్సైడ్ + మిథనాల్ + హైడ్రజీన్ + నీరు [4700]

3. నైట్రోమిథేన్ [4900]

4. నైట్రిక్ ఆమ్లము + ఎనిలీన్ [4900]

5. హైడ్రొజన్ పెరాక్సైడు + పెట్రోలు [5100]

6. నైట్రిక్ ఆమ్లము + పెట్రోలు [5400]

7. ఆక్సిజన్ + ఎథనాల్ [5600]

8. ఆక్సిజన్ + పెట్రోలు [5600]

9. ఆక్సిజన్ + ఎమోనియా [5800]

10. ఆక్సిజన్ + మిథేన్ [5800]

11. ఆక్సిజన్ + హైడ్రజీన్ [6300]

12. ఫ్లోరిన్ + హైడ్రజీన్ [7200]

13. ఆక్సిజన్ + డైబొరేన్ [7200]

14. ఆక్సిజన్ + హైడ్రోజన్ [8100]

15. ఫ్లోరిన్ + హైడ్రోజన్ [8500]


ట్విన్ టస్కర్ వస్త్రాలు...
ట్విన్ టస్కర్ వస్త్రాలు...
ట్విన్ టస్కర్ వస్త్రాలు...
ట్విన్ టస్కర్ వస్త్రాలు...

ఈ ఇంధనాలు మండినప్పుడు మూడు నాలుగువేల డిగ్రీలవేడి పుడుతుంది. ఉష్ణోగ్రత ఎంత అధికమైతే నిర్గమన వేగం అంత అధికంగా ఉంటుంది కాని, ఉష్ణోగ్రత మరీ అధికమైతే మోటారే దగ్ధమైపోవచ్చు.కనుక, ఉష్ణోగ్రత మరీపెచ్చు పెరిగిపోకుండా చూచుకోవాలి. అందుకే కొన్ని ఇంధనాలలో నీరు కలిపిదాని శక్తిని కావాలనే తగ్గిస్తారు. మోటారు, నాజిలు వగైరాల నిర్మాణానికి మామూలు లోహాలు ఉపయోగిస్తేలాభంలేదు. ఉదాహరణకు రాగి 359 డిగ్రీలు(సెం. గ్రే.) దాటి వేడిచేస్తే జావకారిపోతుంది. ఇల్లాగే మిగిలిన లోహాలకు కూడా ఇంతకు మించి ఉష్ణోగ్రత పెంచకూడదని పరిమితి వుంది.

నికెల్ క్రోమ్ వుక్కు 900 డిగ్రీలు (సెం, గ్రే.)

అల్యూమినియం ఆక్సైడు 2000 డిగ్రీలు.

సినికాక్ కార్బైడు 2200 డిగ్రీలు

జిర్కోనియం అక్సైడు 2700

మెగ్నీషియం ఆక్సైడు 2800 డిగ్రీలు.

ఇంతకన్న హెచ్చు ఉష్ణోగ్రతలకు తట్టుకోగల వస్తువుల కోసం పరిశోధన చెయ్యాలి.

ఉష్ణోగ్రతమరీపెచ్చుపెరిగిమోటారు కాలిపోకుండా వుంచడానికి దానిని అనుక్షణమూ చల్లబరుస్తూ వుండాలి. ఈ




పనికి ఇంధనంగా వాడే ద్రవాలనే ఉపయోగించవచ్చు.

ఇక్కడిబొమ్మలో ఈ పద్ధతి వివరంగా చూపబడింది. చల్లని ఇంధనం మోటారులో ప్రవేశించే ముందు, మోటారు చుట్టూతిరిగి, దానిని చల్లబరుస్తుంది.

ఇందులో మరో ధర్మసూక్ష్మం వుంది. నాజిలు నుంచి బయటికివచ్చే వాయువుల అణువులు ఎంత తేలికవి అయితే రాకెట్టు వేగం అంత హెచ్చుతుంది. ఉదాహరణకు మసిబొగ్గును కాలుస్తే కార్బన్ డై ఆక్సైడ్ అనే వాయువు వస్తుంది. దీని అణువుల బరువు 44 ప్రమాణాలు (హైడ్రోజన్ పరమాణువు బరువు ఒక ప్రమాణం కింద తీసుకుంటారు.) ఆక్సిజను, హైడ్రోజను తగులబడితే నీటిఆవిరి వస్తుంది. దీని అణువులబరువు 18 ప్రమాణాలు [illegible]లిన ఇంధ

నాలకున్నా నిర్గమన వాయువుల అణువుల బరువు ఆ ఇంధనపు రసాయన ధర్మాలమీద ఆధారపడి వుంటుంది. ఈ బరువును తగ్గించేశక్తి మనకులేదు. వెతికి వెతికి తేలిక అణువులను విడిచిపెట్టేఇంధనాలను ఎన్నుకోవడం తప్ప. ఏ ఇంధనం తీసుకున్నా ఈ బరువు 18 ప్రమాణాలకన్న తక్కువ అయే సూచనలు లేవు. హైడ్రోజన్ వంటి బహు తేలిక అయిన వాయువును కనక రాకెట్టు నాజిలులోనుంచి బయటికి తోయగలిగితే రాకెట్టు వేగం ఇప్పటికన్న నాలుగు రెట్లు పెరుగుతుంది; కాని, హైడ్రోజన్ వాయువును విడిచిపెట్టే ఇంధనాలు ఏమున్నాయి? ఏమీ లేనట్లే.

## అణుశక్తితో నడిచే రాకెట్లు

ఇంధనాలలో నిక్షిప్తమై ఉన్న రసాయన శక్తి "మండడం"వల్ల ఉష్ణశక్తిగా మారుతోంది. మండగా మిగిలిన వాయువులు ఈ ఉష్ణశక్తివల్ల వేగంగా బయటికి తోయబడుతున్నాయి. అణుశక్తిని ఉష్ణశక్తిగా మార్చగల అణు రియాక్టరు" కనక రాకెట్టులో అమర్చ గలిగితే, మనకు నచ్చిన వాయువును నిలువచేసి వుంచి, ఆ ఉష్ణశక్తి సహాయంతో నాజిలులో నుంచి బయటికి పంపవచ్చును. అన్నింటికన్న తేలికైన హైడ్రోజన్ వాయువునే వినియోగించవచ్చు. పైగా అణుశక్తికి సమానమైన శక్తి ప్రపంచంలో మరొకటి ఏదీ లేదు. దీని ముందు మనకు తెలిసిన రసాయన శక్తులన్నీ సూర్యునిముందు దివిటీలు మాత్రమే! (రసాయనశక్తికన్న అణుశక్తి కొన్నికోట్ల రెట్లు అధికం.) కనుక స్వల్పపరిణామంలో యురేనియం_235 అనే ధాతువును మూటగట్టి తీసుకువెడితే. అనేక సంవత్సరాలపాటు ఆరియాక్టరు నిర్విరామంగా పనిచేయగలుగుతుంది. గ్రహాంతర నక్షత్రాంతర యానాలు చెయ్యాలంటే ఇదొక్కటే మార్గమేమో!

అణుశక్తిని ఉపయోగించడం అనుకున్నంత తేలికేమీకాదు. రియాక్టరు నుంచి వెలువడే మృత్యుకిరణాల తాకిడి నుంచి రాకెట్టులోని మనుష్యులను పరికరాలను కాపాడడానికి మందమైన గోడలు గట్టాలి. వీటితో రాకెట్టు బరువు అనవసరంగా పెరిగిపోతుంది. పైగా నాజిలులోనుంచి బయటికి పంపడానికి హైడ్రోజన్ ఎల్లాగూ తీసుకువెళ్ళాలి. ఇంతాచేస్తే దానివల్ల కలిగేలాభం ఎంతో వుండకపోవచ్చు. _ ఇంతవరకూ అణుశక్తితో నడిచిన రాకెట్లులేవు. అంతా ఊహామాత్రమే.

డాక్టర్ మహీధర నళినీమోహన్

(గత సంచిక తరువాయి)




యద్దనపూడి సులోచనారాణి

"సంజోయ్! సంజా! వాసు మామయ్య దగ్గరనుంచి వుత్తరం వచ్చింది." బాబు గుమ్మంలో నిలబడి గదిలోకి తొంగిచూస్తూ బిగ్గరగా అన్నాడు.

"యెక్కడా! యేది?-యిలా తీసుకురా-" మంచంమీద పడుకుని పాత పుస్తకం యేదో తిరగేస్తున్న సంధ్య పుస్తకం చప్పున ప్రక్కకి విసిరేసిలేచి కూర్చుంది,

"ఇదుగో!"

"ఇక్కడ, తీసుకురా!" అసహనంతో పిలిచింది,

"ఉహు." బాబు అడ్డంగా తలతిప్పి వుత్తరం వెనక్కి దాచుకున్నాడు.

సంధ్య లేచివచ్చింది.బాబుదూరంగా పరుగెత్తాడు.

"మాబాబువి కదూ! మంచి వాడమ్మా!-" బ్రతిమలాడింది,

"ఊహు. నన్నంటుకుంటే ఇస్తా!" సంధ్యని కవ్వించటం, దేనికో దాని కోసం పరుగెత్తించటం వాడికి సరదా. అదో పెద్ద ఆట.

సంధ్య చేసేదిలేక బాబు వైపు వచ్చింది. బాబు కొద్దిసేపు అందకుండా అటూ యిటూ పరుగెత్తాడు. చివరి కెలాగో వాడిని అందుకుని పొదివి పట్టుకుని ఉత్తరం లాక్కుంది. కవరు చించేవుంది. అంటే మాధవ్ చదివి పంపించా డన్నమాట. మొదట తన కివ్వకుండా అతను చదివినందుకు కోపం వచ్చింది. కవరులోంచి ఆత్రంగా ఉత్తరం తీసి చూస్తూనే ఆగిపోయింది. దస్తూరి వాసుది కాదు. ఇంకెవరిదో! గుండ్రంగా పెద్దగా వుంది. సంధ్య దృష్టి సంబోధన చూసి ఆగిపోయింది. అది సుధ మాధవ్‌కి వ్రాసింది. తను చదవ కూడదు అని మనసు హెచ్చరించే లోపలే కళ్ళు రెండూ అక్షరాల బారుల వెంట పరుగెత్తాయి.

మొదలు పెట్టిన వుత్తరం పూర్తిగా చదవకుండా వుండలేక పోయింది, ఆసాంతం ముగించేసరికి ముఖంలో కత్తి వాటుకు నెత్తురుచుక్క లేనంత తెల్లగా పాలిపోయింది. ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క శూలం. ఒక్కొక్క రకమైన అవమానం. ఏం చెయ్యాలి తను! తెలిసి తెలిసి యింత హీనమైన పరిస్థితుల్లో యీ యింట్లో యెందు కుండాలి!

"నువ్వీయింట్లో వంటరిగా వున్నావని తెలిస్తే మా ఆవిడ ఒక్క క్షణం కూడా నిద్రపోదు. పచ్చి మంచి నీళ్ళు కూడా ముట్టదు. అనవసరంగా ఆ బావా మరదళ్ల మధ్య నువ్వెందుకు అడ్డు." భాస్కరం హెచ్చరిక గుర్తుకు వచ్చింది. మొన్న యిక్కడ మాధవ్ చేత అవమానం పొందిన భాస్కరం లేని రంగులు పూసి వికృతమైన అర్థం కల్పించి భార్యకి చెప్పివుంటాడు. ఒక వేళ అన్నట్టుగానే సుధవస్తే! రానీ! ఏ మంటుందో తను స్వయంగా చూస్తుంది. సంధ్య మనసు చేదుపదార్థం తిన్నదానిలా వెగటుతో విలవిల లాడసాగింది. బాబు యెప్పుడో అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. చాలాసేపయింతర్వాత లాంతరు వెలిగించితెచ్చిహాల్లో మధ్యగావున్న యినప తీగకి వ్రేళ్ళాడ దీయబోతున్న ఆయా, చేతిలో వుత్తరంతో, రెప్ప వేయకుండా శూన్యంలోకి చూస్తున్న సంధ్యనిచూసి తెల్లబోతూ,

"సంధ్యా!" అని పిలిచింది. సంధ్య కళ్ళు యాంత్రికంగా ఆయావైపు తిరిగాయి.

"అదేమిటి? అలా ఉన్నావేం?" యెక్కడి నుంచి ఆ ఉత్తరం?—" ఆదుర్దాగా దగ్గిరగా వస్తూ అడిగింది.

"ఇదా?— ఇది — మనకి కాదు." ఆయా మాటల్తో యీ లోకంలోకి వచ్చిన సంధ్య లేచి నిలబడుతూ అంది.

• "అందులో యేమైనా విశేషం వుందా?—" అనుమానంగా చూసింది ఆయా.

"ఉహూం. బాబు యేడి? ఏం చేస్తున్నాడు?"

"ఇప్పుడే అన్నం తిని లేచాడు." ఆయా లోపలికి వెళ్ళింది.

సంధ్య వంట యింటివైపు వచ్చింది. బాబు అన్నం తినడం పూర్తిచేసి అక్కడే ఆయా వేసిన అన్నం తింటున్న నల్లపిల్లి తోక పట్టుకుని లాగుతున్నాడు. అది మ్యావ్ మ్యావ్ అని అరుస్తోంది.

"బాబూ! ఈ వుత్తరం యెక్కడ నుంచి తెచ్చావో అక్కడ పెట్టిరా?—" అంది.

"నేను పెట్టను. నువ్వే పెట్టు." మొండిగా అన్నాడు.

"మంచివాడివి కదూ?—" సంధ్య కంఠం ఆ పలికే తీరు విని బాబు తలెత్తి చూశాడు. తర్వాత యేమనుకున్నాడో యేమో పిల్లితోక వదిలేసి చేయి జాపి వుత్తరం తీసుకున్నాడు. ఏ సమయంలో సంధ్యని ఆడించాలో, ఏ సమయంలో చెప్పినట్టు వినాలో వాడికి బాగా తెలుసు.

"తీసినచోటే పెట్టాలి. మర్చిపోకూడదు." సంధ్య వెనకనుంచి హెచ్చరించింది. వాడు అలాగేనని తలూపి తండ్రి గదివైపు పరుగెత్తాడు.

* * *

ఒంటినిండా దుమ్ముతో, చెదిరిపోయిన జుట్టుతో, బట్టలమీద అక్కడక్కడా రక్తపు మరకలతో, నుదుటి మీద గాయంతో మాధవ్ నీరసంగా, విసుగ్గా యింటికి తిరిగివచ్చాడు.



హాల్లోనే ఎదురై ఆదుర్దాగా ప్రశ్నిస్తున్న ఆయాకి తగాదా ఆగిపోయిందని, తనకి తగిలిన దెబ్బ పెద్దదేమీ కాదని ధైర్యంచెప్పి 'కొద్దిగా వేడి నీళ్ళు, శుభ్రంగా ఉతికివున్న టవలు తెచ్చి పెట్ట'మని తన గదిలోకి వెళ్ళాడు.

అతను గదిలో అడుగు పెట్టేసరికి బాబు గది మధ్యగా నిలబడి నోట్లో

వేలుంచుకుని ప్రశ్నార్థకంగా చూస్తూ గదంతా దేనికోసమో కలియజూస్తు న్నాడు.

"ఏమిటి బాబూ? యేంకావాలి నీకు?_" కొడుకువైపు సరిగ్గా చూడకుండానే మంచంవైపువెడ్తూ అన్నాడు.

తండ్రిమాట వినగానే గిరుక్కున వెనక్కు తిరిగిన బాబు "మరే - మరే- ఈ వుత్తరం తీసినచోట పెట్టమని నంజ చెప్పింది. మరేమో! నాకేమో యెక్కడినుంచి తీసానోనాకుతెలియటం లేదు."

మంచంవైపు వెళ్ళి దాని మీద కూర్చోబోతున్న మాధవ్ చివ్వున వెనక్కి తిరిగిచూసి "ఏమిటా వుత్తరం?" అన్నాడు.

"ఇదే! వాసు మామయ్య రాసింది" అమాయకంగా తండ్రి దగ్గరగా వచ్చి వుత్తరం చూపిస్తూ అన్నాడు.

"ఇదెక్కడిది? ఎవరు యిచ్చారు నీకు?_" కోపంగా అడిగాడు.

ఎన్నడూ లేంది తండ్రి కళ్ళెర్ర చేయటం చూసి బిత్తరపోయిన బాబు "నేనే యిచ్చాను. మరే వాసు మామయ్య రాసాడుగా_అందుకని_"

"సంధ్య కిచ్చావా యిది?_"

బాబు అవును అన్నట్టు తలూపాడు.

మాధవ్ నీళ్ళు కారిపోతూ మంచం మీదకూలపడ్డాడు. సంధ్య యీ వుత్తరం చదివిందా! అతనికి విపరీతమైన నీర సంతోపాటు వుత్తరం అక్కడలా వదిలేసి వెళ్ళిన నిర్లక్ష్యానికి తనమీద తనకే అంతులేని ఆగ్రహం కూడ కలిగింది.

"మరే_మరే_"బాబు యేదో చెప్ప బోయాడు.

"నన్ను విసిగించకు _ అవతలకి వెళ్ళు_" మాధవ్ మళ్ళీ కసరటంతో బాబు వాడిపోయిన ముఖంతో తల ప్రక్కకు వాల్చుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

పది పదిహేను నిముషాల తర్వాత ఆయా వేడినీళ్ళు _ టవలు తెచ్చి యిచ్చింది.

"ఎందుకట తగాదా? యేమైంది?" అంది వివరాలు అడుగుతూ.

"ఏం లేదు. ఏదో పిల్లల ఆట మధ్య మొదలై ఆడవాళ్ళు ఒకళ్ళని ఒకళ్ళు తిట్టుకుని కుటుంబాల గురించి యెత్తిపొడుపుగా మాట్లాడుకోవడం వరకూ వెళ్ళింది. ఇంతలో మగవాళ్ళకి రోషం వచ్చేసి నువ్వెంతంటే నువ్వెంత అనుకున్నారు." ముక్తసరిగా జవాబు చెప్పాడు మాధవ్. అతని మనసంతా సంధ్య చుట్టూ తిరుగుతోంది.

"సంధ్య యేది? ఏం చేస్తోంది?_" భోజనానికి కూర్చోబోయేముందు పట్టలేక అడిగేశాడు. అత నింటికి వచ్చి నప్పటినుంచి యెక్కడా అలికిడి కూడా విన్పించలేదు.

"తలనొప్పిగా వుందిట పడుకుంది." అంది ఆయా. సంధ్య తలనొప్పికి కారణం ఆయాకి తెలియక పోవచ్చు.

అతను గ్రహించకుండా యెలా వుంటాడు!

రాత్రి పొద్దుపోయింతర్వాత పడుకో బోయేముందు ఆయా తెచ్చియిచ్చిన వేడిపాలు తాగి గ్లాసు తిరిగి యిచ్చేస్తూ "సంధ్య భోంచేసిందా?" అని అడగ లేక అడిగాడు.

"లేదు. తలనొప్పి తగ్గలేదుట!" ఎన్నడూ లేంది మాధవ్ అరగంటలో రెండుసార్లు సంధ్య గురించి అడగటం చూసి ఆయా లోలోపల ఆశ్చర్యపోతూ అంది.

"పిలవమంటారా ఏమైనా పనుందా?—" ?-" గుమ్మందాటి వెళ్ళబోయే ముందు వెనక్కి తిరిగి చూస్తూ అడిగింది.

"వద్దువద్దు, వూరికే అడిగాను." పడుకుంటూ అన్నాడు. అంతకంటే యింకేం అంటాడు! పైకి నిదానంగా యదాలాపంగా అన్నట్టు వద్దన్నా అతనికి ఆ క్షణంలో వెళ్ళి సంధ్యని బలవంతంగా మంచంమీద నుంచి లేపి భుజాలుపట్టి కుదిపి అసలు విషయం అంతా చెప్పేసి పూర్తిగా అర్థం చేసుకునేవరకూ తనచేతుల మధ్య నుంచి వదలకూడదని బలంగా అన్పించింది. కానీ అతనికి తెలియని అజ్ఞాతశక్తి యేదో బలహీనుడిని చేసి నిర్లిప్తంగా వుండేలా చేసింది.

"ఇదుగో! యేంకావాలి అనిఅడిగితే చెప్పటం లేదు, ఇందాకటినుంచి నిద్ర పోకుండా తనలో తను ఒకటే యేడుపు—" ఆయా బాబుని యెత్తుకొచ్చి మంచం దగ్గర దింపుతూఅంది.

"ఎందుకూ?' యేమైంది?- యేం బాబూ-" మాధవ్ ఆత్రంగా కొడుకుని రెండు చేతులూజాచి యెత్తి గుండెల మీదకి లాక్కున్నాడు. బాబు సమాధానంగా తండ్రి గుండెలకి కరుచుకుపోయి మరింత బావురుమన్నాడు.

"ఎందుకు? యెవరన్నా యేమైనా అన్నారా?" మాధవ్ ఆదుర్దాగా ఆయా వైపు చూశాడు.

"ఇప్పటివరకూ బాగానే వున్నాడు మరి." భయంభయంగా అంది ఆయా.

"ఎందుకో నాకు చెప్పు. నా బాబువి కదూ!—" గుండెలకి హత్తుకుంటూ అనునయంగా అంటున్న మాధవ్‌కి హఠాత్తుగా యింతక్రితం తను కసరటం, బాబు ముఖం దించుకుని వెళ్ళిపోవటం గుర్తు కొచ్చింది. పసి హృదయం రోషపడి వుంటుంది! ఎంత సున్నితం! బాబు బాహ్యరూపంలో తన పోలికలు చాలా వున్నా స్వభావంలో మాత్రం సంధ్య పోలికలు యెన్నో కన్పిస్తాయి. మాధవ్‌కి ఆ క్షణంలో మరో గదిలో భోజనం వద్దని అలిగి పడుకున్న సంధ్యని కూడా యిలాగే దగ్గరకి లాక్కుని గుండెలమీద తల ఆనించుకుని ఓదార్చి సేద దీర్చాలనిపించింది.

## 43

మనిషి మానసికంగా ఓ విధమైన పరిపూర్ణతని సంపాయించుకున్నప్పుడు జీవితాన్ని గురించిన ఆలోచనల్లో ఆవేశం తగ్గిపోతుంది. రోజులు యాంత్రి

కంగా వెళ్ళిపోతాయి. కాలం గడిచిన కొద్దీ ఆశయాలమీద, ఉద్రేకంమీద అంతక్రితం సంపాయించుకున్న అనుభవం వేదాంతపు తెరని దింపేస్తుంది. చేసే ప్రతి పనిపట్లా ఓ విధమైన ఉదాసీనత — ప్రవర్తనలో ఓ రకమైన నిశ్చలత్వం వచ్చేస్తాయి. సుఖదుఃఖాలకి అతీతంగా నిలబడిన మనసు వేటికీ చలించదు.

ప్రస్తుతం మాధవ్ కూడా అదే స్థితిలో వున్నాడు. రోజులు గడిచినకొద్దీ సంధ్యని చేరుకోగలను అనే ఆశ హారతి కర్పూరంలా హరించుకుపోతోంది. బాబు ద్వారా సంధ్యని పొందాలని అనుకున్న మాధవ్ ఆ ప్రయత్నం ఫలించకపోగా బాబుని కూడా పోగొట్టుకుంటున్నానేమో అనే భయంతో బాధపడసాగాడు. అతను ఆశించింది లభించింది నిజమే. బాబు, సంధ్య ఆప్తులయ్యారు. ఇప్పుడు వరసగా నాలుగైదు రోజులు తండ్రి కన్పించకపోయినా బాబు బెంగపడడు. వాడు సంధ్య దగ్గర బాగా అలవాటు కావాలని యే వంకతో దూరం దూరంగా వుండేవాడో ఆ వంకే బాబుని శాశ్వతంగా దూరం చేస్తోంది. తను ఆశించింది లభించిందనే తృప్తి అతనికి యేమీ లేకపోగా పైనుంచి విపరీతమైన అశాంతితో మనసు విలవిల లాడసాగింది. సంధ్య తన చుట్టూ గీసుకున్న గిరినుంచి ఒక్కడుగు ముందుకు వేయకుండానే బాబుని అందులోకి లాక్కుంది. బైట నిలబడిపోయిన మాధవ్ తనకి ఆ పరిధిలో ప్రవేశించే అర్హత లేకుండా యెప్పటి లాగానే బైట వంటరిగా నిలబడిపోయాడు. సంధ్య మనసులో అతనిపట్ల వున్న ద్వేషం దోస గింజంత కూడా తగలేదు. ఓ విధంగా విజయం పొందిన మాధవ్ యింకో రకంగా చిత్తుగా ఓడిపోయాడు.

రాత్రింబవళ్ళు బంతుల్లా దొర్లిపోతున్నాయి. రోజులు చక్రంలో ఆకుల్లా గిర్రున తిరిగి వస్తున్నాయి. సంవత్సరాలు యిట్టే గడిచిపోతాయి. విపరీతమైన వేగంతో పరిభ్రమిస్తున్న యీ కాలచక్రం వైపు చిన్న పిల్లవాడిలా విహ్వలంగా నిశ్చేష్టుడై చూస్తూ నిలబడిపోవడం తప్ప అతనేం చేయలేకపోతున్నాడు. శారీరకంగా దారుఢ్యం తగ్గకపోయినా అతనికి మానసికంగా వార్ధక్యం వచ్చేసినట్టు అన్పించసాగింది.

సంధ్య కాలుపెట్టిన వేళావిశేషమో, లేక బాబు పేరు బలమో తెలియదుకాని మాధవ్ వ్యాపారంలో ఒకచేత్తో వేస్తే పది చేతుల్తో అందుకోవల్సినంత లాభం తెచ్చి అందిస్తోంది. అతను యేదిపట్టినా బంగారం అవుతోంది. కాని యేం లాభం! మనిషికి మనశ్శాంతి కొని యివ్వలేని ఆ డబ్బుని అతనేం చేసకుంటాడు! అందుకే బాబుపేరు మీ: బాంక్‌లో భద్రపరుస్తున్నాడు.

ఆ రోజు మాధవ్ రాబోతున్న దసరాకి బాబుతోపాటు ఇంట్లో అందరికీ బట్టలు తెచ్చి యిచ్చాడు. నాలుగు రోజుల క్రితం అతనికళ్ళ ముందు

జరిగిన సంఘటన శూలంలా అతని హృదయాన్ని తూట్లు తూట్లుగా పొడుస్తోంది.

ఆరోజు అతను భోజనం ముగించుకుని గదిలో కూర్చుని పేపరు చూసుకుంటున్నాడు. బాబు అక్కడే కూర్చుని ఆడుకుంటున్నాడు. సంధ్య యేదో పని మీద ఆ గదిలోకి వచ్చి అక్కడ మాధవ్‌ని చూసిన వెంటనే వెనక్కి తిరిగి వెళ్ళబోయింది. ఇంతలో బాబు పరుగెత్తుకెళ్ళి "అమ్మా!" అంటూ కొంగుపట్టుకున్నాడు. సంధ్య వదిలించుకు వెళ్ళబోయింది. బాబు వదల్లేదు. పైనుంచి నవ్వుతూ మరింత గట్టిగా పట్టుకుని తనవైపు లాగాడు. అసలే పాత చీర. అప్పటికే కాస్త చిరిగి వుంది కాబోలు. బాబు పట్టుకు లాగగానే పర్రున గుండెలమధ్యకి చిరిగి వూడి వచ్చింది. క్షణంసేపు కొయ్యబారి పోయిన సంధ్య వెంటనే రెండు చేతులూ వక్షానికి అడ్డు పెట్టుకుంది. తన చేతుల్లోకి వూడి వచ్చిన చీరని చూసి బాబు పకపకా నవ్వాడు. మాధవ్ తెల్లబోయి చూస్తున్నాడు. సంధ్య వెంటనే వంగి బలంగా వాడి వీపుమీద ఒక్కటి చరిచి గిరుక్కున తిరిగి మెరుపులా వెళ్ళిపోయింది.

మాధవ్ లేచి వచ్చి యేడుస్తున్న బాబుని దగ్గరకు తీసుకుని సముదాయించాడు.

ఆ సాయంత్రం భోజనంచేసి చేయి కడుక్కుని యివతలకి వస్తుంటే వంటయింటి గుమ్మం ప్రక్కన నిలబడిన సంధ్య తల వంచుకుని కాలి బొటనవేలు నేలమీద వ్రాస్తూ "క్షమించండి" అంది.

---

★ అయిదేళ్ళ కొడుకు తండ్రి దగ్గిరికి వెళ్ళి ఫిర్యాదు చేశాడు: "నాన్నా-అన్నయ్యే నా గోలీలు చూసిస్తానని తీసుకుని మళ్ళీ ఇవ్వటం లేదు నాన్నా. అవన్నీ తనవే నంటున్నాడు."

తండ్రి కొడుకుని కొంచెం ఎత్తయిన బల్లమీద నుంచో పెట్టాడు. తను కొంత దూరంలో నిలబడి, దూకమన్నాడు. "అమ్మో భయం" అన్నాడు కొడుకు. "ఫర్వాలేదు, నే పట్టుకుంటాగా" అన్నాడు తండ్రి.

కొడుకు ధైర్యం తెచ్చుకుని తండ్రి చేతుల్లోకి దూకాడు. తండ్రి వెనక్కి జరిగాడు. కొడుకు ధబేలున కింద పడ్డాడు. మోకాళ్ళు చితికాయి.

అప్పుడు తండ్రి అన్నాడు: "చూశావా? ఇహనుంచి ఎవ్వరినీ నమ్మబోకు."

"ఎందుకు ?" ఆశ్చర్యపోతూ అడి గాడు.

"చీరచిరిగి పోయిందనె కోపంలో బాబుని కొట్టాను. అది నా తప్పే."

"నీకా హక్కువుంది." ఇంకో మాటకి అవకాశం ఇవ్వకుండా అక్కడి నుండి వచ్చేశాడు. మర్నాడు అదేచీర కట్టుకుని సంధ్య కట్టుకోవటం చూసిన అతని మనసు క్రుంగిపోయింది.

అందుకే యీరోజు ఆయాతోపాటు ధైర్యంచేసి సంధ్యకి కూడా చీరెలు తెచ్చాడు. ఎక్కువ ఖరీదుపెట్టి కొంటే విసిరి ముఖంమీద కొడుతుందని భయం. అందుకే మామూలు చీరెలు తెచ్చాడు.

ఏమిటివి ?_" అంది సంధ్య చీరె లున్న పెట్టి తెచ్చియిచ్చేస్తూ, అందులో వున్నవి చీరెలని యిద్దరికీ తెలుసు.

"నీకే !" గోడవైపు తిరుగుతూ అన్నాడు. సంధ్య ముఖంలో కన్పించ బోయే భావం అతనికి తెలుసు. అది చూసి భరించగల శక్తి రోజురోజుకి సన్నగిలుతోంది. ఈ మధ్య మరీ దిగ జారి పోతున్నాడు.

"నాకెందుకు ?" నొసలు విట్లిం చింది సంధ్య

"దసరాకి యింట్లో అందరికీ బట్టలు తెస్తూ నీకూ తెచ్చాను. అందులో ప్రత్యేకత యేమీ లేదు." కనీసం అలా అంటేనైనా తీసు కుంటుందేమోనని ఆశ.

"ఓహో !"

సంధ్య నిర్లక్ష్యంగా అన్న ఆ ఓహో అతని గుండెల్ని నిర్దా క్షిణ్యంగా చీలుస్తుందని, అది భరించ గల శక్తి అతనిలో యింకిపోతోందని సంధ్య కెలా తెలుస్తుంది ! ఇంకా ఎన్ని రోజులు తనకీ నరకం ! అణు వణువునా యీ చిత్రహింస యింకా యెన్ని యుగాలు! మాధవ్ బిగబట్టి నిల బడ్డాడు.

"మీరు ప్రత్యేకత చూపించారా లేదా అని నేను అడగటానికి రాలేదు. ఇవి నా కనవసరం అని చెప్పి వెళ్ళ టానికి వచ్చాను." ప్యాకెట్ మంచం మీద పడేసి వెళ్ళిపోబోయింది.

వెంటనే యిటు తిరిగిన మాధవ్ చటుక్కున చెయి పట్టి ఆపాడు. సంధ్య వులిక్కి పడటం అతను గమ నించక పోలేదు. "సంధ్యా ! ఒక్కటి అడుగుతాను. జవాబు చెప్పు" అన్నాడు.

సంధ్య మాట్లాడలేదు. వెనక్కి తిరగలేదు. నిటారుగా అలాగే నిలబడి పోయింది.

"నా మీద అసహ్యం వుంటే ప్రతీకారం యెందుకు తీర్చుకోవు ? కనీసం నోరు తెరిచి నా ముఖంమీద యెందుకు చెప్పవు ? అడుగడుగునా నీ నిర్లక్ష్యంతో యిలా కాస్త కాస్త యెందుకు చంపుతావు నన్ను ?_"

సంధ్య మాట్లాడలేదు.

"చెప్పు సంధ్యా. చెప్పు." చెయి మరింత బిగించి పట్టుకుంటూఅడిగాడు.

అప్పటికీ సంధ్య నోట్లోంచి మాట రాలేదు.

"నేను నీకు అన్యాయం చేసిన మాట నిజమే. నేను కాదనటంలేదు. అది గుర్తించి నీ జీవితం చక్కదిద్దా లని యెంత ప్రయత్నం చేస్తున్నానో నువ్వు గ్రహించ వెందుకు?"

"............"

"మాట్లాడవే? నా కా అవకాశం యెందు కివ్వవు?—"

"నా కిష్టంలేదు. ఎవరేం చేసినా నేను పోగొట్టుకున్నది తిరిగి పొంద లేను కాబట్టి నా కవసరంలేదు."

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం యేర్పడింది. చెయ్యి వదిలేస్తున్నాడు అనుకుంది. అతని చేతివేళ్ళు వదులు అయినట్టే అయి వెంటనే మరింతబలంగా బిగుసు కున్నాయి. రెండో చెయ్యి భుజంమీద వేసి బలంగా గిరుక్కున తన వైపుకి తిప్పుకున్నాడు. అనుకోకుండా చేసిన యీ పనితో సంధ్య అతని గుండెల దగ్గరగా ముఖాముఖీ వచ్చింది.

క్షణంసేపు యిద్దరూ ఒకళ్ల కళ్లలోకి ఇంకోళ్ళు తీవ్రంగా చూస్తూ నిలబడి పోయారు.

"సంధ్యా! ఇప్పుడే చెప్తున్నా! ఎంతకాలం ఓపిక పట్టాలో అంత కంటే ఎక్కువే ఓపిక పట్టాను. ఇక నాకు చాతకాదు. నువ్వు నన్ను సక్ర మంగా నీ జీవితంలో ప్రవేశించ నివ్వక పోతే బలవంతంగా ఆ పని చెయ్యాల్సి వస్తుంది. నన్ను రెచ్చగొట్టకు. అది నీకు మంచిది కాదు."

సంధ్య కళ్లలో నిప్పులు కురుస్తు న్నాయి.

"ఇప్పుడు మీరలా చెయ్యా ంది యేముంది? చదువునెపంతో వాసుని దూరం చేశారు. మంచితనం యెరగా చూపించి ఆయాని లొంగదీసుకున్నారు. నోరు తెలియని పసిపిల్లాడితో అమ్మా అని పిలిపించటంలో మీ వుద్దేశ్యం యేమిటి? మీ మనసులో వున్న నీచ భావం నేను గ్రహించలేదనా? నాకింక మీరుచేసే చెడు యేముంది! సింహంతో మేకపిల్ల కలియబడలేదని తెలుసుకో లేని మూర్ఖురాలిని కాదు. దిగజారిన నా పరిస్థితులు ఆధారంగా తీసుకుని, అవస రంలో ఆదుకున్నాను అనే నెపంతో నా నుంచి మీరుయేంకోరినా కోరవచ్చు. మీ పశు బలంతో నా శరీరాన్ని మ ళ్ళీ లొంగ తీసుకుంటే తీసుకోవచ్చు. కాని— కాని — యెప్పటికీ నాకంఠంలో వూపిరి వుండగా నన్ను — నన్ను— నా మనసుని గెలుచుకోలేరు."

"సంధ్యా!" మాధవ్ వెన్నుపోటు తిన్న మనిషిలా చెయ్యి వదిలేశాడు. సంధ్య వెంటనే గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. ఆ వెళ్ళటంలో ఖంగారుగాని, భయంగాని లే దు. సగర్వంగా, మహారాణిలా, ఠీవిగా తలెత్తుకుని మెల్లిగా వెళ్ళిపోయింది.

మాధవ్ నీరసంగా మంచంమీద కూలబడిపోయాడు. ముఖం నిండా చిరు చెమటలు అలుముకున్నాయి. ఆ నిముషంలో చూడలేదు కాని చూస్తే సంధ్య మనసు కూడా నీరు కారి పోయేంత దీనంగా వుంది అతని ముఖం. భగవాన్ ఏం చెయ్యాలి! ఇద్దరి మధ్యా వున్న యీ అఘాతం

పూడే వుపాయమే లేదా! భయంకర మైన బ్రహ్మరాక్షసి మెల్లి మెల్లిగా నోరు తెరిచి పెద్దది జేసినట్టు నానాటికి పెరుగు తోంది కాని తరుగటంలేదే! దీన్ని దాటటం యెలా? ఒకవేళ ఎలాగో జీవితాన్ని పణంగానైనా పెట్టి అతి ప్రయాసతో అవతలకి చేరితే సంధ్య నిర్దాక్షిణ్యంగా మళ్ళీ అందులోకి తోసేస్తుంది కాని ఆప్యాయతలో దగ్గరకి తీసుకోదు. అది ఈ రోజుతో స్పష్టంగా తెలిసిపోయింది. ఆడవాళ్లు సుకుమారులు, సున్నిత స్వభావులు అంటారే! సంధ్య మనసులో నాజూకు తనం అనేదే లేదా? పాషాణంలా కఠినంగా వున్న యీ సంధ్యలో ప్రాణం పోసి సజీవంగా చేసేదెలా! ఎలా? అది అతనికి సాధ్యం కాదన్న మాటేనా! సంధ్యని చేరుకోవాలనే తన ప్రయత్నంలో అపజయమే వ్రాసి పెట్టి వుందా! భగవాన్! నే నేం చెయ్యను.

మాధవ్ మనసులో యెక్కడో హృదయాంతరాళంలో బైలుదేరిన ఈ జ్వాల మెల్లగా ప్రాకి అంతయై యింత అయి, అన్నట్టు హృదయం అంతట ఆక్రమించుకో సాగింది. భగవంతుడు తను చేసిన ఆ అపరాధానికి శిక్షించలేదని, పై నుంచి సకల సంపదలు యిచ్చి ఆశీర్వదించాడని అపోహ పడ్డాడు. ఎంత భ్రమ? వడ్డీతో సహా తీరుస్తున్నాడు. కేవలం సంధ్యని చేరుకుని యీ నరకం అనుభవించటానికే రాంగోపాలరావుగారి ఆస్తి తనకు సంక్రమించినట్టుంది. ఇంత డబ్బుంది. జీవితం సకల విధాలా అనుభవించటానికి యిన్ని అవకాశా

లున్నాయి. కాని తనేమైనా సుఖం అనేది యెరుగున్నాడా! అతని మనసు వేయి రంపాలతో చీర్చి ఛిన్నాభిన్నమైన ఆ ముక్కల్ని అశాంతి అనే అగ్నిలో కాలుస్తున్నట్టు అన్పించ సాగింది.

## 44

పై సంఘటన జరిగిన తర్వాత మాధవ్ సంధ్యకి చాలా దూరంగా వుండటం ప్రారంభించాడు. అతను పైకి యెంత మామూలుగా వున్నట్టు నటిస్తున్నా లోపల్లోపల బ్రద్దలవుతున్న అగ్ని పర్వతాలు — వాటి దావానలం మెల్లగా అతని ఆరోగ్యాన్ని హరించటం ప్రారంభించింది. మనిషి రంగు తగ్గిపోయాడు. కళ్ళక్రింద నల్లటి చారలు యేర్పడినాయి. శరీరం చిక్కిపోయింది. ఆయా యీ మార్పు కని పెట్టక పోలేదు. కాని కారణం వూహించలేక పోతోంది. ఎన్ని విధాల అతని ద్వారా అసలు సంగతి రాబట్టాలని ప్రయత్నించినా లాభం లేక పోయింది. సంధ్య కూడా మామూలుగానే వుంది. ఆ రోజు ఆ సంఘటన తర్వాత అతని ప్రవర్తనలో యెలాటి మార్పు రాకపోవటం చూసి మనసులో ఆశ్చర్యపోయింది.

దసరాశలవులకివాసు ఇంటికివచ్చాడు. వాసువున్న ఆ నాలుగు రోజులు సరదాగా యిట్టె గడిచిపోయినాయి. బాబు అంటే వాసుకి యిప్పుడు బోలెడంత ప్రాణం. అదిగాకుండా బాబు మాధవ్ దగ్గరకంటే సంధ్య దగ్గరే యెక్కువ కాలం గడపటం అతని దృష్టిని దాటిపోలేదు. అందుకు మనసేమీ యీర్ష్యతో ముడుచుకు పోలేదు. సరికదా పైనుంచి ఆనందంగా కూడా అన్పించింది. ఆ వున్న కొద్ది రోజులు వాసు మాధవ్‌వెంటే నీడలా వున్నాడు.

రేపు ఉదయం వెళ్ళిపోతాడనగా ఆ రాత్రి వాసు అక్కగారి దగ్గరకు వచ్చి కూర్చున్నప్పుడు "అక్కా! ఆయనెందుకు అంత చిక్కిపోయారు?" అన్నాడు.

"ఏమో! నాకేం తెలుస్తుంది!" నిర్లక్ష్యంగా అందిసంధ్య. వారంరోజుల క్రితం జ్యోతి పెళ్ళి శుభలేఖవచ్చింది. మాధవ్ పెళ్ళికి వెళ్ళలేదు. బహుశా ఆ కోపమో, నిరాశో.కారణం కావచ్చు.

"నాకేం తెలుస్తుంది!?"

"నీకు కాకపోతే యింకెవరికి తెలుస్తుంది? ఆయా, మీ ఇద్దరూ యింట్లో వుండి ఏం చేస్తున్నారు?" వాసు కోపంగా చూశాడు.

సంధ్య మాట్లాడలేదు.

"ఎందుకోగాని ఆయన మునుపటిలా లేనేలేరు. ఒంట్లో బాగాలేదా

---

★ ఒక యువతి :— "నేను పాతికేళ్ళు వచ్చేదాకా పెళ్ళి చేసుకోను."
స్నేహితురాలు :— "నేను పెళ్ళి చేసుకునేదాకా నాకు పాతికేళ్ళు రావు."

అంటే బాగానే వుంది అంటారు. బాగానే వుంటే అంత చిక్కిపోవటం దేనికి మరి! అంత నిశ్శబ్దంగా, పరధ్యాసగా వుండటం నే నింతవరకూ చూడనేలేదు. లోపల్లోపల యేదో అశాంతితో బాధ పడుతున్నారు, మనకి పైకి చెప్పటం లేదుగాని" వాసు దిగులుగా తనలో తను అనుకుంటున్నట్టు అన్నాడు.

సంధ్య వింటూ కూర్చుంది. వాసు మళ్ళీ మొదలు పెట్టాడు.

"మీ రసలు ఆయనతో చనువుగా మాట్లాడనే మాట్లాడరు. నువ్వు మరీను." నిష్ఠూరంగా అన్నాడు.

"నన్నేం చేయమంటావు?"

"ఏం చెయ్యమంటావేమిటి? చల్లగా ఒక్క చిరునవ్వు నవ్వవు. స్నేహంగా ఓ చిన్న మాట మాట్లాడవు. ఆయనలా అవటానికి సగం కారణం నువ్వే అయి వుంటావు."

"నోరుముయ్."

"ఇన్నాళ్ళూ మూసుకునే వున్నానుగా. ఆయన మనకెంత చేశారు! ఎన్ని విధాల ఆదుకున్నారు! నీకు కాస్తకూడా కృతజ్ఞత లేదు."

"వాసూ!"

"వాసూ అని నువ్వలా బిగ్గరగా అరిస్తే నే నేం భయపడను. ఆయనలా యెందుకున్నారూ అంటే తెలియదుట. ఆ మాట అనటానికి నీకు సిగ్గెలా అనిపించటంలేదు? ఆయన ఇల్లు మనం స్వంత ఇల్లులా వాడుకుంటున్నాం. ఆయన డబ్బు స్వంత డబ్బులా ఖర్చు పెడుతున్నాం. ఆయన మనసులో బాధ ఏమిటో తెలుసుకోటానికి మాత్రం పరాయివాళ్ళం. ఆయన ఒంట్లో కనీసం బాగుందో లేదో తెలుసుకోవాలనే మర్యాదకూడా మనకి లేదు."

"వాసూ! నువ్వు దయ వుంచి యిక్కడినుంచి వెళ్తావా?" పాలిపోయిన ముఖంతో బిగబట్టి అడిగింది సంధ్య.

"కాని - నీకు - నీకిది మంచిది కాదు అక్కా! క్రిందటి జన్మలో యెవరినో యిలాగే విపరీతంగా బాధపెట్టి వుంటావు. అందుకే యీ జన్మలో—" వాసు హఠాత్తుగా ఆగిపోయాడు.

అప్పటికే సంధ్య కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తోంది. వాసు వెంటనే తగ్గిపోయి "అక్కా! పొరపాటయింది. క్షమించు, క్షమించవూ" అంటూ దగ్గరగా రాబోయాడు.

"నువ్వు ముందు యిక్కడినుంచి బైటికివెళ్ళు. పో! ఊ—" సంధ్యవేలు పెట్టి గుమ్మంవైపు చూపించింది.

"అక్కా! నాది పొరపాటయిందని చెబుతున్నాగా! ఏదో వాగేశాను. నేను ఒట్టి మొద్దుని. గాడిదని. చవటని—" దగ్గరగా రాబోయాడు.

"ఛీ. నా దగ్గరకు రాకు" సంధ్య గర్జిస్తూ వాసుని విసురుగా తోసేసి హఠాత్తుగా మంచంమీదపడి వెక్కి వెక్కి యేడవసాగింది.

మంచంమీద సంధ్య ప్రక్కగా

కూర్చుని యిది అంతా చూసిన బాబు ఒక్క వురుకులో మంచంమీద నుంచి దిగి గదిలోంచి తుర్రున పరుగెత్తాడు.

## 45

"నాన్నా ! నాన్నా ! సంధ్య యేడుస్తోంది."

"ఎందుకు ?" గదిలో కూర్చుని యేవో కాగితాలు చూసుకుంటున్న మాధవ్ వాటిల్లోంచి తలెత్తి ఆదుర్దాగా అడిగాడు.

"మరే_మరే_వాసేమో_మరే_ ఎంజెనేమో_మరే_"

"నువ్వెళ్ళి చప్పున వాసుని నేను రమ్మంటున్నానని పిలుచుకురా !___"

తండ్రి నోట్లోంచి మాట వచ్చీరాక ముందే బాబు మళ్ళీ పరుగెత్తాడు. సంధ్య ఏడుస్తోందా ! ఎందుకు ? ఏమైంది? దగ్గరగా వెళ్ళి వెంటనే విషయం ఏమిటో తెలుసుకోవాలని ఆత్రుతపడుతున్న మనసును కళ్ళెంవేసి పట్టి ఆపాడు. ఏం ప్రయోజనం ! వెడితే మరింత అసహ్యించుకోవటమేగా ?

వాసు వచ్చాడు.

"ఏమిటి వాసూ !" కాగితాలు ప్రక్కన పెడుతూ అడిగాడు.

వాసు ముఖం పాలిపోయివుంది మాధవ్ దగ్గరగా వచ్చి చెయ్యిపట్టుకుంటూ "అక్క ఏడుస్తోంది. నేనెంత చెప్పినా వినటంలేదు. మీరు వెళ్ళి కొంచెం మాట్లాడండి." అన్నాడు దీనంగా.

"ఎందుకు ? ఏమైంది ? ఏమన్నావు నువ్వు ?" నిస్సహాయంగా అడిగాడు మాధవ్.

వాసు యేమన్నానని చెప్తాడు ! అందుకే వూరుకున్నాడు.

"చెప్పు వాసూ ! యేమన్నావు?" లాలనగా అడిగాడు. తర్వాత మెల్లిగా బుజ్జగిస్తూ ఒకటికి రెండుసార్లు అడిగి చెప్పమని బలవంతం చేస్తే వాసు జరిగిన సంభాషణ అంతా చెప్పాడు.

"ఎంత పొరపాటు చేశావు వాసూ! సంధ్య మనసు చాలా సున్నితం అన్న సంగతి యెలా మర్చిపోయావు ?" దగ్గరకు లాక్కుంటూ అన్నాడు. వాసు మనసులో సంఘర్షణ అతను అర్థం చేసుకోలేక పోలేదు.

---

★ తల్లి తీరిగ్గా స్నో, పౌడరు రాసుకుంటుంటే అయిదేళ్ళ కూతురు చూస్తూ కూచుంది.

"ఎందుకమ్మా ! అవి రాసుకోటం ?" అని కూతురు అడిగింది.

"అవి రాసుకుంటే అందంగా వుంటారు" అంది తల్లి.

ముస్తాబంతా అయిన తరవాత తల్లికేసి చూసి "ఊహూ. ఆ స్నో, పౌడరూ మంచివి కావేమో !" అంది కూతురు.

"మర్చిపోలేదు. కాని, మీరు? మీరింత మంచివారు, ఇంత సహాయం చేశారు. అది అక్క యెందుకు గుర్తించదు?" బాధగా వాసు యేడుపు ఆపుకుంటూ అన్నాడు.

"అది నా దురదృష్టం. కాని—నీకు సహాయం చేస్తున్నది సంధ్య గుర్తించాలని, సంధ్యచేత నేను గౌరవించబడాలని కాదు వాసూ!"

"నాకు తెలుసు. అందుకే నాకింత బాధ. అది గుర్తుకు వస్తేనే అక్కమీద కోపం వస్తుంది. నిజానికి మీ అండ లేకపోతే మేము యేమయి పోయేవాళ్ళం! తలుచుకుంటేనే భయం వేస్తుంది. అక్కని నేను మాత్రం.కాని మాటలు.యేమన్నానో మీరే చెప్పండి. మన కింత సహాయం చేసిన మనిషితో కాస్త చనువుగా వుండాలని గుర్తు చేయటం తప్పా!"

"వాసూ!" మాధవ్ ఆప్యాయంగా వాసు వీపుమీద నిమురూ వుండిపోయాడు. వాసు చూపించే ఆత్మీయతలో సంధ్యకనీసం వెయ్యోవంతయినా చూపిస్తే తనకి యెంత తృప్తి! లేదు—లేదు. సంధ్య ఆప్యాయతకి తను అర్హుడు కాదు, అది మర్చిపోతున్నాడు తను.

కొద్దిసేపయిన తర్వాత మాధవ్ బాబుని ఎత్తుకుని వాసుతో సంధ్య గదిలోకి వచ్చాడు. సంధ్య యింకా అలాగే దిండులో ముఖం దించుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"సంధ్యా!" మాధవ్ పిలిచాడు. బాబు తండ్రి చేతుల్లోంచి క్రిందకు జారి సంధ్య దగ్గరకు పరుగెత్తాడు.

"సంధ్యా! క్షమించు" వాసు తరపున తను కోరుకుంటున్నట్టు అడిగాడు.

"మీరే — మీరే — వాడిని రెచ్చగొట్టి—" సంధ్య మాటపూర్తిచేయనే లేదు.

"అబద్ధం. అన్నీ నేనే అన్నాను" వాసు కోపంగా అరిచాడు.

"హుష్—" మాధవ్ వాసు చేయి పట్టి వెనక్కు లాగాడు.

"నేనేదయినా అనదల్చుకుంటే సూటిగా నిన్నే అడుగుతాను. ఇన్నాళ్ళ పరిచయంలో ఈ కాస్తయినా నువ్వు తప్పకుండా అర్థం చేసుకుని వుంటావు. నామీద నీకెంత అసహ్యం వుందో నాకు తెలుసు. అది యెప్పుడూ మర్చిపోను. నన్నెంత ద్వేషించాలనిపిస్తే అంతా ద్వేషించు. అందులోనైనా నాకు మనశ్శాంతి దొరికితే నేను భరిస్తాను. అంతేగాని. వాసు మాటలు పట్టించుకోకు."

తలాతోకాలేని యీ సంభాషణ వాసుకి అంతుపట్ట లేదు. ఇంతలో ఆయా అక్కడికి రావటంతో మాధవ్ గదిలోంచి వెళ్ళిపోయాడు. విషయం ఏమిటో స్పష్టంగా తెలియకపోయినా సంధ్యా మాధవ్‌ల మధ్య యీ వినాదానికి యేదో కారణం వుందని అనిపించింది వాసుకి. కాని యెంత ఆలోచించినా అదేమిటో అతనికి అంతు పట్టటం లేదు.

(సశేషం)

# మంచిమనసు చెడ్డమనిషి

ఆ వేళ ఆకాశంలో చంద్రుళ్ళేడు— ఎంచేతంటే అమావాస్య కాబట్టి!

ఆ వేళ వూళ్ళో చాలామంది ముఖాల్లో చిర్నవ్వుల్లేవు – ఎంచేతంటే వూళ్ళో బియ్యం, సుఖం స్టాకులో లేవు కాబట్టి!

ఆ వేళ బీచిలో మనుషులూ లేరు!— వర్షాకాలం కాబట్టి!

కాని .... ఎవరున్నా లేకపోయినా బీచిలో గట్టు దగ్గిర సూదుల్లాటి చిన్న చినుకుల్లో తడుస్తూ, పొంగుతూ అరుస్తున్న సముద్రంవైపు చూస్తూ, అక్కడలేని దేవుణ్ణి వూహించుకుంటూ, "ఏవయ్యా బాబూ? ఏవిటీ న్యాయం?" అని మొగమాటంగా దేవుణ్ణి కసురుతున్న నాగరాజు మాత్రం వున్నాడు.

* * *

నాగరాజు పుట్టి పాతికేళ్ళయింది. వాళ్ళమ్మ చచ్చిపోయి ఇరవైయ్యేళ్ళు, వాళ్ళనాన్న పారిపోయి పదిహేనేళ్ళు, మనసు పెరిగి పదేళ్ళు అయాయి. నాగరాజుకిస్వయానామామయ్య, అతనికి మిగిలినో భూవుల్ని, స్వాధీనంచేసుకుని అతనికిరవై రెండేళ్ళ వయసొచ్చేదాకా తిండిపెట్టి, బియ్యేచదువు చెప్పించాడు. అప్పట్లో ఆయన మంచివాడు. కాని, మంచితనం, సుఖం, మంత్రుల వాగ్దానాలు, ఇవేవీ శాశ్వతం కావు కాబట్టి మిగతావాట్లాగే ఆయన మంచితనం కరిగి కరిగి, ఆఖరికి ఆవిరై పోయింది. ఆ ఆవిరి అలా మెల్లిగా పైకెగిరి పోతున్నపుడాయన నాగరాజుని పిల్చి-

"ఒరేయబ్బీ! నీ చేతికి డిగ్రీ వచ్చింది. నా కారిపైరయ్యే వయసొచ్చింది. నా పెద్ద కూతురికి పెళ్ళీడొచ్చింది. దేశంలో చూస్తే కరువొచ్చింది. నీ భూవుల్డబ్బు అయిపోయి ఏడాదవొచ్చింది.

శ్రీరంగం రాజేశ్వరరావు

అంచేత....నా బాధ్యతేదో అయిపోయింది.

మరంచేత నువ్వు ఈ డిగ్రీ తీస్కొని, వెళ్ళి వూరు మీద పడు. పడి ఉద్యోగం వెతుక్కో! నీ కాళ్ళ మీద నువ్వు నిలబడి, మంచి పేరు సంపాయించుకో! అప్పుడప్పుడూ కన్పిస్తూండు! ఆఁ! అంతే! వెళ్ళు! "అని మెత్తగా, గట్టిగా ...., అందంగా, వికారంగా— చెప్ప (లే)నట్టు చెప్పాడాయన.

నాగరాజు ఆయన ఆశీర్వాదం, డిగ్రీ తీస్కొని వెళ్ళిపోదా మనుకొంటుండగానే సుమతి నాగరాజు కద్దుగా వచ్చి నిల్చొంది. సుమతి నాగరాజు మామయ్యకి రెండో కూతురు. సుమతికి పదిహేడేళ్ళే అయినా, పాఠాల్నీ, నవలల్నీ, లోకాన్నీ, బాగా చదివింది.

అప్పుడా అమ్మాయి కళ్ళలో సగం నీళ్ళు నింపుకొని,

"బావా" అని రుద్ధ కంఠంతో పిల్చింది.

నాగరాజుకీ ఒక్కమారు ఏడుపొచ్చేసింది.

"వెళ్ళిపోతున్నావా బావా?" అంది సుమతి.

నాగరాజు సుమతివైపు చూశాడు. తనతోబాటు పదహారేళ్ళు పెరిగిన, అందమైన సుమతివైపు, అన్నేళ్ళనుంచి తన్ను వెంటాడిన కళ్ళవైపూ చూశాడు. చూసి,

"ఔను సుమతీ! వెళ్ళిపోతున్నాను" అని బావురుమన్నాడు నాగరాజు.

సుమతి కూడా ఏడ్చింది. పదిహేడేళ్ళ వయసొచ్చిన ఆ అందమైన కళ్ళలోంచి పదిహేడేళ్ళపాటు దాక్కొన్న నిజమైన కన్నీళ్ళు కారినప్పుడు,

"బావా! చిన్నప్పణ్ణించి ఆడుకున్నాం. పాడుకున్నాం. చదువుకున్నాం. కలిసి మెలిసున్నాం. ఈ అనుబంధాల్ని తెంపేసుకుని, కన్నీళ్ళనీ, జ్ఞాపకాల్నీ, నా కొదిలేసి వెళ్ళిపోతున్నావా బావా?" అంది సుమతి.

ఆమె అలా ఏడుస్తూ అంటే నాగరాజుకి నాలుగేళ్ళ క్రితం చూసిన దేవదాసు సినిమాలో 'పార్వతి' జ్ఞాపకమొచ్చింది.

కాని 'దేవదాసు'ని జ్ఞాపకం తెచ్చుకోవల్సింది తన విషయంలోనే నన్న ఆలోచన రాలేదు.

అప్పుడు నగరాజు సుమతిని కౌగలించుకొని ఓదారుద్దామనుకున్నాడు. ధైర్యంగా కథల్లో లాగ ఆమె జుత్తుని చేత్తోనూ, బుగ్గల్ని పెదవుల్తోనూ నిమురుదామనుకొన్నాడు.

కానీ ఏమీ చెయ్యలేకపోయాడు.

"ఈ వూళ్ళో నే వుంటానుగా! వస్తూంటాన్లే సుమతీ!" అని మాత్రం చెప్ప గలిగాడు. చెప్పి. వీడుస్తూనే, గేటుదాటి వచ్చేసి, సుమతినీ, ఆ ఇంటినీ - తనూ సుమతి కలిసి నాటి, పెంచి పెద్దచేసిన గులాబీ మొక్కని దీనంగా చూసి, కన్నీళ్ళతోనూ, బరువైన గుండెతోనూ వచ్చేశాడు. వచ్చేసే ముందు "నీ మనసు మంచిది బావా! నాకు తెలుసును నువ్వు నాకన్యాయం

చెయ్యవని" అంది సుమతి. ఆ మాట లామె అస్పష్టంగా అనుకోడం వల్ల నాగరాజుకి వినబళ్ళేదు.

* * *

నాగరాజు చామన్చాయగా చాలా అందంగా వుంటాడు. అతని మంచి తనం అతనికన్న అందంగా ఉంటుంది. కాని_అతని మంచితనాన్ని ఎవరూ అర్థం చేసుకోలేదనే అతని బాధ....

నాగరాజు కెనిమిదేళ్ళ వయసులో, నాలుగో క్లాసులో వున్నప్పుడు, తనిం టికి నాలుగిళ్ళ అవతల వున్న సూరి గాడు ఏడుస్తూక్లాసు కొచ్చేడు. అప్పుడు "ఏమ్రా ! సూరీ' ఎందు కేడుస్తున్నావ్! నీ కష్ట మేమిటో మాతో చెప్పరా !" అనెవరూ అడగలేదు. అందువల్ల, ఏ సానుభూతీ లేక సూరిగాడి ఏడుపు బాగా జాలి పుట్టించేలా వుంది. అసలు సాధారణంగా సూరిగాడితో ఎవరూ మాట్లాడరు. బురదలో తడిసినట్టుండే బట్టల్తో, చాలామందికి వెధవాయిత్వం చూపించే వాడి అమాయకమైన ముఖం చూసి జాలిపడరు. ఎప్పు డెవరు మాట్లా డినా "మీ నాన్నెవర్రా ? ఎక్క డున్నా డురా ?" అనడిగి, వాడికి ఏడుపు తెప్పించి వాళ్ళు నవ్వుతారు.

నాగరాజుకి మాత్రం సూరిగాడిమీద సానుభూతి తాడి చెట్టులాగ పెరిగి పోయింది. మల్లెతీగలా అల్లుకు పోయింది. అప్పుడు వాడి దగ్గరగా వెళ్ళి "సూరీ !" అని నెమ్మదిగా పిలిచాడు. సూరిగాడు పలకలేదు. వాడి కళ్ళమీద పెట్టుకున్న రెండు చేతుల్లోనూ ఓ చెయ్యిని మెల్లగావూప "ఒరేయ్ ! ఎందుకేడుస్తున్నావురా ?" అనడిగాడు నాగరాజు. దాంతో సూరిగా డింకా జోరుగా ఏడ్చేడు. ఆఖరికి నాగ రాచ్చేత బాగా ఓదార్చబడ్డాక ఏడుస్తూనే "పలక పగిలిపోయింది ..." అని చెప్పేడు. నాగరాజుకింకా జాలెక్కు వయింది. సూరిగాడి భుజంమీద చేయి వుంచి ఓ నిమిషమాలోచించి "పోనీ లేరా, ఏడవకు. నా పలక తీసికోలే ! దానికేమిటి ?" అన్నాడు నాగరాజు. సూరిగాడు ఏడవడం మానేశాడు. నాగ రాజువంక ఆశ్చర్యంగా చూసేడు. ఆచూపెలాగుందంటే — దొరికిపోయా నని ఏడుస్తున్న పాకిస్తాను సైనికుణ్ణి మనవాళ్ళు క్షమించి అతనికన్నంపెట్టి, గెడ్డం నిమిరినప్పు డతనుచూసిన చూపు లాగుంది. "నిజంగానే !" అన్నాడు సూరిగాడు.

"నిజమేన్రా" అన్నాడు నాగరాజు నవ్వుతూ.

ఆ తరువాత మేష్టారు క్లాసులో పలక లేని కారణమడిగితే పలకలేని నాగరాజుని బెత్తంతో బ్రెన్‌గన్నంత ఫోర్సుతో కొట్టినప్పుడు, తను చేసిన త్యాగపు విలువలో ఆ దెబ్బలు నొప్పిట్టినా, ఆ నొప్పిలో బాధతోబాటు కాసింతానందం కూడ తోచింది. కాని ఇంటికెళ్ళాం తర్వాత కనబడ్డ తట్లు, వినబడ్డ తిట్లు, ఆ తర్వాత క్లాసులో వాళ్ళందరూ తనను వెలేసినట్టుచూసిన చూపులూ తన త్యాగానికి విపరీతమైన విలువ కట్టేయి. తను చేసింది మంచి పనని నాగరాజుకి తెలుసు. కాని



అందువల్ల ఇన్ని చెడ్డలరుగుతాయని తెలీదు. జీవితం గురించి ఏఁవీఁ తెలిసే వయసు కాకపోయినా, ఆ సంఘటన నాగరాజు హృదయమ్మీద చెరగని ముద్ర వేసింది.

అప్పణ్నించీ, నాగరాజు పాలు నీళ్ళతో కలిసి పోయినట్టు మంచి తనంతో కలిసిపోయేడు. మంచితనం తోనే పెరిగేడు. మంచితనంతోనే వున్నాడు. కాని...ఎవరూ అర్థం చేసు

కోవి తన మంచితనం గురించి ఆలో చించినప్పుడల్లా నాగరాజుకి ఏడు పొచ్చేది. ఎవరితోనూ చెప్పకుండా వొక్కడే ఏడ్చి మళ్ళీ సంతృప్తిగా తన మంచితనాన్ని తలుచుకొని చిన్నగా ఇంకా సంతృప్తిగా నవ్వుకొనేవాడు.

★ ★ ★

నాగరాజు బియ్యే రెండో సంవత్స రంలో వుండగా వోసారి క్లాసు లేనందు వల్ల కాలేజీ ఆవరణ మధ్యనున్న చెట్టు క్రింద నిల్చొన్నాడు. ఆచెట్టుకిందనిల్చొనే వాళ్ళంటే ప్రిన్సిపాల్‌గారికీ, అమ్మాయి లికీ, లెక్చరర్లకీ - ఎవ్వరికీ పడదు.

చెట్టునీడ చల్లగా, అందంగా వుంది, బైట ఎండ వేడిగా, ఘాటుగా వుంది. ఆ ఎండలో వొకమ్మాయి నడిచి గరల్స్ రూమ్‌పక్కకు వెళ్ళిపోతూంది. ఆ అమ్మాయి తన క్లాస్ మేటేనని నాగ రాజుకి తెలుసు. ఆ అమ్మాయి చాలా అందంగా వుంటుంది. ఆ సంగతే మళ్ళీ అని "కదు గురూ?" అన్నాడు నాగరాజు పక్కనున్న మరో కుర్రాడు. నాగరాజు మొహమాటంగా నవ్వేసి వూరుకొన్నాడు.

ఇంతలోనే "ఓరేయ్! వెళ్ళి పోతోంది వేగం." అన్నా రెవరో. మరుక్షణం ఓ తెల్లని కాగితంతో తయారైన రాకెట్టు సూటిగా దూసు కొంటూవెళ్ళి ఆ అమ్మాయి జాకెట్టు మధ్య పడింది. అందరూ గట్టిగా నవ్వేరు. నాగరాజు మాత్రం గాభరా పడ్డాడు. ఆ గాభరా భయంవల్లో, ఆ అమ్మాయిమీద జాలి వల్లో, మరి దేని వల్లో తెలియలేదతనికి. ఆ తర్వాత నాగరాజు చాలా బాధపడ్డాడు. కేవలం ఆ అమ్మాయిమీద రాకెట్టు పడ్డందు క్కాదు.

అలా రాకెట్టు పడ్డ తర్వాత, ఆ అమ్మాయి ఆగిపోయింది. నేలమీద పడ్డ రాకెట్టువైపూ, తర్వాత చుట్టూ చూసింది. అవమానంతో క్రుంగిపోయి నట్టయిన తర్వాత, ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు మెరిసినట్టు నాగరా జూహించుకున్నాడు.

అర్థంలేని ఆ బాధ గురించి నాగ రాజు సాయంకాలం, రాత్రి అంతా బాధ పడుతూ ఆలోచించాడు.

పర్యవసానంగా ఆ మర్నాడు సాయంత్రం బస్సుకోసం నిల్చున్న ఆ అమ్మాయి దగ్గరకెళ్ళి ధైర్యం చేస్కొని పొడిదగ్గు దగ్గాడు. ఆ అమ్మాయి నాగరాజువేపు చూసింది. నాగరాజు వేస్కొన్న గొట్టం పేంటు, టీ షర్టు చూసి, ఆ తర్వాత నాగరాజు కళ్ళలోకి, 'చెట్టుకింద మనిషి'ని చూసి నట్టు కోపంగా,ధైర్యంగా 'ఏవిట'న్నట్టు చూసింది.

నాగరాజు నోటంట మాట రాలేదు. ఇరుకైన పేంటులో కాళ్ళూ, టీ షర్టు లోపల గుండెలూ వొణుకుతున్నాయి కాని.... ఏదో వొకటి చెప్పి వచ్చె య్యాలి. లేకపోతే-అందరూ నాగరాజు వేపే చూస్తున్నారు ...

"నిన్న .. రాకెట్టు.... మీ మీద.... వేశారు. ఏవీ అనుకోకండి.... నేను కాదు కాని....,"

కంగారూ, భయం కలిపి వెలిబుచ్చిన ఆ ధ్వనులకి ఆ అమ్మాయి మరీ కోపంగా చూసింది. అందంగా వికటంగా నవ్వింది.

"హుఁ! సిగ్గులేపోతే సరి! మీకు మరో సంవత్సరంలో డిగ్రీ వస్తుంది. ఇంకా ఇరుకైన పేంట్లొస్తాయి. కాని లేని సంస్కారం మనసూ రావు. పైకి మంచిగానే వుంటారు. మీ లాంటి చెడ్డవాళ్ళనీ, రౌడీలనీ, - నేనే కాదు ... ఎవరూ క్షమించలేరు. అంతే, వెళ్ళిపోండి, ఇకమీద మీకు బుద్ధొస్తే మంచిదే. కాని రాదని నాకు తెలుసు! వైజాక్కి స్టీలు ప్లాంటయినా వస్తుంది గాని మీకు బుద్ధిరాదు" అందామె జోరుగా....

నాగరాజు మొదట విపరీతంగా వొణికేడు. తర్వాత భయపడ్డాడు. ఇంకా ఎక్కువ ఆశ్చర్య పడ్డాడు. భయంగా, ఆశ్చర్యంగా చూశాడు. కన్నీళ్ళకో డిగ్రీ తక్కువగా ఏడ్చేడు.

అక్కణ్ణించి వచ్చేశాడు. ప్రతిచిన్న విషయానికీ పెద్దగా విచారించే నాగరాజుకి - ఆ సంఘటనా, ఆ మర్నాడే విషయం తెల్సినతన స్నేహితులందరూ పెట్టిన చీవాట్లూ, బూతుపేర్లు బాగా బాధపెట్టాయి. కనిపించని కన్నీరు కళ్ళల్లో మసగా పుట్టి, మున్నని, తెల్లని బుగ్గల మీదుగా పాకి, గడ్డం పక్కనుంచి జారి టీ షర్టు రంగులో కలిసిపోయింది. చాలాసార్లులాగే మనసు బావులేని నాగరాజు, ఆ పొద్దున్న క్లాసులూ, మధ్యాహ్నం భోజనం మానేశాడు. సాయంత్రం అవనిచ్చి మనసులో బాధ కొంచెమైనా మాసి పోతుందని బీచి కెళ్ళాడు.

బీచిలో చల్లగా వుంది. సముద్రం మనసులో బాధలా విశాలంగా వుంది. నీ కోసం ఎవరు బాధపడ్డా లేకపోయినా నే నున్నా నన్నట్టు ఇంకా కొత్తగానే వున్న 'పాత' లైట్ హౌసుంది. ఎప్పట్లాగే వెలగని మునిసిపల్ దీపాలూ, ప్రతి అర నిమిషానికి పడుతున్న సెర్చిలైటూ వున్నాయి.

నాగరాజు ఇసకలో కెళ్ళి కూర్చున్నాడు. ఆకాశంవేపు చూశాడు. ఆకాశవూ, సముద్రంలాగే విచారమంత విశాలంగా వుంది. చంద్రుడూ, నక్షత్రాలూ, లైట్ హౌసూ, ఘోరంగా, భయంకరంగా ఏడుస్తున్న సముద్రపు కెరటాలూ, అన్నీ విచారంగానే వున్నట్టున్నాయి. అప్పుడు నాగరాజు విచారంగానే కళ్ళు మూస్కున్నాడు. "భగవంతుడా! నేను చేస్తున్నవన్నీ మంచి పన్లేనని నాకు తెలుసు. చెడ్డపన్లు చేయకపోయినా అందరికీ చెడ్డవాడినిలాగే కనబడుతున్నాను. చిన్నప్పట్నుంచి చేసిన మంచి పన్లన్నీ అందరికీ చెడ్డ పనుల్లాగే కనపడుతున్నాయి. అలాగని, ఇలాంటివన్నీ చేయడం మానలేనేమో! ఐనా వీళ్ళంతా మనుషులు! వీళ్ళకన్నా బాగా నా కన్నీ తెలుసు. వీళ్ళందరికీ నన్నర్థంచేసుకునే మనసుల్నియ్యి! నాకొంచెం అదృష్టాన్నియ్యి. నువ్వే నన్ను కాపాడు." అని దేవుణ్ణి అతి అమాయకంగా ప్రార్థించాడు నాగరాజు.

ఆ తర్వాత, తనకున్న మంచి మన

సుని, చేసిన మంచి పనుల్ని, కలిగిన చెడ్డ ఫలితాల్నీ ఊహించి అతిదీనంగా నవ్వుకున్నాడు నాగరాజు.

★ ★ ★

ఇంతలోనే నాగరాజు భుజంమీద ఎవరిదో చెయ్యి పడ్డది.

నాగరాజులిక్కి పడ్డాడు.

పక్కనే చతికిలబడ్డ ఆకారం వైపు చూశాడు. గళ్ళ షర్టూ, అరని చిర్నవ్వూ, గీసేసినతరవాత కొంచెం పెరిగిన మీసాలూ, వున్న గుర్నాధాన్ని చూసి "గుర్నాధవాఁ!" అని లేవ బోయాడు నాగరాజు.

గుర్నాధవంటే—కాలేజిలో కొత్తగా చేరిన లెక్చరర్ల కతను అరివీర భయం కరుడు. అమ్మాయిల పాలిట దుశ్శా సనుడు. అతను సాధారణంగా కాలేజీకి రాడు. మొదటి రోజుల్లోనే వస్తాడు. వచ్చి కొత్త లెక్చరర్లనీ, అమ్మాయిల్నీ 'ఓ చూపు' చూసి వెళ్లిపోతాడు. ఆ తర్వాత మరేవీఁ పన్లేక పోయినా, తోచక పోయినా కాలేజీకి వస్తాడు. ఐనా అందరూ అతనికి తెలుసు. అంద రికీ అతను తెలుసు. అమాయకులూ, వయసులో చిన్నవాళ్ళు ఐన స్టూడెంట్లు తని ధైర్యంగురించీ,అడ్వెంచర్ల గురించి కథలుగా చెప్పుకుంటూరు.

అలా...., భయపడి లేచి పోబో తున్న నాగరాజున్చూసి, "కూర్చో వయ్యా రాజు! నీ కోసవేఁ వెతు క్కుంటూ వస్తున్నాను. నీతో మాట్లా డాలి.కూచో." అన్నాడు.

నాగరాజు కూర్చున్నాడు.

జేబులోంచి సిగరెట్టు పెట్టె, అగ్గి పెట్టె, జీడిపప్పు పేకెట్టు తీశాడు గుర్నాధం.

"చూడు, బాబ్జీ, ఈ జీడిపప్పు తిను. ఈ సిగరెట్టు కాల్చు. జీడిపప్పు తొక్కలూ, కాల్చేసిన తరువాత సిగ రెట్టూ పారెయ్! కాని నే చెప్పబోయే మాటలు మాత్రం బతికున్నంతకాలం జాగర్తగా గుండెల్లో దాచుకో" అని గుర్నాధం జీడిపప్పు, సిగరెట్టు, అగ్గి పెట్టె నాగరాజు చేతి కిచ్చాడు.

ఎప్పుడూ సిగరెట్టు కాల్చని నాగ రాజు, కొంచెం జీడిపప్పు తిని సిగ రెట్టు వెలిగించాడు.

"నాగరాజూ! ఇవాళ నే నలా కాలేజీ కెళ్ళేను. అంతా విన్నాను.... నిన్నేవీఁ చేయను భయపడకు. అది సర్లే! కాలేజీ కెప్పుడూ రాకపోయినా, నీ మనసూ, అంతరం నాకు తెలుసు. నువ్వొట్టి వెర్రిపీనుగవి....ఏఁవీఁ అను కోకు ఇలా అంటున్నానని, ముందు నా కథ విను....

నేనూ నీలాగే మంచిగావుండేవాణ్ణి. నాసుఖాలూ, అవసరాలూ త్యాగంచేసి ఇంకోడికి సహాయం చేసేవాణ్ణి.అయితే అలా చాలాసార్లు చేసేక....హఠాత్తుగా నాకోవిషయం తెలిసొచ్చింది. జాగర్తగా వినీ విషయం. మనుషు లెవర్లోనూ మంచితనం లేదు. నీ లో మంచితనం అర్థం చేస్కొనే స్తోమత కూడాలేదు. వీళ్ళెవరూ నిజమైన మనుషులు కారు. వీళ్ళకున్నవి గుండెలుకావు. మరోడి

మంచితనం చూసి మండిపడతారు. నీలా టమాయకులు వీళ్ళతో వేగలేక పడేడుస్తుంటారు.

అదీ మనిషి మంచితనానికున్న స్టేటస్ ! అంచేత ఏమిటి తేలిందీ అంటే మంచిగా వుంటే నిన్ను బతకనివ్వరు. విన్నావా అదీకథ. అంచేత అబ్బీ ! మంచితనంతో నువ్వేదో ఉద్ధరించేస్తావనుకోవడం వొట్టి మూర్ఖత్వం. నామాట విని నువ్వూ మారిపో ! బతకడం, నీ సుఖాన్ని నువ్వు వెతకడం నేర్చుకో .. అని ఆగాడు గుర్నాధం.

"గురువుగారూ ! మీరెంత ధైర్యం చెప్పేరు ? మీరెంత మంచివారు" అన్నాడు నాగరాజు. గుర్నాధం గట్టిగా నవ్వి "లే పోదాం" అన్నాడు.

మంచితనాన్ని నమ్మి చాలాసార్లు మోసపోయినా, నాగరాజుని మంచితనం, మంచితనాన్ని నాగరాజు వదల్లేదు.

అలా చాలాసార్లు జరిగిన తరువాత కొన్నేళ్ళు గడిచి కొన్నాళ్ళయింది. మావయ్యగారింటి నించి వచ్చేసిన నాగరాజుకి పూర్తిగా చచ్చిపోని అదృష్టం _ ఓ పెద్ద కంపెనీలో ఉద్యోగం _ ఓ రెండొందల రూపాయలెడ్వాన్సూ, ఆఫీసు దగ్గర్లోనే ఓ గదీ_ ఇవన్నీ ఇప్పించింది.

నాగరాజు చాలా సంతోషించాడు. ఏ రోజు పనా రోజు చేస్కొంటూ, ముష్టివాడి దగ్గర్నించి, దేవుడి దాకా ఎవరకీ లేదనకుండా గడుపుకొంటూ వస్తున్నాడు.

ఓ రోజు సాయంత్రం వర్షం పడుతున్నప్పుడు, ఆఫీసు నుంచొచ్చి, కాఫీ తాగి, సిగరెట్టు కాలుస్తూ, మంచితనం గురించీ, మనుషుల గురించీ బాగా ఆలోచించిన తరువాత నాగరాజు ఓ నిర్ణయానికొచ్చాడు. అదేవిటంటే _ వీలైనంత వరకూ ఎవరితోనూ మంచిగా వుండకూడదని.

అలా నిర్ణయించుకొని, సిగరెట్టు పొగ ఘాటుగా పీల్చి, వొదిలాడు.

ఇంతలోనే పొగలో ఆచారి కనబడ్డాడు. నాగరాజు గాభరాగా లేచి నిల్చున్నాడు. ఆచారంటే సామాన్యుడు కాడు. ఆఫీసులో కో క్లర్కైనా, అతనంటే నాగరాజుకీ, చాలామందిలాగే భయంవుం. అందువల్ల గౌరవవుంన్నూ. ఆచార్ని చూడగానే సిగరెట్టు పారేసేడు నాగరాజు. "రండి రండ"ని ఆచార్నాహ్వానించాడు. మా రూం పావనమైందన్నాడు. పడక్కుర్చీలో ఆచార్ని కూచోబెట్టి బలవంతాన కాఫీ కలిపిచ్చేడు. తను గోడ దగ్గరే నిలబడి, ఆచారి కాల్చమన్నాక ఓ సిగరెట్టు ఆచారి కిచ్చి తనోటి ముట్టించేడు. "చెప్పండి గురువుగారూ ? ఏం పెల" వన్నాడు.

ఆచారికి నలభై పైన వయసుంటుంది. మొహంలో చెప్పలేనంత అనుభవం, కొన్ని చెప్పగలిగినన్ని ముడతలు వుంటాయి. దళసరి నల్లని పెదవులు, భయాన్ని పుట్టించే కళ్ళు. వాటిపైన వో కళ్ళజోడూ వుంటూనే వుంటాయి. తన పని చేసుకోడంకోసం ఎంత పనైనా చేయగల్దతను. శ్రీ కృష్ణ

భగవానుడు భూమ్మీద కనబడితే భారత యుద్ధానికి నల్లాయనే కారణం. కుర్ర వెధవ అభిమన్యుడి చావుకి ఈయనే కారకుడు. ఈయన మా గొప్ప మాయలమారి. దొంగ. పదహారువేల ఆడవాళ్ళని మరిగినవాడు" అనింకా అనేక విధాల పొలైట్‌గా బూతులు తిట్టి, ఆ తర్వాత తైరుకొట్టి కృష్ణుడి దగ్గరే వరాలు కొట్టగల్గతను.

నాగరాజు మాట విని ఆచారి సిగ రెట్టు దమ్ము ఘాటుగా పీల్చేడు, ఇకి లించేడు. ఆ తర్వాత ఏడుపు మొహం పెట్టాడు.

"కష్టాల్లో వున్నా న్నాగరాజూ ! నీకు సంసారవూ( కష్టాలనుభవమూ లేవు. అర్జంటుగా నాకో పాతిక రూపాయలు కావాలి. ఫస్టు తారీఖుకల్లా నీ డబ్బి పీకిచ్చేస్తాను. నామాట నమ్మి, నన్నీ కష్టాన్నుంచి రక్షించాలి. అదీ కథ" అన్నాడు.

నాగరాజు మనసంతా అల్లకల్లోల మైంది. ఎవరితోనూ మంచిగా వుండ కూడదన్న తననుకున్న మాట నిజమే .. కానీ తోటిమనిషి కష్టాల్లో వున్నాడు. తనదగ్గర డబ్బుంది. అంత పెద్దవసరం తనకే(వీ( లేదు. ఆచారి . . పాపంఎన్ని కష్టాల్లో వున్నాడో! ఏమి(టో!

"ఏవి( టాలోచిస్తున్నావయ్యా ! ఫస్టుకల్లా నా తలైనా తాకట్టుపెట్టి డబ్బిచ్చేస్తాను. ఇది మాత్రం చాలా అవసరం." అన్నాడాచారి. అలా అంటున్నప్పుడు. అతనిమొహం చాలా జాలిగా పెట్టేడు.

నాగరాజు చాలా తక్కువ సమయంలో ఎక్కువసేపు ఆలోచించేడు. అతని బుర్రలో కాస్సేపు చిన్నసైజు సైక్లోను చెలరేగింది. ఆఖరికి.

"ఉండండాచారి గారూ !" అని లోపలికెళ్ళి పాతిక రూపాయలూ తీస్కొచ్చి ఇచ్చాడు.

ఆచారి డబ్బి లెఖ్ఖపెట్టుకున్నాడు. తర్వాత జేబులో పెట్టుకొని "థ్యాంక్స్‌య్యా !" అని చెప్పి వెళ్ళిపోబోయాడు.

"ఉండండి" అని నాగరాజు ఆచారితో వెళ్ళి బస్ స్టాప్ దాకా దిగబెట్టి వచ్చాడు.

బస్‌స్టాప్‌దగ్గర ఆచార్నీ, నాగరాజునీ కలిసి చూసిన హెడ్‌క్లర్క్ వరదానం, నాగరాజు విష్ చేసినా చూడకుండా వెళ్ళిపోయేడు. నాగరాజు ఆ విషయం గురించే ఆలోచిస్తూండగానే బస్సొచ్చింది. ఆచారందులో వెళ్ళిపోయేడు. ఆలోచనకి జవాబు మర్నాడాఫీసులో లంచ్ టైంలో తెలిసింది నాగరాజుకి.

దగ్గరికొచ్చిన వరదానం వైపు, మరిద్దరి క్లర్కుల వైపు నాగరాజు మొహమాటంగా చూసి, మొహమాటంగానే నవ్వి లేచి నిల్చున్నాడు. హెడ్‌క్లర్కుగారు, రహస్యం చెప్తున్నట్టు వొంగి. "ఏవ(య్యా; ఆచారికి నిన్న డబ్బిచ్చేవా ? అందుకేనా వాణీరూము కొచ్చింది ?" అనడిగాడు. నాగరాజుకేవ(నాలో తెలిసింది కాదు. ఆవేళాచారిఆఫీసుకి రాలేదు కూడాను.

కాస్సేపు కంగారు పడి "ఏవండీ?" అన్నాడు నాగరాజు.

"ముందిది చెప్పవయ్యా! అంతేనా జరిగింది?" అని గద్దించేడు వరదానం.

"ఔనండీ!" దీనంగా అన్నాడు నాగరాజు. "చాలా అవసర మన్నాడు" అని కూడా నీరసంగా అన్నాడు.

"ఊహూ! నువ్విలాటి వాడి వను కోలేదు అన్నాడు మళ్ళీ.

"ఏవండీ?" అని దీనాతిదీనంగా అన్నాడు నాగరాజు. అప్పు డతను నాలుగు రోజుల్నుంచీ తిండిలేని నవ భారత వారసుడిలా వున్నాడు.

"ఏవా" నువ్విచ్చిన నోట్ల నంబర్లు జ్ఞాపక వున్నాయా? ఉంటే వెళ్ళి చూడు. ఆ డబ్బెక్కడుంటుందో చెప్తాను విను. నాగరత్నం కంపెనీ లోనూ, పైడితల్లిగాడి సారాబట్టీలోనూ వుంటుంది. అర్థమైందీ?" అన్నాడు వరదానం. దానికి పక్కనున్న క్లర్కు లిద్దరూ జోడెద్దుల్లా తల్లూపేరు.

"ఆచారి నీతో వచ్చేడంటేనే అను కున్నాను. ఐనా, నీకూ, వాడికీ ఏలావా దేవీ లున్నాయో." అని ఈసడింపుగా చూసి వెళ్ళిపోయా డాయన. క్లర్కు లిద్దరూ, నాగరాజుని ఈసడింపుగానే చూసి ఆయ న్ననుసరించేరు. నాగ రాజుకి మొదటేవీ అర్థమవలేదు. తర్వాత కొంతసేపటికి అర్థమైంది. అర్థమయ్యాక మళ్ళీ ఏడుపొచ్చింది. "ఒక మనిషిగా తనాచారికి సహాయం చేసేడు. ఐతే వీళ్ళ కెందుకీ ఏడుపు? ఎందుకు తన్నిలా బాధ పెట్టారు?" నాగరాజు కళ్ళలో కన్నీటి చుక్కోటి మళ్ళీ మెరిసింది.

* * *

ఆ సాయంత్రం విచారంగా లైటు వేసుకోని గదిలో చీకటిలాగే కూర్చొన్న నాగరాజుకి బాగా పరిచయముండి ఎద మైన స్మృతులమధ్య దాక్కొన్న అడు గుల సవ్వడి వినిపించింది.

ఆ తర్వాత గదిలో లైటువెలిగింది. ఎదురుగా తెల్లని టెర్లిన్‌చీరా, నల్లని సిల్కు జాకెట్టూ, తీక్షణంగా చూస్తున్న రెండు అందమైన కళ్ళూ కనిపించేయి. కొన్ని సెకన్లు వెలుగులో కలిసి పోయాయి.

"సుమతీ!" అన్నాడు నాగరాజు.

"ఔను బావా! నేనే! నువ్వు మరిచిపోయినా, నేన్నిన్నంత సులభంగా మర్చిపోలేక పోయాను. మనసివ్వడమే కాని మనసిచ్చినవాణ్ణి, మనసిచ్చినంత తేలిగ్గా స్మృతుల్లోంచి తొలగించుకోలేక పోయాను." అంది సుమతి. అలా అంటున్నప్పుడామె, మరీ అందంగా మెరిసింది.

నాగరాజు కంగారుపడ్డాడు. కంగారు పడి కుర్చీలోంచి లేచేడు.

"కూర్చో సుమతీ." అన్నాడు. సుమతి కూర్చోలేదు." ఒద్దుబావా! కూర్చోనక్కర్లేదు. నిన్ను చూదామని వచ్చేను. చూశేను. అంతేచాలు."

నాగరాజుకి వొళ్ళుసారిగా ఏడు పొచ్చింది.

"నన్ను క్షమించు సుమతీ! మనసీ

మధ్యేమీఁ బావులేదు. నువ్వు జ్ఞాపక మొచ్చావు. రోజూ వస్తూనే వున్నావు. కాని, . అంతే. నా మనసేం బావు లేదు. ఎవ్వరికీ నే నక్కర్లేదు .. నే నందరి దృష్టిలోనూ పనికిమాలిన వాణ్ణి సుమతీ! నువ్వూ నన్ను క్షమిం చకు!" అన్నాడు నాగరాజు. అలా అంటున్నప్పు డతనికళ్ళు చెమ్మగిల్లేయి.

"బావా!" అని కంగారుగా అంది సుమతి. దగ్గరగా వచ్చి కళ్ళు తుడి చింది.

"పిచ్చిబావా! ఏడుపెందుకు? పరి స్థితుల్ని ధైర్యంగా ఎదుర్కోడం నేర్చుకో" అని చిన్నగా నవ్వింది.

నాగరాజు సుమతివైపు వెర్రిగా చూశేడు. తనకన్న చిన్నదైన ఓ అమ్మాయి తనకి ధైర్యం చెప్తోంది!

మరో పది నిమిషాలు వెనక్కి వెళ్ళిపోయాయి.

సుమతి లేచింది. వెళ్ళి తలుపు దగ్గరగా వేసి గడియ పెట్టింది. నాగ రాజుకి దగ్గరగా వచ్చింది.

"బావా! మళ్ళీ నువ్వు నాకు దక్కుతావన్న ధైర్యంలేదు. ఆఖరి సారి ఓ వరం(వడుగుదామని వచ్చాను బావా!" కాదనవు కదూ?" అంది.

"అదేవిఁటి సుమతీ! తప్పకుండాను. అడుగు." అన్నాడు నాగరాజు.

నాగరాజుకి బాగా దగ్గరగావచ్చింది సుమతి. ఆమె వూపిరి స్పష్టంగా నాగ రాజు చెంపలకి తగుల్తోంది.

"నా జీవితంమీదా, భవిష్యత్తుమీదా నాకే ఆశాలేదు బావా! ఉన్న ఒక్క ఆశవీ నువ్వే! నీనుంచి మరేవీఁ ఆశిం చను బావా! నీ అందమైన కళ్ళలోకి చూస్తూ, నీ పెదవుల్తో ఆడుకొంటూ, ఎల్లకాలం వుండిపోవాలనివుంది. కాని.. అది వీల్లేదు. కనీసం కొంతసేపైనా, నాకా అదృష్టం ప్రసాదించు బావా!" అంది సుమతి.

నాగరాజు నరాల్లో నాగుపాములు బుస కొడుతున్నాయి.

"సుమతీ!" అని ఆమె రెండు చేతులూ గట్టిగా పట్టుకున్నాడు.

"బావా" అనిఆవేశంగా నాగరాజును గట్టిగా హత్తుకుంది సుమతి.

"కానీ . సుమతీ ..మామయ్యతో నే మాట్లాడతాను, ఇదితప్పు .నిన్ను పెళ్ళి చేసొ్కంటాను. ఇలాగ! తప్పు." అన్నాడు నాగరాజు.

"ష్." అని సంజ్ఞ చేసిందిసుమతి.

ఇంకా ఏదో మాట్లాడబోతున్న నాగ రాజు పెదవులు, మరో రెండు పెదవుల వెచ్చని ఒత్తిడి మీద పడ్డంతో ఏఁవీఁ అన్లేక పోయాయి.

మరి కాసేపట్లో గదంతా చీకటై పోయింది.

నాగరాజు కళ్ళముందు మాత్రం ఎన్నో తియ్యని మెరుపులు మెరవ నారంభించాయి.

* * *

సిగరెట్టు కాల్తోన్న నాగరాజు చెయ్యి తలమీద వుంది. నాగరాజు, చాపమీద వున్నాడు. అతని మనసులో బోలెడాలో చనలున్నాయి.. చాప పక్కనే శుభ లేఖ వుంది. శుభలేఖలో సుమతి పేరు పక్క మరెవరిదో పేరుంది.

అందువల్ల నాగరాజు తల పట్టుకున్నాడు. సుమతికి మరొకడితో పెళ్ళి ఏటి? తనకి వెచ్చని అనుభవాల్నిచ్చిన సుమతి పెదవుల మీద మరెవరివో పెదవులు. ఆ కళ్ళలో మరెవరివో కళ్ళు.

నాగరాజుకి చాలా బాధ వేసింది.

బాధని కాసేపు కన్నీళ్లలో తడిపిన నాగరాజు, ఒక నిర్ణయానికొచ్చేడు. వచ్చి ఆ రోజు సాయంత్రం వాలు కుర్చీలో జూలో సింహంలా కూర్చున్న వాళ్ల మావయ్యకి ఎటాకిచ్చేడు నాగరాజు.

"మావఁయ్యా!" అని గంభీరంగా అన్నాడు నాగరాజు.

"రారా. అబ్బీ! కూర్చో! చాలా రోజులకి" అన్నా డాయన.

"కూర్చోడానికిరాలేదుమావఁయ్యా" అని నాగరాజు అందామనుకున్నాడు. కాని అనలేకపోయాడు. మామూలుగానే కూర్చున్నాడు. ఆ మాటా ఈ మాటా చెప్పి "పై మాఘంలోనే అమ్మాయి లిద్దరికీ పెళ్ళిళ్ళు చేసేస్తున్నా న్రోయ్! విన్నావా?" అని మృగరాజు మృదువుగా నవ్వినట్టు నవ్వేడాయన. అలా అన్న మావఁయ్య కళ్ళలో సూటిగా చూశాడు నాగరాజు.

లేని ధైర్యాన్నీ, బలాన్నీ తెచ్చుకున్నాడు.

"విన్నాను మావఁయ్యా! అందుకే వచ్చాను. సుమతిని నేను చేసోక్కోవాలనుకుంటున్నాను" అన్నాడు.

ఆ మాట విని మామయ్య వాలు కుర్చీలోంచి లేచేడు. కళ్ళజోడు ముక్కుమీంచి ఎగదోసుకున్నాడు. పంచ సర్దుకున్నాడు. నాగరాజుని నాగుపాముని చూసినట్టు చూసేడు. "ఏవిఁటీ?" అన్నాడు. ఓ నిముష వాఁగి "ఏవిఁ టేవిఁటీ?" అన్నాడు.

"నే నీ విషయమంతా ఆలోచించాన్రా అబ్బీ! కాని నీ జీతం రెండొందలు. ఇప్పుణ్ణేను మా సుమతి నియ్యబోయే వాడికి చూశేవ్—మూడొంద లీతం. ఓ స్కూటర్ బండీ! నీలా వుంగరాల్జుత్తు లేదు కానీ .. నీకు లేవి ధైర్యం, బెంగుళూర్లో ఓ మంచి బంగళా, డబ్బుల్నొల్లుకునే నేర్పూ వున్నాయి. ఇక నువ్వు .ముఖం మీ చ్చెప్పేస్తున్నా. ఏవీఁ అనుకోకు .. ఒట్టి అర్భకుడివి. బతకడం రాదునీకు.. అంచేత. .పువ్వుల్లో పెంచిన్నాకూతుర్ని నీ కివ్వలేను. నువ్వు సంపెంగపువ్వుల్లో పెట్టుకుంటానన్నా . డబ్బు లేనప్పుడు ఆ పువ్వుల కిందనుంచి పాములొస్తాయి. అదీ....అర్థమైంది కదూ?

వెళ్ళి పెళ్ళికి నవ్వుతూవచ్చి, ఓ డ్రింకు తాగి, నవ్వుతూ వెళ్ళిపో! నా మాటలకి వేడెక్కిపోతే ఇప్పుడే ఓ డ్రింకు తాగు. ఇలా పిచ్చిమాటలు మాత్రం మరెప్పుడూ ఆడకు ." అన్నాడాయన.

"కిందటి జన్మల్లో ఈయనే శకుని.. ఈయనే కంసుడు....ఈయనే శిశు

పాలుడు ఈయనే నా మావయ్య అనుకున్నాడు నాగరాజు.

ఆ తర్వాత ఇంకా చాలా అనుకున్నాడు.

సుమతిని తన కివ్వనంటే ఫరవా లేదు. కాని .సుమతి తన సర్వస్వాన్నీ, శరీరాన్నీ, తన కర్పించింది. ఇప్పుడు సుమతిని మరెవ్వరికో ఇచ్చేయడం అన్యాయం ఆ సంగతి వీళ్ళ కెలా చెప్పడం ? ఎలా ?

"మావయ్యా ! నీకు తెలీదు. సుమతీ నేనూ '"అనిఅ. బోతున్న నాగరాజు గుమ్మంలో, "బావా " అన్న సుమతి కేక విని ఆగిపోయేడు.

"సుమతీ! వీళ్ళంతా మన కన్యాయం చేస్తున్నారు. నువ్వూ నేనూ !!వూ"

"బావా ! అనవసరంగా మాట్లాడకు అంతా విన్నాను. నాన్నదే నిజం నువ్వెంతో మంచివాడి వనుకున్నాను. అత్తయ్య కొడుకైనంత మాత్రాన నా కిష్టం లేనప్పుడు నీకా అధికారం ఎవరిచ్చేరు ? అనవసరంగా మమ్మల్ని రచ్చకీడ్చకు. వెళ్ళిపో. ." అంది సుమతి.

నాగరాజు బుర్ర గిర్రు నిరిగింది.

"ఐతే సుమతీ ! నేనంటే నీకు ." అన్నాడు నాగరాజు. ఆ తర్వాత మాట రాలేదు కన్నీళ్ళొచ్చేయి.

"వెళ్ళిపో బావా ! మరేవీ మాట్లాడకు"అని వెనక్కి తిరిగి పోయిందీ సుమతి.

నాగరాజుకి మావయ్య మాటలేవీ వినబళ్ళేదు . కన్నీళ్ళలోంచి రోడ్డంతా మసగ్గా అవుపించింది. మెదళ్ళో మెగాటన్నులు పేలుతున్నాయి. అర్థంలేనిబాధ భయంకరంగా రోదిస్తోంది. అందువల్ల .

★ ★ ★

చంద్రుళ్ళేని ఆకాశం నల్లగా మెరుస్తున్నప్పుడు, వూళ్ళో చాలామంది ముఖాల్లో చిర్నవ్వులేనప్పుడు, మనుషుల్లేని బీచిలో, సూదుల్లాటి చినుకుల్లో తడుస్తున్న నాగరాజు—

"భగవంతుడా ! నువ్వున్నావో లేదో నాకు తెలీదు. కాని నే నన్నీ మంచి పన్లే చేశేను. ఇది మాత్రం త్రికరణ శుద్ధిగా చెప్తున్నాను. కాని నన్నెవ్వరూ అర్థం చేసోక్కలేదు. నన్ను చెడ్డవాడన్నారు. ఎడారిలాంటి ఈ కష్టాల పరంపరలో వో ఒయాసిస్సంత సానుభూతి కూడా నాకు లేకుండా పోయింది. నా మంచితనం చెడ్డతనంగా మారిపోయింది" అని విచారించి...ఆ తర్వాత తను చేసిన మంచి పన్లన్నిట్నీ వూహించుకొని సంతృప్తిగా వూపిరి పీల్చి, మళ్ళీ ఆ ఫలితాన్ని తలుచుకొని, నిట్టూర్చి పొంగుతూ అరుస్తున్న సముద్రం వైపు చూస్తూ అక్కడలేని దేవుణ్ణి వూహించుకొంటూ "ఏవయ్యా బాబూ ? ఏవిటీ న్యాయం ?" అని మొహమాటంగా కసురుకున్నాడు నాగరాజు.

★ ★ ★

వర్షంలో కాస్సేపు తడిసి, కన్నీళ్ళలో వాధల్ని కాస్తంత తడిపాక, నాగరాజు మనస్సు బరువు తగ్గక

పోయినా, కాస్త తేలికపడింది. కరువు తీరా ఏడ్చిన నాగరాజు, రూమ్ కొచ్చేశాడు. తలుపులు వేసి స్టౌ ముట్టించాడు. కాఫీకోసం నీళ్ళు పెట్టేడు. ఈజీ చైర్లో కూర్చొన్నాడు. బోలెడు సిగరెట్లతని చేతిలోనూ, బోలె డాలోచనలతని మెదళ్ళోనూ వెలిగేయి.

ఇంతలోనే స్టౌ మీద నీళ్ళు పొంగేయి. దింపుతున్న నాగరాజు వేళ్ళమీద వేణ్ణీళ్ళు పడ్డాయి. స్టౌ మీది గిన్నె కిందపడ్డది. నాగరాజు బరువుగా వచ్చి ఈజీచైర్లో పడ్డాడు. కుడిచేతి రెండు వేళ్ళు ఎర్రగా, భయంకరంగా మెరుస్తున్నాయి!

"ఇలాంటప్పుడు ఇలా మనసు బావు లేనప్పుడు లోకమంతా తనకి, తన మంచి తనానికి విరోధులైనప్పుడు, ఆప్యాయంగా, తనమనసుకి సానుభూతి మాటల్తోనూ, వేలికి దూదితోనూ బాండేజీలు కట్టే ఓ తోడూ ఓ యింత ఆప్యాయత వుంటే బావుణ్ణు!" అనుకున్నాడు నాగరాజు.

"సుమతిలాటి 'అమ్మాయి' కాదు. ఇంకెవరు? ఇంకెవరు? ఔను: ఓ చెల్లి! నాగరాజు మనసులో వెయ్యి వీణలు రెండు సెకన్లలోనే ఒకేసారి మోగాయి.

"బాబూ! గత్తుడమంటారా?"

నాగరాజు గుమ్మంవైపు చూశేడు. అక్కడ పదహారేళ్ళ పనిపిల్ల నిలబడుంది. ఆమె నుదుటిమీద నల్లటి అంగారపు బొట్టూ, చామన్చాయ ఒంటి రంగులో కళా వున్నాయి.

"ఏటి బాబూ! పగలుణ్ణేదు గద!" అంది పనిపిల్ల మళ్ళీ.

"ఆ! రా! రా!" అన్నాడు నాగరాజు కంగారుగా.

ఆమెవచ్చి గత్తుడవడం మొదలెట్టింది.

ఆమెవైపు నాగరాజు చూసేడు. ఆమెకళ్ళలో అందమైన అనుబంధం ఆమెచేతి వేళ్ళలో, 'తన చేతిక్కట్టు కట్టే ఆప్యాయత, ఆమె పెదవుల్లో దాగిన ఆప్యాయత, చిందేమాటలు .. లేని చెల్లెలు - ఆ పనిపిల్లలో నాగరాజుక్కనిపించింది. అప్పుడతనికిచాలా చాలా సంతోషం వేసింది. మళ్ళీ, అమ్మ బతికినట్టు, చెల్లి పుట్టి ఒక్కసారి పెరిగిపోయినట్టూ సంతోషించేడతను.

కాని .అదేవిటి! పనిపిల్ల చీర అక్కడక్కడ చిరిగిపోయింది గుర్తు లేకుండా మాసిపోయిన, ఆ నీలం రంగు చీర, అక్కడక్కడ చిరగడంతో మరీ అసహ్యంగా వుంది. నాగరాజుకి చాలా బాధ వేసింది. "తన చెల్లి ఇలాంటి చీర కట్టుకోవడమేమిటి?" అనిపించింది.

గబగబా ఫేంటు లోంచి వున్న రెండు పది రూపాయల్నోట్లూ తీశేడు నాగరాజు.

ఇంతలోనే పనిపిల్ల గది తుడవడం

పూర్తి చేసింది "ఎల్తాను బాబూ !" అని వెనక్కి తిరిగింది.

"రావీ" అని పిల్చేడు నాగరాజు.

"ఏం బాబూ !" అని వెనక్కు తిరిగింది రావి.

"ఇంద ! చీర కొనుక్కో—" అని రెండు పది రూపాయలనోట్లు ఆమె కందించబోయాడు నాగరాజు.

"బాబూ !" రావి దెబ్బతిన్న పులిలా మొహం పెట్టింది ముక్కుపుటా లెగరేసింది నుదుటిమీ జుత్తు తలమీదకి తీస్కొంది నాగరాజువైపు అనుమానంగానూ — కో పం గా నూ చూసింది.

"హుం ! కూటికి లేనోళ్ళంగాని అభిమానం లేనోళ్ళం కాం ! మీరేదో మంచోల్లనుకున్నాను ఇలా టిసప్పురు గనుకోలేదు. ఛూ ! మీ లాంటోళ్ళకన్న మా తాగుబోతు మావే నయం ! ఆడు తాగినా మరో ఆడ దానొల్లు ముట్టడు ! ఛూ తెరీ ! ఎందుకొచ్చిన పెద్ద మని సరహా ! ఈసారి కొగ్గేతున్నాను. బుత్తెచ్చుకోండి ! అని జోరుగానూ, ఘాటుగానూ అందామె. అవి చీపురు కట్ట నేలమీద పడేసి వెనక్కి తిరిగి గబగబా వెళ్ళిపోయింది

నాగరాజు కదల్లేదు అతని మన సంతా ఖాళీగా వుంది. కళ్ళు కూడా ఖాళీగానే వున్నాయి. అవి కన్నీళ్ళు కార్చలేదు అతని మనసు మాత్రం మూగగా ఏడ్చి, ఏదో అనబోయి, మళ్ళీ మానేసింది.

★ ★ ★

ఆ వేళాకాశంలో చంద్రుడున్నాడు. ఎంచేతంటే ఆ వేళ పున్నమికాబట్టి ! ఆ వేళ వూళ్ళో చాలామందిముఖాల్లో తెచ్చి పెట్టుకున్న చిర్నవ్వులున్నాయి — ఎందు కంటే — బంగారు తీగెల బియ్యం — బ్లాకులోనైనానూ — కాస్తంత సుఖం స్టాకులోనూ వున్నాయి కాబట్టి.ఆ వేళ బీచిలో చాలామంది మనుషులున్నారు— వర్షం తగ్గిపోయి పొడిగావుంది కాబట్టి !—

కాని ఎవరున్నా లేకపోయినా సూదుల్లాటి ఆలోచనల వర్షంలోనూ, సానుభూతిలేని బాధల్లాటి వడగళ్ల లోనూ, తడుస్తూ, ఏడుపంతా ఖర్చై పోయాక దీనంగా, వెర్రిగా నవ్వుతున్న నాగరాజుమాత్రం ఎప్పుడూ వుంటాడు.

★★★

---

# చందా దారులకు మనవి

పాత చందా దారులు తిరిగి చందా పైకం పంపే టప్పుడు మీ చందా నెంబరు, అడ్రసు వివరంగా వ్రాసి మాతో సహకరించ ప్రార్థన.

మేనేజరు, "జ్యోతి"

---

# అడవి మొకల




కలప కోసం ఏజన్సీలో తెల్లవారి గుర్రం వేసుకు బయలు దేరేడంటే, రామస్వామికి 'ఆ' అంటే అడవీ 'కో' అంటే కోనలూ తిరిగి తిరిగి పని చూసుకుని వచ్చే వేళకు ఏడెనిమిది గంటలకు పైన పట్టేది రామస్వామిని చూస్తే యితనికి కష్టాలు రాకూడ దని పిస్తుంది ఆ దట్టించి కట్టిన పంచెతో జీనుమీద చూడగానే అతని కోరమీసం ఆ చూపులోని ఒడుపూ, ఆమనిషిలోని చేవ, ఆ చేతిలోని హంటరు ఝళిపింపుకు అడివి అడివంతా లొంగిపోవలసిందే! అడివే లొంగిపోగా ఆడదనగా ఎంత? ఆడవాళ్ళ —

వాడి పక్కన ఉన్నది, పచ్చల పిడిబాకు
అది ఎదలో ఒకసారి అదిమినా
చాలోయి ..

ఉంగరాల జుట్టు రంగైన మగవాడు
కోసావ ఒకసారి కసరి తిట్టినచాలు !
అనుకుని
'మగవాన్ని కౌగింట మరణించినా చాలు
కంటికి కనబడితేనా వాడు - కదలునా
అడుగేసి '

అవి దారులు కాసేవారట ! అతని కోసం పౌరుగూళ్ళో పని కల్పిస్తే ఆ వ్యవహారం అర్థ మధ్యస్తంగా వదిలేసి ఎక్కడికో మాయమయి పోయేవాడు. ఆతన్ని తండ్రి వ్యవసాయంలో పెట్టాడు. వ్యవసాయం మన్నుకొట్టుకు పోయింది. వ్యాపారంలో పెట్టాడు. అది నీళ్ళకారిపోయింది. గోదారి గట్టు మీద గుర్రంమీద వచ్చే రామస్వామిని చూస్తే వెర్రిభ్రమచేత ఆడపిల్లలచేతుల్లో బిందెలు నీటిలో మునిగేవి కావు.

ఆ అడవులు, ఆ పల్లెలు, ఆ కొండలు, తాళ్ళు, అక్కడి ఏరులు, చిన్న చిన్న వాగులు సైతం తెలిసిన వాడు. అందులో ఎరుకలు, కోయలు, గదబలు కొండజాతి వారు అనేకులు ముఠాలు ముఠాలుగా జీవిస్తూ ఉండేవారు. ఉప్పు, అగ్గిపెట్టెలు, సూదీ దారం, అద్దాలు పట్టుకు వెళ్ళే వాడు. ఇతను వారంద రికీ యిష్టసఖుడు.

ఇలా ఉండగా _

జమిందారులు యుద్ధంలో అడివిని అమ్మేసి బంగారం పోగేశారు. రామ స్వామి అడివిలోనే మకాం పెట్టాడు. బంగారం లాటి అనుభవాన్ని పోగే శాడు.

అడవిలో ఒకచోట ఒక ఎత్తైన గుట్ట ఉన్నది. దాని మీద ఉన్న చెట్లు యిన్నీ అన్నీ కావు. ఆ ప్రక్కన ఒక కుంట ఉన్నది. అందులోకి ఎక్కడ నుంచి వస్తుందో తెలియదు కాని కొండ తాళ్ళ మధ్య బాటలలో నుంచి నిరంతరం నీళ్ళు కారుతూఉంటాయి. చుట్టూ మొక్కలూ మొటికలూఉన్నాయి. అటువంటి మరుగైనచోట ఒక సాయం త్రం యింటికి మళ్ళుతూ గుర్రానికి నీళ్ళు పట్టించటం కోసం త్రిప్పగానే-

అంతవరకూ గట్టుమీద యిసికలో కొంతా నీటిమీద కొంతా శరీరాన్ని జారవిడచి వెల్లకిలాపరుండి మబ్బుల్నీ, పాలపిట్టల్నీ, చెట్ల ఆకుల గలగలను వింటూ స్వప్నావస్థలో ఉన్న లంబాడీ చిన్నది చేపలా నీటిలోకి దిగజారింది. తలకట్టు, ఓరచూపులు యివే మిగి లాయి. రామస్వామి గుర్రంమీదనుంచే కమిచీతో చిన్నదాని దుస్తులు అంది పుచ్చుకొన్నాడు. ఆ వెర్రెత్తించే బుజాల వంపులకి, ఆ చిన్ని చిబుకానికి, నీళ్ళలో తడిసి ఎదురు రొమ్ములమీద ప్రాకుతూ ఆడుకుంటున్న ఆజుత్తుకీ దాసోహ మనక ఏమిచేస్తాడు ఏ మగ మహారాజు మట్టుకూ ?

ఆ బట్టల్ని చిటారు కొమ్మ న మిఠాయిపొట్లంలా కట్టి తనువు మరచి తాహతు మరచి నీటిలోకి దిగాడు ఉంగ రాల జుత్తు రంగైన మగవాడు రామ



స్వామి ఆ లంబాడీ చిన్నది ఆవలి తట్టునుంచి గట్టుమీదకు ప్రాకి రామస్వామి లాల్చీ పంచె పట్టుకుని పరుగెత్తింది, ఈ కవ్వింపుతో అడివి అడివంతా అర్థమయింది రామస్వామికి

పురూరవుడిలా వెంటబడి తరిమి తరిమి పట్టుకున్నాడు ఆ చిన్నదాన్ని

చెంపనా సంపంగి నూనె,

అంచునా చెంగల్వ మొగ్గ

ఏటివడ్డున యిల్లు కడదాం పదరా,
ఏరువస్తే యీది పోదాం పదరా
చల్ మోహనరంగా

అనుకున్నారు తరువాత వారికి లోకంతో నిమిత్తం లేకుండాపోయింది చెట్టాపట్టా లేసుకుని

వేళజాడ వెన్నెలాయె, వెండికల్ల
కిన్నెరాయె
మల్లెపూల పందిరాయె, వయ్యారి రావె
నవ్వులోనె తెల్లవారును !
కొండగోగులు పూసెనేమొ, కొండ
నిమ్మలు కాసెనేమొ,
దొండపండు లాంటి పెదిమె,
వయ్యారి రావె
మనసు ఎవరి పాలు జేతును ?
మల్లెపూవులు పూసినట్లు
మళ్ళి మళ్ళి మాటలాడు
మల్లెపూలవంటి మనసు వయ్యారి రావె
— పూవులెవరి పాలజేతును ?

అప్పుడు మేలినడల అందమైన వయ్యారివచ్చి గంధం పూయించుకునేది అడివిపూలు ముడిపించుకునేది. అడవిమొక్కకు అడివిపూలే అందం ' అంతా వింత వింత రంగులతో అలంకరించు కున్నట్లు, సృష్టి అంతా తమ

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

కోసమే వేచిఉన్నట్లు, గాలివీస్తే, ఆకు లల్లాడితే, పిట్టలుకూస్తే అవి తమ మోహాన్ని గూర్చే చెప్పుకుంటున్నట్లు, తోచేది రామస్వామికి

ఈలోగా గోదావరి వరద లొచ్చేయి. జీడి మామిడితోటలు మునిగిపోయాయి. వరద గోదావరికి కొబ్బరికాయలు కొట్టి అరటిపళ్ళు నైవేద్యం పెట్టి పసుపు కుంకుమా యిచ్చి జనులు మంగళ హారతులు పాడారు. ఏమని ?

'నూనె ధారకుమల్లె నురగాలు యెత్తుచు
పాల ధారకుమల్లె పరుగెత్తుచూ
ముల్లనక ముడికనక క్రనక కంపనక
చెలరేగి ప్రొద్దేడ కదిలేటి గంగా'

ఆ వరదల్లో రామస్వామి చేసిన తప్పు,' ఆ అడివిమొక్కను ఊళ్ళోకి తెచ్చాడు. ఊరు గుప్పు మంది

'కామార్తాహి ప్రకృతి కృపణా
స్చే తనా చేతనేషు'

కోడలు నరసమ్మ కాపురానికి వచ్చింది అని గింజుకున్నాడు రామస్వామి తండ్రి వెర్రి బాగులది తన కోక ఎత్తుకుపోతున్నా చూస్తూ ఊరుకునేది. మగ మహారాజు అను ఏమన గలదు ?

'బటానీల కోకమీద కన్నేసాదే !
సెనగపువ్వు రయికమీద చెయ్యేసాదే' అంటూ నాయుకికి వినిపించేలా గోలచేసే వారు కుర్రకారు. అనుభవాలు ఎవరికి మాత్రం కలగవు ? చేలల్లో, సంతల్లో, దొంకలమ్మట,

పుంతలమ్మట, గాదెల వెనకాల, గడ్డివాముల ప్రక్కన, వర్షంలో, ఎండలో, వెన్నెట్లో, చీకట్లో, ఎరుపో, తెలుపో, నలుపో, మనస్సులోనుంచి ఆత్మను చుట్టబెట్టే యీ లోకానుభూతులను ఎట్లా కాపాడుకోవాలో ఆఒడుపు తెలియని వాళ్ల లోకానికి బలిఅవుతారు వెంట అపప్రథలే మోసుగుని తిరుగుతారు. లంబాడీ చిన్నదానికి అద్దాల పరికిణీ జుబ్బాకి బదులు చీరా రవికా కట్ట బెట్టాడు.

తోటలో డాబాకి దాని మకాం మార్చి అడివితో విరోధం తెచ్చు కున్నాడు. ఊరు ఊరంతా అలిగింది.

ఆకుపచ్చని సిరాలాటి అడివిలో' నీలి నీలాంబరపు కప్పుక్రింద, కొండ కోనలలో చిక్కన అడవి మొక్క నాలుగు గోడల నాగరికతకు ఎదుర్తిరగ నారంభించింది.

ఇల్లరికం వెళ్ళిన నారాయణస్వామి తమ్ముడు కుత కుతా ఉడికి పోతున్నాడు. మరదలు లాంటి బందుగుల సంగతి సరేసరి!

ఆ ప్రణయం ఆ మోహం ఎలాటిదని తోట నడిగితే, తోట అంటుంది కదా —

'కళ్లలో ముద్దెట్టుతూ-తెల్లారనీ నంటదీ
తెల్లారి పోతుంటె తా - నెల్లాగొ
అయిపోతదీ' అని



రామస్వామి నడిగితే—

'చీకట్లో కేకెడతదీ, కేకెడుతు
కిందడతదీ
ఏకాడ తడుమూదురా ? ఆ కన్నె
అతి లేతరా !
పీకాను కాలేతునో ? - పయ్యేంట
చెయ్యెంతునో ?'

అని వాపోతాడు.

అడివి అంతా తిరగబడింది దాని వాళ్ళంతా దానికోసం వచ్చారు. అద్దమ రేతిరి నిద్దురలో లేపినందుకు గినిసి

'చిన్నాది పూదేనెరా—కవటాకులో
ఈనెరా
పున్నామి నెలబరణిరా —
ముమ్మొదట నా రాణిరా !'

అని సమాధానం చెప్పి చూశాడు కుదరలేదు దొమ్మిలో రామస్వామి బాణాకర్ర విరిగి పోగానే చీకట్లో రవి కల్లో యిముడని ఆ అడవి మొక్క వచ్చి అతడ్ని వాటేసుకున్నది

విసరిన కత్తిపోటుకు లంబాడీ చిన్నది చిలకలా ఉన్నది తోటలో నెత్తుడి మడుగులో తురాయి చెట్టులా కూలింది

'ఊదేస్తె గాలౌతదీ - రోదిస్తె నభమవు
తదీ
దరి తీస్తె సీరౌతదీ - బరిగీస్తె ధరణవు
తదీ

బౌగస్తే కర్ర కగ్గవుతదీ'- ఇగ నాకు దారే
దిరా ?'

అని చెప్పుకుని చెప్పుకుని ఏడ్చాడు రామస్వామి !

కామాంధుడవు ఫోప్ - పొమ్మంది లోకం

ప్రేమించకు ! అడవి మొక్కను ప్రేమించకు అని తోట చెప్పింది.

[షరా -

'నావపై పిల్ల' పాట వ్రాసిన కవి కొండల వెంకటరావు గారికి వందనాలు!

డాక్టర్ రామరాజు గారి జానపద గేయాల ధీసిస్సు ఎలా చదివానో నాకైతే జ్ఞాపకం లేదుకాని, అప్పుడు ఢిల్లీలో నోటు చేసుకున్నాను నాకు నచ్చిన పదాలను. వారికి చాలా థాంక్స్ గురువుగారు 'రామకృష్ణశాస్త్రిగారు వెళ్ళిపోయారనగానే మనస్సు చివుక్కు మని వ్రాశాను ఏదో ఉడతాభక్తి! ఇంకోటి మన కుర్రాళ్ళకు మంచి ప్రేమ కథ వోటి అందించాలనే ప్రయత్నం చేశాను పాత ఫక్కీలో అదీగాక కొత్త పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ మల్లెపందిరి క్రింద చదువుకుని ఆనందించేలా వ్రాయాలని కూడా తోచింది అంతే !]

— పురాణం సుబ్రమణ్య శర్మ

***

# పొట్టి కథలు

ఒక ముసలాయన పార్కులో సోఫా మీద ఒక్కడే కూర్చుని ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ ఆనందిస్తున్నాడు ఇంతలో ఆయనకి కొంత దూరంలో కూర్చున్న యువకుడు లేచి వచ్చాడు. ముసలాయన వద్దకు వెళ్ళి "టైమెంతయింది సార్" అని అడిగాడు.

ముసలాయన బదులు చెప్పలేదు పరధ్యానంగా వున్నట్టే మొహం పెట్టి కూర్చున్నాడు. యువకుడు ఆయనకి చెవుడేమో అనుకుని ఇంకా గట్టిగా అడిగాడు "టైమెంతయిందండీ" అని ముసలాయన తలెత్తి చూశాడుగాని మాట్లాడలేదు. యువకుడు విసుగు పుట్టి వెళ్ళిపోయాడు.

ఇదంతా చూస్తున్న మరొకాయన ముసలాయన దగ్గిరికెళ్ళి "మీ కు చెముడా ?" అని అడిగాడు

"లేదు "

"మరి ఆ అబ్బాయి అడిగిందానికి బదులు చెప్పలేదేం ?"

"ఇదుగో బ్రదర్, విను నామానాన నేను కూర్చుంటే ఆ కుర్రాడు ఎందుకు పలకరించాలి ? టైం చెబుతాననుకో ఏమవుతుంది ? పక్కన కూచుని ఏదో మాట్లాటం మొదలెడతాడు. నేనేదో మాట్లాడాల్సి వస్తుంది. అలా కొంత సేపు కబుర్లు అయినతరవాత మర్యాద కోసం నేను మా యిల్లు ఇక్కడికి దగ్గిరే కాస్త కాఫీ తాగి పోదువుగాని రావయ్యా అంటాను అతడు వస్తాడు. మా అమ్మాయి కాఫీ పట్టుకొస్తుంది. దానికి పదిహేడేళ్ళు అప్సరసలా వుంటుంది ఆ అమ్మాయిని వీడు చూసీ చూడగానే ప్రేమిస్తాడు వీడూ కాస్త ఎర్రగా బుర్రగానే వున్నాడు కనక మా అమ్మాయి కూడా వీణ్ణి ప్రేమించ వచ్చు నెమ్మదిగా బయట పెడతాడు మీ అమ్మాయిని పెళ్ళి చేసుకోవా లనుంది ఆ వ(టా అని.

అమ్మాయి కూడా అదే మాట అంటుంది నేను ఇరకాటంలో పడతాను మా అమ్మాయి మాట తీసెయ్యలేక. చివరికి పెళ్ళి చేయక తప్పక పోవచ్చు. అదుగో అక్కడే వస్తుంది చిక్కంతా చేతికి రిస్టువాచీ కూడా లేనివాడికి నా పిల్లను ఎలా ఇవ్వనూ అంట ?" అని ముసలాయన కోపంగా లేచ్చకా్క పోయాడు

* * *

ఒకడు కాఫీ హోటల్లోకి వెళ్ళి మొత్తం రూపాయి టిఫిన్ తిన్నాడు సర్వరు బిల్లు ఇవ్వగానే పళ్ళికిలించి నవ్వుతూ "డబ్బు లేదయ్యా" అన్నాడు జబర్దస్తీగా

# జాతీయ పొదుపు సర్టిఫికేట్లు

(మొదటి విడుదల)

సురక్షితమైన మరియు
లాభకరమైన పెట్టుబడి.

ఈ క్రింది డినామినేషన్లలో

రూ. 10 | 100 | 1,000

పది సంవత్సరముల తర్వాత

రూ. 18 | 180 | 1,800

పోస్టు ఆఫీసులలో దొరుకుతాయి

ఒక క్రొత్త రకమైన

జాతీయ పొదుపు సర్టిఫికేట్లు

(మొదటి విడుదల)

బ్యాంకు సీరీస్

అవే లాభాలతో

స్టేటు బ్యాంకు ఆఫ్ ఇండియా

బ్రాంచీలలో మరియు దాని అనుబంధ కార్యాలయాలలో లభిస్తాయి

DA 66/156



జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

సర్వారు "దానికేముంది తెండి గోడమీద మీరు రూపాయి బాకీ అని రాసుకుంటాను ఈసారి వచ్చినప్పుడు ఇద్దురుగాని" అన్నాడు

బావుందండోయ్ వచ్చిన ప్రతి వాడూ నా పేరు చూస్తాడు "

ఎవరూ చూడరు అక్కడో మేకు కొట్టి మీ చొక్కా అడ్డంగా తగిలిస్తాను" అన్నాడు సర్వరు

* * *

ఫస్టుక్లాస్ కంపార్టుమెంటులో ఇద్దరు పెద్ద మనుషులు ప్రయాణం చేస్తున్నారు పెట్టెలో ఇంకెవ్వరూ ప్రయాణీకులు లేరు ఒకాయనకి బోరుకొట్టి రెండో ఆయన్ని పలకరించాడు

మీరూ మెడ్రాసేనా వెళ్ళేది?

ఊహూ కాదు ఇదివరకోసారి మెడ్రాసెళ్ళాను నాకేం నచ్చలేదు

మొదటాయన ఎగరెట్టు తీసి వెలిగిస్తూ రెండోఆయనకి కూడా ఒకటివ్వబోయాడు

'ఊహూ ఇదివరకో సారి ఎగరెట్టు కాల్చాను నాకు పడదు

మొదటాయన కాసేపాగి "మీరేమన్నా వ్యాపారం చేస్తున్నారా?" అని అడిగాడు

ఊహూ ఇదివరకోసారి వ్యాపారం చేశాను నష్టం వచ్చింది

మళ్ళీ అయిదు నిమిషాలు మౌనంగా గడిచాయి

కాసేపు పేకాడుకుందామా?" అన్నాడు మొదటాయన

ఇదివరకోసారి ఆడాను నాకు అంత బాగా రాదు

ఒక అరగంట గడిచింది మొదటాయనకి ఇంకా ఆశ వదల్లేదు చేతి సంచిలోంచి జ్యోతి' తీసి "మంచి కథ లుంటాయి చదువుతారా?" అని ఇవ్వబోయాడు

ఊహూ ఇదివరకు ఓసారి చదివాను నాకు నచ్చవు మా అబ్బాయికి మటుకు మహా ఇష్టం

మొదటాయన కసిగా అడిగాడు

ఐహూంశా మీ కొక్కడే కాదు కమకుంటాను

***

.....వేపోతే మీ అందం చూసి -
- చేసుకున్నాననుకున్నారా?




అంతకన్నా తొందరంగాయివ్వావేరూ?
స్టార్ లాండ్రీ
8 గంటలలో


మహాయింటికేం వెడతారిప్పుడూ?
చేతులుకడుక్కోండి భోంచేద్దాం

# భిన్న మనస్సులు ప్రదర్శించగల సంధ్యారాణి




ఆదుర్తి సుబ్బారావు కొత్త తారలను పరిచయం చెయ్యడంలోనే కాక వారి బహుముఖ ప్రజ్ఞను వెలికితీసి చూపించడంలో కూడా దిట్ట.

"తేనె మనసులు"లో ముఖ్య తారలను కొన్ని కోణాలలో మాత్రమే పరిచయం చెయ్య గలిగారు. వారు కొన్ని కొన్ని తరహా భూమికలలో చక్కగా నటించగలమని ఒప్పించ గలిగారు.

తార అన్నాక సమగ్రమైన నటనా ప్రజ్ఞ పొంది వుండాలి. ఏ తరహా భూమికలనైనా పోషించగలగాలి. కనీసం నాలుగైదు రీతుల పాత్రలలో కొత్తవారు తమ ప్రజ్ఞను చూపితే ఇతర దర్శక నిర్మాతలు ఇట్టే వారిని తమ చిత్రాలకు తీసుకొని పోతారు. తారకు గట్టి పునాది, ఉజ్వల భవిష్యత్తు వుంటవి. అటువంటి తారలను పరిచయం చేశామనే సంతృప్తి, ఘనత కూడా వుంటవి. ఆదుర్తి సుబ్బారావు ఈ దృష్టితోనే "కన్నె మనసులు" పాత్రలకు తారలను నిర్ణయించినట్లు తోస్తున్నది.

ముఖ్యంగా సంధ్యారాణి విషయంలో ఇది ముమ్మాటికీ నిజం.

"తేనె మనసులు"లో నటించే సరికి ఈ తార మనసు వయసు 17 సంవత్సరాలు. కాన్వెంట్, కాలేజీలు దాటి వచ్చి నెలలే అయింది. అయినా ఒక గృహిణి వేషం, ఒక సంతాప భూమిక, ఒక భావప్రధాన (ఎమోషన్‌లో) పాత్ర సంతృప్తికరంగా నటించగలిగారు. భావోద్రేక భూమికలు ఇతర పాత్రల కంటె క్లిష్టమైనవి, బరువైనవి. పదిహేడేళ్ళ పిల్ల ఏ సావిత్రితో, ఏ భానుమతో, ఏ మీనాకుమారో నిర్వహించ వలసిన పాత్రను తొలి ప్రయత్నం లోనే ధరించడం, సంతృప్తికరంగా భరించడం సంధ్య ప్రజ్ఞకు ఒక నిదర్శనం.

ఇప్పుడు రెండవ చిత్రం "కన్నె మనసులు" లో గ్లామరస్ భూమిక ధరించారు. అదే పాడే "అల్లరి పిల్లా పిల్లా గారాబుబిడ్డ భూమిక ధరించారు. సంధ్యారాణి బహుముఖ ప్రజ్ఞను వెలికి తీయడానికి, వికాసం చెయ్యడానికి ఆదుర్తి, సుందరం ఆ భూమికను ఆమెకు ఇచ్చారు.

"తేనె మనసులు" ఎన్నికకు వచ్చినప్పుడు సంధ్యారాణి కంఠమాధుర్యానికి అబ్బురపడిన ఆదుర్తి "పాడుతావా?" అన్నారు. రెండు పాటలు కమ్మగా పాడేసింది ఎదురూ బెదురూ లేకుండా.

ఇప్పటికీ కమ్మగా పాడ గలదు. రేపే దైనా, సినిమాలో పాడినా, "ఆంధ్రా నూతన్" అని అన్నా ఆశ్చర్య పడనవసరంలేదు.

"ఆడుతారా?" అని అడిగారు. భరత నాట్యం నుంచి సినిమా నాట్యం వరకు ఆడుతానని సంధ్యారాణి అన్నది. చిన్నగదిలో అప్పటికప్పుడు అప్రయత్నంగా నాట్యం చేసింది. తర్వాత ఆమె అడుగులను, నడకను పరీక్షించారు. అవన్నీ 500 అడుగుల లోపు చిత్రంగా షూట్ చేశారు. ప్రదర్శించారు. సెలక్టెడ్ అన్నారు.

తండ్రి విజయవాడ సౌండ్ ఇంజినీర్ శ్రీ సి. యల్. నాయుడు. తమ పుత్రిక అభిరుచులను ఎరిగి సౌండ్ మెథడ్స్‌లో వాటి వికాసానికి తోడ్పడి పండిత నెహ్రూ, భారత చీఫ్ జస్టిస్ మొదలైనవారి యెదుట ప్రదర్శన లిప్పించి మెప్పు పొందిన కారణంగానే సంధ్యారాణి ఆదుర్తికి సినిమా పరీక్షలలో అవకాశం కలిగించారు.

'కన్నె' సంధ్యారాణి 'తేనె' మనసును ఆమె సమాధానాలలోనే గ్రహింపదగును :

మా మద్రాసు ప్రతినిధి ప్రశ్న : మీకు ఏ రకమైన భూమికలంటే యిష్టం.

సంధ్యారాణి జవాబు : ఎమోషనల్ రోల్స్ అంటే నాకు ప్రాణం. నటి ప్రజ్ఞా పాటవ పరీక్షకు అవే తగినవి.

ప్ర : అవి తప్ప మరేవీ ధరించరా ?

జ : ఏ భూమికనైనా, ఏ లక్షణాన్నయినా సలక్షణంగా ప్రదర్శించగలననే నా ధైర్యం. విగనిగల భూమిక, వినోద విలాసాల భూమిక (లైట్ రోల్) ఒకటేమిటి ఏదైనా ధరించగలను.

ప్ర : ఇప్పటికీ దర్శకుడంటే భయపడతారా ?

జ : ఆదుర్తిగారివద్దమాత్రం భయం లేదు. వారికెంతో ఓపిక. సినీ నటనకు సంబంధించిన ఏ బి సి డీ లన్నీ పిల్లలకు చెప్పినట్లు చెబుతారు. తండ్రి వంటివారు. మరే దర్శకుడివద్దనైనా నేను వణికితే వణకవచ్చుకాని ఆదుర్తి గారివద్ద మాత్రం అది జరగదు. జరగబోదు.

ప్ర : "తేనె మనసులు"లో బాగా నటించారా ? "కన్నె మనసులు"లో బాగా నటించారా ?

జ : రెండింటిలోను. అయితే రెండప హానిలో యాక్టింగ్‌లో వెరైటీ వుంది. ఎమోషన్‌కు ఎమోషన్‌వుంది. వినోదానికి వినోదం వుంది. సంతాపానికి సంతాపం వుంది. నాపై పగబట్టిన వ్యక్తిపై నేనూ పగబట్టుతాను. మగవాణ్ణి మించిన మగువను. తెగువకల మగువను. అఆలు రాని సేవకునికి విజ్ఞాన ప్రదానం చెయ్యదలచిన సంస్కారిణిగా కూడా అందులో నటించాను. జీవించాను అని అనగలను కాని ఆ నిర్ణయం ప్రేక్షకులకే వదిలేస్తున్నాను.

ప్ర : ఎన్నో షేడ్స్‌వున్న భూమిక



సంధ్యారాణి

ధరించా నంటున్నారు. ఏ ఘట్టంలో మీరు అద్వితీయంగా నటించానను కొంటున్నారు.

ఈ: విచిత్ర పరిస్థితిలో విద్యావ -యిన నేను నిరక్షర కుక్షి అయిన ఓ రజకుని ప్రేమిస్తాను. నాపై పగ పట్టిన వ్యక్తి పన్నిన కుట్ర ఫలితం అది. అయినా ప్రేమకు అఆలు,

రూపాలు కొలబద్ధ కాదు. ఆ రజకుణ్ణి పెళ్ళిచేసుకొంటా నన్నాను. పాపం పసివాడు భోరుమని ఏడుస్తాడు. వితా కరిస్తాడు నా సంపాక్ష్ర-శభావం, నా కార్యదీక్ష. నా పై పగపట్టిన దానిపై నే పట్టిన పగ వ్యర్థమౌతున్నందుకు నాలో నేను కుమిలిపోతాను; ఒక సమయంలో రెచ్చిపోతాను. రజకునిపై నా ప్రతాపం చూపుతాను. ఆ ఘట్టంలో అద్వితీయంగా నటించానని నా స్వంత అభిప్రాయం.

ప్ర : ఒక్క తెలుగు రంగంతోనే తృప్తిపడతారా ?

జ : కాన్వెంట్ పిల్లను. ఆంగ్లంలో ధారాళంగా మాట్లాడుతాను. ఇంట్లో బెంగాలీ నిత్యమూ మాట్లాడుకొనేదే. తండ్రి భాష తెలుగు. హిందీలో మంచి ప్రవేశం వుంది. తమిళం నేర్చుకొంటున్నాను. తెలుగు మొదటి మెట్టు మాత్రమే.

"కన్నె మనసులు" చిత్రం కోసమం... సుబ్రప్పు స్వారీ కూడా నేర్చుకొన్న సంధ్యారాణికి ఎమోషనల్ రోల్స్ కయితే మీనాకుమారి, సోఫియాలారెన్ ... రోల్స్ కయితే సాధన. ఆడ్రీ హెప్‌బర్న్, ఎలిజబెత్ టైలర్‌లు అనర్హ తారలు.

సంధ్యారాణి మాట్లాడుతుంటే బలమైన కంఠమే కాక ఏదో ఒక మధుర్యం కూడా నాట్యం చేస్తూ వుంటుంది. వింజామరాల వంటి రెప్పల అడుగున కల విశాల నేత్రాలు ఏ నటనా పరీక్షలోనైనా దీక్షతో కక్షతో జయించ గల నన్న సంకల్ప శక్తిని విరజిమ్ముతూ వుంటవి.

# "సంగీత లక్ష్మి"

పాడే తారలు కొరవడడంతో సంగీత చిత్రాలు వెనుకపడ్డాయి.

నాగయ్యతరం అయిపోయింది. సైగల్ ఏనాడో గతించారు.

కననబాల ఏనాడో రంగంనుంచి విరమించుకొన్నారు. భానుమతి ఇంకా అక్కడా ఇక్కడా వున్నా ఒక కాలు బైటకే వేసి వున్నారు.

నాటికీ నేటికీ సాంఘికాలలో సంగీత చిత్రాలు చాలా చాలా అరుదు. ఎప్పటి "స్ట్రీట్ సింగర్"? ఇప్పటికీ చెప్పదగింది ఒకటో అరో.

మన తెలుగు రంగంలో సాంఘికేతర సంగీత చిత్రాలు వచ్చాయి. "త్యాగయ్య", "రామదాసు", కొంత వరకు జయభేరి, జయదేవ, అమర సందేశం ఈ కోవకు చెందినవే.

సంగీత చిత్రం కాకపోయినా "మల్లీశ్వరి"కి ఆ పేరే ఎక్కువగా దక్కింది. ఇన్నాళ్ళకు మళ్ళీ సంగీతం పేరుతో ఒక చిత్రం వచ్చింది. "సంగీత లక్ష్మి" సాంఘికం కూడా.

ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకత్వం వహించడం, ఘంటసాల, సుశీల, జానకి పాటలు పాడడం సంగీత చిత్ర స్థాయిలోనే జరిగాయి.

పాటల చిత్రీకరణలో కూడా ఒక ఉన్నత ప్రమాణం కానవచ్చింది. ...కా నాయకులను కలిపింది సంగీ... విడదీసింది సంగీతమే. అలానే



భారత్ ఫిలింస్ వారి "భక్త పోతన" చిత్రంలో బాలయ్య, గుమ్మడి

స్త్రీ బిడ్డలను వేరు చేసిందీ సంగీతమే. కలిపిందీ సంగీతమే.

చిత్రం పేరుకు తగ్గట్టు కథలోకూడా ముఖ్య భూమిక వహించింది కూడా సంగీతమే.

అయితే ఇంతటి సంగీత ప్రధాన చిత్రమిచ్చే సందేశం ఏమిటి అని ప్రశ్నిస్తే పూర్తి సంతృప్తి కరమైన సమాధానం రాదు.

ఈ చిత్రం ద్వారా నిర్మాతలు సీతా రామాంజనేయ పిక్చర్స్ చెప్పదలచింది ఏమిటి? అని ప్రశ్నిస్తే దానికీ కర్ణ సుఖకరమైన సమాధానం రాదు.

ఫ్యామిలీ సెంటిమెంట్ లో సంగీతం దట్టించి బాక్స్ ఆఫీస్ ఫార్ములా ఒకటి తయారు చెయ్యడం తప్పితే ఏ సంగీత సమస్యను "సంగీతలక్ష్మి" పరిష్కరించ లేదు.

అయితే ఒక సంగీత సమస్యను పరిష్కరించడానికి కథకుడు, స్క్రీన్‌ప్లే రచయిత, దర్శకుడు అయిన గిడుతూరి సూర్యం, సంభాషణ కర్త ఆత్రేయ, సంగీత దర్శకుడు రాజేశ్వర రావు కొంత ప్రయత్నం మాత్రం చేసినట్లు తోస్తున్నది. అయితే అదైనా అప్రయత్నంగానే జరిగిందేమో. అయినా కృషి కృషే. మెచ్చదగింది.

సంగీతం, అందులో ఆధునిక సంగీతం మడిగట్టుకు కూర్చోనరాదని. విదేశ బాణీలను, ఆ మాటకు వస్తే

విదేశ సంగీతాలలోని ఏ మంచినైనా తీసుకో వచ్చునని, అటువంటి సంగీతం ప్రయోజనం ప్రజలను రంజింప జెయ్యడం, ఉత్తేజపరచడం కాదగుననీ "సంగీత లక్ష్మి" యిచ్చే సందేశం అయివుండవచ్చు. కథానాయకుడి లక్ష్యం అది. పైన వివరించినటువంటిది. కథానాయిక లక్ష్యం తద్భిన్నమైనది. కళ కళకోసమే ప్రజలకు గాదు అన్నట్లు సంగీతకళ పవిత్రమైనదని, సంకరములు కూడదని ఆమె మతం. అటువంటి నాయిక తుదకు సంగీతం ఏ విధంగా ప్రజోత్తేజానికి వినియోగపడగలదో గ్రహించి జాతీయ రక్షణ నిధి సేకరణకు దిగుతుంది.

ఈ సంగీత లక్ష్యం అతుకుల కథ అడుగునపడి పైకి రాలేదు. లక్ష్యం అంటూ ఒకటి ప్రశ్నల్లో లోతులు తరచి చూస్తే కన్పిస్తూంది.

నాలుగు ముక్కల్లో కథ.

సంగీతపు శాస్త్రీయ తత్వంలో నమ్మకం కల రాధ, పాటకు పల్లవి వలె తనకు ప్రాణమైన వేణును ప్రేమించి, తండ్రిని తిరస్కరించి వివాహమాడుతుంది. శాస్త్రీయ సంగీతంతో వేణుకు జీవితం గడవదు. విదేశ సంగీత బాంధవ్యం ఆశిస్తుండగా నళిని అనే నర్తకితో విదేశ యాత్రావకాశం లభిస్తుంది. ఒక నర్తకికి సంగీతం ఊడిగం చేయరాదని రాధ అంటుంది. సంగీతానికి అవధులు, నిర్బంధాలు లేవని వేణు అంటాడు. విదేశాలకు వెడతాడు. తిరిగి వస్తూ, ఓడ ప్రమాదానికి గురి అవుతాడు. ఈలోగా రాధ తన పైఖరిని మార్చుకొని తన సంగీతాన్ని దేశంకోసం వినియోగిస్తుంది. గాన సరస్వతి అనే బిరుదుకు అర్హురాలౌతుంది. కాని ఆ బిరుదుకు తాను అర్హురాలంటూ 14 ఏళ్ళ బాల గానసరస్వతి వచ్చింది. ఆమె వెంట తండ్రి వచ్చాడు. బాలగాన సరస్వతి గాన సరస్వతిని సవాలు చేసింది. పెద్ద సరస్వతి గానంలో నెత్తురు కక్కుకొంటుంది. బాల సరస్వతి గెలుపొందినా తండ్రి ఆందోళన పడ్డాడు. కారణం ఈ బాల గాన సరస్వతి గాన సరస్వతి స్వంత కూతురు కావడం. ఈ తల్లీ బిడ్డలమధ్య పోటీ పెట్టించింది, వేణు. పెద్ద గాన సరస్వతి స్పృహ తప్పి పడివుంటే ఆ పాటకు పల్లవి అయిన వేణు "పాటకు పల్లవి ప్రాణం" పాడి రాధకు పునరుజ్జీవనం కలిగిస్తాడు.

బాల గాన సరస్వతి గాన కళతో కళకళ లాడే "సంగీతలక్ష్మి" గా కీర్తించ బడుతుంది.

వేణుగా రామారావు,రాధగా జమున, రాధ తండ్రిగా రంగారావు, రాధ కుమార్తెగా లత చక్రవర్తిగా నటించారు.

కథలో తన పాత్రకు బిగువు వున్నంత వరకు రంగారావు ఉత్తమంగా నటించారు. పాత్ర బిగువుతో నిమిత్తం లేకుండానే ఆద్యంతం, విశేషించి చివరి ఘట్టాలలో రామారావు, జమున విశిష్టంగా నటించారు.

కథలో ఒక పెద్ద లోపం: కూతురు పాప తప్పిపోయిందని రాధకు



సురేష్ ప్రొడక్షన్స్‌వారి "కృష్ణ తులాభారం" సెట్‌పై
నిర్మాత డి. రామానాయుడు, కెమెరామేన్ అన్నయ్య,
దర్శకుడు కె. కామేశ్వరరావు, జమున, అంజలి
సత్యభామా రుక్మిణులు

---

**తెలిసినప్పుడు** ఆమె ఆవేదన చెందకుండా సంగీతంలో ఉన్నత శిక్షణ పొందడం. ఏ తల్లి అలా చెయ్యదు. ఇది సంగీత చిత్రమైనందుకు రాధ సంగీత సముద్రంలో మునిగిపోయి బాంధవ్యాలు గుర్తించే స్థితిలో లేదనే సంఘటన సృష్టించి పాప పరారీ అయినా పట్టించుకోలేదని నిరూపించి వుంటే సంగీత చిత్రానికి బలమైన జీవం వచ్చి వుండేది.

కథలో లోటుపాట్లు వున్నా ఇతర ఆకర్షణలు అనేకం వున్నందున, దృశ్య చిత్రీకరణ యింపుగా వున్నందున అవి కొట్టవచ్చినట్లు కన్పించ లేదు.

చిత్ర సాంకేతిక ప్రమాణాలు ఇలా వున్నవి:

స్క్రీన్‌ప్లే: కథకంటె కథా సంవిధానం పాటించి. స్క్రీన్‌ప్లే రచయిత గిడుతూరి సూర్యం. పాపతో.

పాప బొమ్మతో నడిచిన ఎమోషనల్ కథ, పాటలో గానానంతర నేపథ్య సంగీతంతో ఇతర పాత్రలను సందర్భాలను జోడించడం వంటివి. పాటల మధ్యలో స్టాక్ షాట్స్ వినియోగించిన తీరు స్క్రీన్‌ప్లే విశిష్టతకు నిదర్శనాలు.

దర్శకత్వం: ఉత్తమ దర్శకునికి అవసరమైనవి భావనాబలం (ఇమాజినేషన్), సృష్టి (క్రియేషన్), ఆచరణ (ఎగ్జిక్యూషన్). ఇవి మూడూ చిత్రంలోని ఎక్కువ భాగాలలో కన్పించినవి. తొలి ప్రయత్నంలోనే ఇంతటి ప్రజ్ఞ చూపినది గిడుతూరి సూర్యంగారు.

ఛాయాగ్రహణం: "లో"కీ తప్ప [illegible] సమయాలను నేత్రోత్సవంగా చిత్రీకరించారు. ముఖ్యంగా జమునను పక్కగా ఫొటోగ్రాఫ్ చేశారు అన్నయ్య.

ఆత్రేయ సంభాషణలు, ప్రముఖుల కవిత సినిమా స్థాయిని మించి పండితుల మన్ననలు పొందేటట్లున్నవి.

ఇతర సాంకేతిక ప్రమాణాలు చెప్ప తగనివికావు. తొలి ప్రయత్నంలోనే కొత్త తరహా చిత్రం తీసిన నిర్మాతలు నరసింగరావు, రామసుబ్బారావు అభినందనీయులు.

## "సోవియట్" సూర్యం

"మీనియేచర్ అడివి బాపిరాజు" అన్న పదాలతో శ్రీ గిడుతూరి సూర్యంను అభివర్ణిస్తే ఆయన మూర్తి అర్థం అవుతుంది.

"కులపతి" గుణపతి అడవి బాపిరాజు చిత్రకారుడు, కవి, గాయకుడు, నవలా రచయిత, నటుడు. ఈ లక్షణాలన్నీ ఆయన ప్రియశిష్యుడు సూర్యంలో ఇమిడి వున్నవి. సోవియట్ రష్యాలో, యూరోపులో చాలాకాలం వున్నందువల్ల సూర్యం తన ప్రజ్ఞలకు మెరుగు దిద్దుకో గలిగారు.

విజయవాడలో హైస్కూలు వరకు చదువు, గుంటూరులో బి. ఏ. వరకు చదువు సాగించిన సూర్యం మద్రాసులో కృష్ణన్, పంజూ, ఎన్. ఎస్. కృష్ణన్, భీమ్‌సింగ్‌ల వద్ద సినిమా శాస్త్రంలో ఓనమాలు దిద్దారు. అంనాటి "పెళ్ళి కూతురు," "సింగారి" వంటిచిత్రాలలో పై వారితో కలసి పనిచేశారు. దరిమిలా "రక్షరేఖ" తెలుగుచిత్రానికి ఆర్. పద్మనాభన్ వద్ద సహాయ దర్శకునిగా పని చేశారు. ఆ రోజుల్లో నవయుగ డిస్ట్రిబ్యూషన్ సంస్థ ఏర్పడి తొలి చిత్రాలలో ఒకటిగా "రక్షరేఖ"ను తీసుకొన్నారు. దరిమిలా "పల్లెటూరు" చిత్రంలో ఒక చిన్నవేషం వేశారు. 1952 ప్రాంతాల "మానవుడు చిరంజీవి" అనే మూగ నాటికను (పాంటొమైమ్) రచించి, ప్రదర్శించి కె. వి. రెడ్డివంటి పెద్దల మన్ననలు పొందారు.

కొంతకాలం విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో అనౌన్సర్‌గా పని చేసి, చిత్రకళకు, వ్యాపారానికి సంబంధించిన పనులకై న్యూఢిల్లీ వెళ్ళి



“భక్త పోతన”లో పద్మిని.



నాటకం, చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించారు.

అవే సూర్యంకు సోవియట్ మార్గం చూపినవి. భారత ప్రభుత్వపు సిఫారసుపై మాస్కోలోని విదేశ భాషా ప్రచురణాలయంలో తెలుగు అనువాదకుడుగా 1959 డిసెంబర్‌లో నియమితులైనారు.

ఈయన పూనికపై మాస్కోలో పెక్కు తెలుగు గ్రంథాలు ముద్రితమైనాయి.

అప్పటి ఆయన సారస్వత కృషి

లా వుండగా మాస్కోలోని పెద్ద స్టుడియో మాస్ ఫిల్మ్ స్టూడియోలోను, టెలివిజన్ స్టుడియోలోను, భారతరాయ బారి కార్యాలయం సిఫార్సుపై చిత్ర కళ, దర్శక శాఖలలోను శిక్షణ పొందారు.

మాస్కో టెలివిజన్ స్టుడియోస్ వారి "అలగ్ అలగ్ రస్తా" భారత నాటక ప్రదర్శనం లోను, మాస్కో మల్టిపుల్ ఫిల్మ్ స్టుడియోస్ వారి "ప్రేమించిన మేఘం" పప్పెట్ చిత్ర నిర్మాణంలోను పాల్గొని విజ్ఞా నార్జన చేశారు.

మాస్కో నటీమణి శ్రీమతి వేరా అకోస్కోవా వంటి వారలకు భారత నృత్యాలను; ప్రత్యేకించి ఆంధ్ర జాన పద నృత్యాలను నేర్పారు.

మాస్కో స్టేజిపై శ్రీ సూర్యం జానపద నృత్యాలను స్వయంగా ప్రదర్శించారు.

మాస్కోలో టెలివిజన్, పప్పెట్, కార్టూన్, ఫీచర్ చిత్ర నిర్మాణ శాఖలలో శిక్షణపొంది, ఐరోపా అంతా పర్యటించి 1961 జూన్‌లో భారత దేశానికి తిరిగి వచ్చి ఢిల్లీ టెలివిజన్ కేంద్రంలో ప్రత్యేక కార్యక్రమాలు ప్రొడ్యూస్ చేశారు. "వాసవదత్త", "శకుంతల" హిందీ నాటకాలను, సాంఘిక నాటకాలను కూడా ప్రదర్శిం చారు.

సూర్యంకు పెక్కు భాషలలో ప్రవేశంవుంది. తెలుగు, ఆంగ్లం, హిందీ, ఉర్దూలే కాక రష్యనులో ధారా ళంగా మాట్లాడ గలరు; వ్యాకరణ శుద్ధితో వ్రాయ గలరు. రష్యాలో వున్నప్పుడు శ్రీ సూర్యం షుమారు 20 రష్యన్ గ్రంథాలను తెలుగులోకి అనువ దించారు. మాస్కోలోని "హౌస్ ఆఫ్ యాక్టర్స్" వారి కోరికపై "భారత జానపద నృత్యాలు" అనే చిన్న పరి శోధన గ్రంథాన్ని వ్రాసి యిచ్చారు. సోవియట్ రాజధానిలోని "ఎత్నో గ్రఫీ ఇన్‌స్టిట్యూట్" వారి కోరికపై "ఆంధ్ర జానపద గేయాలు"పై పరి శోధనా, పరిశీలనా పూర్వక నివేదిక తయారుచేసి యిచ్చారు. సోవియెట్ పత్రికలు వీరి గేయాలు, వ్యాసాలు, కళా ప్రదర్శనల సమీక్షలూ ప్రచు రించినవి.

మాస్కోలోని ఓరియంటల్ ఇన్‌స్టి ట్యూట్ ఆఫ్ అకాడమీ ఆఫ్ సైన్సెస్‌కు తెలుగు అధ్యాపకులుగా పని చేస్తూ ఆధుని కాంధ్రకవుల గేయాలను రష్యన్‌లోకి అనువదించడంలోను. శ్రీ గురజాడవారి రచనలను రష్యన్ లోకి అనువదించడంలోను సహాయ పడ్డారు.

1962 లో మద్రాసు వచ్చినమీదట భీమ్‌సింగ్‌వద్ద చేరి 'పచ్చయ్ విళక్కు' (ఆకుపచ్చ దీపం) అనే తమిళ చిత్రా నికి కథ సమకూర్చారు. ఆ తమిళ చిత్రం యిప్పుడు "మా అన్నయ్య" అన్న పేరుతో తెలుగులో డబ్ చేయ బడి విడుదల అవుతున్నది.

భీమ్‌సింగ్‌తో వున్నప్పుడే ఆమరా రామ సుబ్బారావుకు సూర్యం పరిచయం కావడం. శ్రీ సుబ్బారావు మిత్రుల సహకారంతో శ్రీ సీతారామాంజనేయు



"కన్నె మనసులు"లో రామమోహన్

పిక్చర్స్ స్థాపించిన మీదట సూర్యంను కథకునిగా, దర్శకునిగా తీసుకోవడం "సంగీతలక్ష్మి" రూపొందించడం జరిగింది.

ఒక చిత్ర సంఘటన. 1944 ప్రాంతాల ఎన్. టి. రామారావు, సూర్యం (గిడుతూరి కనక సూర్యనారాయణ. జననం 17-1-1920. విజయవాడ) సబిన్స్పెక్టర్ ఉద్యోగానికి సెలక్షన్‌కు వెళ్ళారు. నాటినుంచి రామారావుతో సూర్యంకు పరిచయం "సంగీతలక్ష్మి" శీఘ్రగతిని రూపొందడానికి అలనాటి పరిచయం చాలా కారణమైంది. ఈ మధ్యలో యిద్దరూ కలసి "పల్లెటూరు"లో నటించారు.

సూర్యం తన విదేశ యాత్రలు గురించి రామారావుకు మొట్టమొదటి సారి చెప్పినప్పుడు "అదృష్ట వంతులవు. నాకు ఒక్కరోజు కూడా అందుకు విరామం వుండదు కదా. భార్యా మణితో పాటే పర్యటించారుగా. మహా అదృష్ట వంతులు" అని అన్నారు.

సూర్యంతో మా ప్రతినిధి జరిపిన గోష్ఠి వివరాలను ప్రశ్నోత్తరాల రూపంలో తెలుపుతున్నాము:

ప్రశ్న: "సంగీతలక్ష్మి" నే చిత్ర కథగా ఎన్నుకొనడంలో మీ ఉద్దేశ మేమిటి ?

జవాబు: నాకు బాల్యం నుంచీ

లలిత కళలన్నిటిలో అభిరుచి. సంగీతానికి ప్రాధాన్యం ఉంది కాబట్టి ఈ సబ్జక్టు నిర్ణయించాను. ఇక మీదట "నాట్యలక్ష్మి" "కళాలక్ష్మి" "సాహిత్యలక్ష్మి" పేరిట ఒక్కొక్క చిత్రం తీయాలని అనుకొంటున్నాను.

ప్ర : ఇటువంటి హై లెవెల్ చిత్రాలు తెలుగులో డబ్బు చెయ్యవనే అభిప్రాయం వుండేది. అయినా మీకధే కదా అని చిత్రం తీయదలచారా? ఎవరి డబ్బో కదా అని రంగంలోకి దిగారా?

జ : అటువంటి కథ ఎవరిదైనా తీసుకునే వాణ్ణి. నాకే అంత డబ్బు వుంటే నేనే నా డబ్బుతో తీసేవాణ్ణి.

ప్ర : చిత్ర నిర్మాణంలో మీ లక్ష్యమేమిటి?

జ : భీమ్‌సింగ్ గారి పద్ధతి. ఒక చెంప కళాప్రయోజనం. అంటే పర్పస్ ఫుల్ చిత్రంతీయడం. వేరొకచెంప బాక్స్ ఆఫీస్ ఆకర్షణలు దట్టించడం, వాటికీ, వాటికీ "సెంటిమెంటు" జోడించడం.

ప్ర : సోవియెట్ రష్యాలో మీ సినీ విజ్ఞానార్జన "సంగీత లక్ష్మి" నిర్మాణంలో ఏ విధంగా అయినా ఉపకరించిందా?

జ : ఇచ్చట ఉన్న పరిస్థితులకు, పరిమితులకు, వాతొలి ప్రయత్నంపలుకుబడికి లోబడి పనికి వచ్చింది. రష్యాలో ప్రయోజనాత్మక చిత్రాలే తీస్తారు. ఈ స్టెటిక్ విలువలు ఎక్కువ. మాంటేజెన్ పూర్వ నిర్వచనం ప్రకారం వుంటవి. "సంగీతలక్ష్మి" లో నేను వాటిని ఉడుతా భక్తిగా ప్రయోగించాను.

ప్ర : అంతేనా? ఇంకొన్ని కూడా వున్నాయనుకొంటానే. జ్ఞాపకం తెచ్చుకోండి.

జ : రష్యన్ యాంగిల్స్ జగత్ప్రసిద్ధి చెందినవి. వాటిని సమయోచితంగా మద్రాసు పరిమితులకు లోబడి ప్రవేశపెట్టాను.

ప్ర : అంతటి గొప్ప యాంగిల్సును చివరి దృశ్యాలలో ఉపయోగించలేదేమి? తల్లిబిడ్డల మధ్య సంగీతం పోటీలో కాని, భర్త భార్య ప్రాణాలను సంగీతంతో కాపాడేటప్పుడు కాని రష్యన్ యాంగిల్సును ఎందుకు వినియోగించ లేదు?

జ : ఆ ఘట్టంలో ఎమోషన్ ప్రధానం. సూటిగా, సాఫీగా తీయాలి. యాంగిల్స్ పెడితే ప్రేక్షకుల దృష్టి కథాంశం నుంచి తప్పి పోతుంది.

ప్ర : సంగీత చిత్రం కదా, చివరిలో సంగీతంతో భార్యకు ప్రాణం తెచ్చేటప్పుడు త్యాగరాజు, రామదాసు. "ఝనక్ ఝనక్ పాయెల్ బాజే"లోని ఒక ఘట్టం జ్ఞాపకం రాలేదా? ఆ వోకడలలో పోయి యింకా విశిష్టంగా చిత్రీకరించ లేకపోయారా?

జ : తీసింది, మా పరిమితులకు లోబడి నాకు సంతృప్తికరంగా వుంది. అది లేదేం? ఇది లేదేం? అని అనుగుతూపోతే ఆకాశమే పరిమితి అవుతుంది.

ప్ర : మీ భవిష్యత్తు?

జ : కళాభిమానులే చెప్పాలి.

# ఈ నెల పోటీలో గెలుపొందిన అభ్యర్థులు



ప్రథమ బహుమతి పొందిన

ఆర్. వి. చలపతి



ద్వితీయ బహుమతి పొందిన

సోమంచి రమాదేవి



ద్వితీయ బహుమతి పొందిన

బంగారు విజయ భాస్కర్

# చలనచిత్ర వార్తలు

## ఆగస్టులో పూర్తయ్యే "అర్ధరాత్రి"

పి. సాంబశివరావు అనే కొత్త దర్శకుని, భారతి అనే కొత్త నాయికను, రాధిక అనే కొత్త సహాయ తారను పరిచయం చేస్తున్న హైదరాబాద్ మూవీస్ వారి "అర్ధరాత్రి" జూలై మధ్యకు 12 ఎడిటెడ్ రీళ్ళు తయారైనది. అప్పటికి హీరో సెట్‌పై షూటింగ్ పూర్తి అయింది. శారదా స్టుడియోలో ఆ అందమైన సెట్ వేశారు. జగ్గయ్య, భారతి, రమణారెడ్డి, రాధిక, రావి కొండలరావు, నిర్మల, పెరుమాళ్ళు, చదలవాడ, సీతారామ్ మొదలైనవారిపై చిత్రీకరణ జరిగింది. వారి మూడు నాలుగు చిన్న సెట్లతో పనివుంది. ఆగస్టు మాసాంతరంలో కాని, సెప్టెంబర్ ఆరంభంలో కాని విడుదల కాగల ఈ సస్పెన్స్ చిత్రం నిర్మాత పి.గంగాధరరావు. ఆరుద్ర, సత్యనారాయణ, వేణు ఇతర ముఖ్య సాంకేతిక ముఖ్యులు.

## జయంతి జానపదం

జయంతి వారి జానపదం స్క్రిప్టు సిద్ధమైంది. అడుగడుగునా నవ్వత్వం తొణికిసలాడేకథ. ఆగస్టుమాసాంతంలో కాని, సెప్టెంబర్‌లో కాని కెమెరా దర్శనం చేసుకొంటుంది. రామారావు, బి. సరోజాదేవి ముఖ్య పాత్రధారులు. రచన : పింగళి నాగేంద్రరావు. దర్శకుడు : కె. వి. రెడ్డి.

## హాస్య జానపదం

"పరమానందయ్య శిష్యులకథ" హాస్య భరిత చిత్రం తీసినటువంటి శ్రీదేవీ ప్రొడక్షన్స్ వారు "భువన సుందరి కథ" అనే కొత్తరకం హాస్య జానపదం తీయబోతున్నారు. కథను జి. వి. జి.సమకూర్చారు. సి. పుల్లయ్య దర్శకులు, తోట సుబ్బారావు నిర్మాత, రామారావు నాయకుడు. శ్రీ దేవీ పిక్చర్స్ పేరుతో మరొక జానపదం కూడా త్వరలో సెట్స్‌కు వెళ్ళవచ్చు.

## ఆగస్టులో ముస్తాబయ్యే "డాక్టర్ ఆనంద్"

రవీంద్ర ఆర్టు ప్రొడక్షన్స్ వారి "డాక్టర్ ఆనంద్" జూలై మూడవ వారానికి 14 ఎడిటెడ్ రీళ్ళు సిద్ధంకాబోతున్నది. నాయిక కాంచన ఒక పాశ్చాత్య నృత్యం చెయ్యవలసివున్నది. "సంగీతలక్ష్మి"లో విజయలక్ష్మి నాట్యాలకు ఏ మాత్రం సంబంధం వుండకూడదనే వుద్దేశంతో "సంగీత లక్ష్మి" నిర్మాణ దశలో వున్నప్పుడే రవీంద్రవారు ఆ చిత్ర నాట్యాలను చూచారు. ఈ సంచిక

వెలువడే సరికి కాంచన సాట్కోల చిత్రీకరణ పూర్తి అయి వుంటుంది.

డాక్టర్ ఆనంద్ ఒక రకమైన హాస్య సంఘర్షణ చిత్రం. డాక్టర్ ఆనంద్ సంసార జీవితం ఆనందప్రదమైనది. భార్య, కూతురు ఆ సంసార అమృత భాండంలో, మనశ్చాంచల్యం కలిగిన ఓ నాట్యకత్తె విషతుల్య బిందువు వస్తుంది. అనంతర పరిణామాలు అమిత ఉద్రిక్తంగా సాగుతవి. రామారావు, అంజలి పోటాపోటీగా నటించిన ఈ చిత్రంలో బేబి పద్మావి. మాష్టర్ ఆదినారాయణ ఆనందపు జల్లులు కురిపిస్తారు. ఆగస్టులో షూటింగ్ పూర్తి అయ్యే ఈ చిత్రానికి కె. వి. మహదేవన్ సంగీత దర్శకుడు. హీరాలాల్ నృత్య దర్శకుడు. రాధాకృష్ణ దేవుడు నృత్యానికి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కవిత కూర్చాడు. దర్శకుడు వి. మధుసూదనరావు.

## ఆగస్టులో సెట్స్‌కు వెళ్ళే జానపదం

"అగ్గిబరాటా"ను మించిన రథ హేంతో, "అగ్గిబరాటా"లో లేవి ట్రిక్ షాట్స్‌తో మరికు పిక్చర్స్‌కు విశలా బావ్య నిర్మించే జానపదం ఆగస్టులో సెట్స్‌కి వెళుతోంది. కాంతారావు, కృష్ణకుమారి ప్రధాన పాత్రధారులు. ట్రిక్స్ - [illegible]

## "రంగుల రాట్నం"లో పతాక సన్నివేశం

వాహినీవారి "రంగుల రాట్నం"లో వాహినీ స్టుడియోస్‌లో జూలై 1వ తేదీనుంచి 12వ తేదీ వరకు పతాక సన్నివేశం, కొంత ప్యాచ్ వర్క్ షూట్ చేశారు. రక్తం పంచుకొన్న అన్నదమ్ములు (రామమోహన్, చంద్రమోహన్) ఎన్నికలలో ఒకరికొకరు పోటీగా నిలబడి ఉద్రిక్తులై పోరాడి. తల్లినే (అంజలి) గాయ పరచిన ఘట్టం పతాక సన్నివేశం. గాయపడ్డ తల్లి "రక్తం పంచుకుపుట్టిన మీరు నారక్తం కళ్ళారా చూచారా." అంటుంది. తల్లి భూమికను భారతమాతగా రూపొందించారు. జూలై మాసాంతానికి నాల్గింట మూడువంతులు షూటింగ్ అయిపోతుంది. ఆగస్టులో మిగిలినది కూడా ముగించ బడుతుంది. ఎడిటింగ్‌కు ఒక నెల పట్టుతుంది. తెర వెనుక హీరోలు బి. ఎన్. రెడ్డి, ఎస్. రాజేశ్వరరావు, పద్మరాజు, నరసరాజు.

## యమలోకం చూపించని "యమలోకంలో భూలోకం"

గౌరీ ప్రొడక్షన్స్ వారి "యమలోకంలో భూలోకం" షూటింగ్ జులైలో పూర్తి అయింది. నిజానికి ఇందులో యమలోకం చూపనే చూపరు. భూలోకంలో చేసిన అన్యాయాలకు శిక్ష అనుభవించడానికి వేరే యమలోకానికి వెళ్ళ నవసరంలేదని,

ఆ యమలోకం భూలోకంలోనే వుందని ఈ చిత్రం చెబుతుంది.

## నాగేశ్వరరావు చిత్రాలు

జగపతివారి "ఆ స్తిపరులు" జూలై మాసాంతం షెడ్యూల్‌లో షూటింగ్ దశ దాటుతుంది.

విక్రమ వారి "వసంతసేన"లో కొన్ని ఘట్టాలు హైదరాబాద్‌లో చిత్రీకరించారు. 10 రీళ్ళకు పైగా తయారైంది.

అన్నపూర్ణావారి "పూలరంగడు"కు ఆదుర్తి సుబ్బారావు డైరెక్టు చేస్తారు.

భరణీ వారి "గృహలక్ష్మి"లో నాటక కంపెనీ ప్రసక్తి నాలు జూలైలో చిత్రీకరించారు.

శ్రీ కమలా ఫిలిమ్సు వారి "ఇద్దరు తిక్కన"లో తిక్కన నాయికను నాగేశ్వరరావు ధరిస్తారు. జమున, ప్రభాకరరెడ్డి, హేమలత మొదలైన వారు కూడా నటించే ఈ చిత్రం హైదరాబాద్ సారధి స్టుడియోస్‌లో తయారౌతుంది.

ముళ్ళపూడి రచనలో పద్మశ్రీవారి చిత్రం స్క్రిప్టు సిద్ధమైంది.

* * *

భారత్ ఫిలిమ్సువారి "భక్తపోతన" సర్వాంగసుందరంగా తయారై విడుదలకు నిరీక్షిస్తున్నది.

నెల్లూరు ఫిలిం జర్నలిస్టుల అసోసియేషన్‌వారు జూలై 8వ తేదీన ఆదుర్తి, సుబ్బారావు, రామమోహన్, కృష్ణ, సుకన్య, సంధ్యలకు సన్మానం చేశారు. మద్రాసు ఫిలింఫాన్స్ వారు జూలై 15వ తేదీన ఉత్తమ సాంకేతికజ్ఞులకు, కళాకారులకు అవార్డులు అందచేశారు.

* * *

## కాంభోజ రాజు కథ

అనంతలక్ష్మి ప్రొడక్షన్స్ వారిపై చిత్రానికి గతనెల 20వ తారీఖున వాహినీలో ప్రారంభోత్సవం జరిగింది.

ఈ చిత్రంలో గుమ్మడి, శోభన్ బాబు, బాలయ్య, చలం. రమణారెడ్డి, బాలకృష్ణ, చదలవాడ, రాజబాబు, ధూళిపాళ. అంజలీదేవి, రాజశ్రీ. ఎస్. వరలక్ష్మి, సూర్యకాంతం. పాత్రధారులు. మాటలు : పరుచూరి... పాటలు : సినారె, కొసరాజు, సంగీతం : పి. ఎ. రాజు. నిర్మాత : భాస్కరరావు, కె. భాను ప్రసాద్ దర్శకుడు : తిలక్.

***

సంపాదకుడు, ప్రచురణకర్త : వి. వి. రాఘవయ్య.
ముద్రణ : జ్యోతి ప్రెస్, కాంగ్రెస్ ఆఫీసురోడ్, విజయవాడ-2.